# సూక్తిసుధాలహరి

[ రెండవ భాగము ]

: : కర్త : :


పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి





పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1941




[ వెల రు 0—12—0

# ఉపోద్ఘాతము



బాలుర మనస్తత్వముల ననుసరించియు, దేశకాలపరిస్థితులను గమనించియు, నవ్యపరిశోధనాంశములను వివిధవిద్యావిషయములను, అందును నేకోన్నతాభివృద్ధి నొసఁగు రీతులను జేర్చి గద్యపద్యకావ్యములనుండి ముఖ్యభాగములను ఏర్చి కూర్చుట నవీనవిద్యావిషయకములుగా నున్నవి. ఇప్పు డీ సూక్తిసుధాలహరిలో సాహిత్యాంశములతోఁ బాటు పై విషయములను దగురీతిఁ జేర్చితిని.

ఇందుఁ జేర్పఁబడిన నన్నయతిక్కనాది, మహాకవుల పోకడలు సాహిత్యవిద్యావిషయమునను, శిబికందవాత్రితము, కఠోపనిషత్తు మొదలగునవి నీతివిషయమునను, మండిరాజుశాసనము అను నపూర్వశాసనము నన్నయకాలమునకును నేఁటికాలమునకును గలభాషాపరిణామమునకును, పవిత్రమగు రామకథతో సంబంధించిన యెనుగురుమహాకవుల విచిత్రమగుపోకడలును, పద్యభాగములోను నవ్యకవిత్వమునకు ఘనాదియగు 'భామినీవిలాస' పద్యములును జూపఁబడెను.

వచనభాగములోను '[illegible]మహర్షి, ఆపస్తంబమహర్షి, కాత్యాయనమహర్షి, శ్రీకుమారిలభట్టాచార్యుఁడు, మొదలగు

వారికథలు బాలురకు నత్యుత్సాహకరములై, గురువులకుఁ బరిశోధనార్థములై యుండ నొప్పును.

ఈగ్రంథమునఁ జేర్చుకొనుటకుఁగాను దయతమగ్రంథములనుండి వేర్వేఱుభాగములను దయతో ననుగ్రహించిన శ్రీమహారాజా విక్రమదేవవర్మ బహద్దరువారికిని, దుగ్గిరాల ప్రకాశరావుపంతులుగారికిని, ఆంధ్రసాహిత్యపరిషత్తువారికిని, ఆకొండి వేంకటశాస్త్రిగారికిని, ఓలేటి వేంకటాచలపతిరావుగారికిని, మాడపాటి హనుమంతరావుపంతులుగారికిని నాకృతజ్ఞతాభినందనముల నర్పించుచున్నాను.

ఇట్లు,

గ్రంథకర్త.



# విషయసూచిక



— వ చ న భా గ ము —





ఓమ్.

# సూక్తిసుధాలహరి

## (రెండవభాగము)

### పరమేశ్వరస్తోత్రము

క. అమృతమయి, ఋగ్యజుస్సా
మముల యుపనిషద్వచస్సమాజములకు వా
చ్యమయిన పురుషోత్తము ని
క్కము రూపగువాని భక్తిగమ్యుఁ దలంతున్. (1)

---

(1) ఈపరమేశ్వరస్తోత్రము తిక్కనసోమయాజికృత మగు నాంధ్ర మహాభారతమునందలి శాంతిపర్వము ద్వితీయాశ్వాసములోనిది. కథ భీష్ముఁడు పరమేశ్వరుని నుతించు ఘట్టములోనిది. గ్రంథకర్త యగు తిక్కనమహాకవి, కవిబ్రహ్మ బిరుదాంకితుఁడు. ఈతఁడు క్రీ. శ 1250 సం॥ర ప్రాంతమున 'నెల్లూరు'నం దుండువాఁడు. ఈ మహాకవి, తొలుత 'నిర్వచనోత్తరరామాయణము' అను గ్రంథమును రచించి నెల్లూరు మండలము నేలు 'మనుమసిద్ధి' భూపాలున కంకితము చేసెను. వ్యాసకృత మహాభారతమును, తొలుత 3 పర్వములు 'నన్నయభట్ట మహాకవి' యాంధ్రీకరించి, కీర్తిశేషుఁడు కాఁగా, మిగిలిన 15 పర్వములను నీమహాకవి యాంధ్రీకరించెను. తిక్కనమహాకవి గొప్ప కవియగుటయే కాక 'కేతన' మహాకవికృత మగు 'దశకుమార' చరిత్ర మను గ్రంథముఁగూడఁ దాఁ గృతినొందెను.

క. సువ్యక్త క్షేత్రంబున
నవ్యక్తాకృతి నిరూఢి ♦ నాసీనుండై
భవ్యత నుండెడు క్షేత్రా
త్మవ్యపదిష్టుఁ బ్రణుతింతు ♦ దామోదరునిన్.

తే. చరణ నాభి శీర్షంబులు ♦ ధరయు నంత
రిక్షమును దివమును, జగ♦చ్చక్షు రగ్ని
దిశలు దృఙ్ముఖ శ్రోత్రముల్ ♦ దీప్తు లెమ్మ
హాంగునకు నట్టిహరిని లో♦కాత్ముఁ దలఁతు.

క. మా సర్వ్వయ నాబ్జ మయో
ద్భాసిత రూపుఁడయి, సృష్టిఁ ♦ బ్రళయంబుఁ దగన్
జేసి, పోలుపారు శౌరి ను
పాసింతును యోగిభో♦గ్యబలుఁ గాలాత్మున్,

క. శరణాగతుండ భక్తుఁడఁ
బరమపదవిఁ గోరెదను శు♦భంబుగ నన్నుం
బరికించి యేది మేల
య్యొరవు దొరకొనంగఁ దలప♦వే! కమలాక్షా!



## —♦ * కచుఁడు మృతసంజీవని నొందుట ♦—

క. మనుజాధిప ! వృషపర్వుం
డను దానవపతికి శుక్రుఁ ♦ డాచార్యుండై
యనిమిష విరోధులకుఁ బ్రియ
మొనరించుచు వివిధ విఘ్న న♦యోపాయములన్. 1

క. దేవాసుర సంగరమున గత
జీవితులగు నసురవరులఁ ♦ జెచ్చెర మృతసం
జీవని యను విద్యఁ బున
ర్జీవులుగాఁ బ్రతిదినంబుఁ ♦ జేయుచు నుండెన్. 2

వ. దాని నెఱింగి దేవతలెల్ల నతిభీతులై యసురుల నోర్వనోపక శుక్రునివలన మృతసంజీవని వడసి తేనోపునట్టి మహాసత్త్వుం డెవ్వం డగునో యని విచారించి, బృహస్పతిపుత్త్రుం డయిన కచునికడకుం జని యిట్లనిరి. 3

* ఈకథ 'ఆంధ్రభాషలో మొదటిగ్రంథము నాంధ్రమహాభారతము ఆదిపర్వము' తృతీయాశ్వాసములోనిది. సంస్కృతమున వ్యాసమహర్షి రచించిన సంస్కృత మహాభారతమును, తెలుఁగునందు క్రీ. శ. 1022 సం॥ మొదలు క్రీ.శ. 1063సం॥ వఱకు రాజమహేంద్రవరము రాజధానిగా నాంధ్ర దేశము నేలిన రాజరాజనరేంద్రు నాజ్ఞచే నన్నయమహాకవి రాజనరేంద్రునికి యంకితమిచ్చి 3 పర్వములు తెనిఁగించెను. నన్నయ తెనుఁగుకవులలో మొదటివాఁడు. వాగనుశాసనబిరుదము కలవాఁడు. ఆంధ్రశబ్దచింతామణి యను, ఆంధ్రవ్యాకరణమును గూడ రచించెను. కథ వైశంపాయనమహర్షి జనమేజయమహారాజునకుఁ జెప్పినది.

క. పోరను మృతసంజీవని
కారణమున నిహతు లయ్యుఁ ♦ గా రసురవరుల్
వారల నోర్వఁగ మన కతి
భారము, దుర్వారవీర్య ♦ బలయుతు లగుటన్. 4

క. మన పక్షంబున వా ర
ద్దనుజులచే నిహతులయ్యుఁ ♦ దగ మృతసంజీ
వని లేమిఁజేసి శమను స
దనమున కరుగుదురు వీర్య♦దర్పితు లయ్యున్. 5

క. కావున మృతసంజీవనిఁ
దేవలయును శుక్రువలన ♦ ధృతిఁ బడసి, తప
శ్శ్రీవిభవ ! దానిబలమునఁ
గావంగావలయు సురని♦కాయబలంబున్. 6

క. బాలుండవు నియమవ్రత
శీలుండవు నిన్నుఁ బ్రీతిఁ ♦ జేకొని తద్వి
ద్యాలలనా దానముఁ గరు
ణాలయుఁడై చేయు నమ్మ♦హాముని నీకున్. 7

వ. దుహితృస్నేహంబునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం డతిక్రమింపండు గావున, నీ నేర్చువిధంబున దాని చిత్తంబు వడసి, శుక్రు నారాధించిన నీ కిష్టసిద్ధి యగు నని, దేవతలు ప్రార్థించి పంచినం గచుండును, దేవహితార్థంబు వృషపర్వు పురంబునకుం జని యచ్చట వేదాధ్యయనశీలుం డయి, సకల

దానవగణోపాధ్యాయుం డయి యున్న శుక్రుం గని, నమ
స్కరించి యిట్లనియె 8

క. ఏను గచుం డనువాఁడ! మ
హానియమసమన్వితుఁడ! బృ♦హస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును
భానునిభా! శిష్యవృత్తిఁ ♦ బని సేయంగన్. 9

వ. అనిన నమ్మునికుమారుని సుకుమారత్వంబును, వినయ ప్రియవ
చన మృదుమధురత్వంబును, ననవరత నియమవ్రతప్రకాశిత
ప్రశాంతత్వంబునుం జూచి, శుక్రుం డతిస్నేహంబున వీనిం
బూజించిన బృహస్పతిం బూజించిన యట్ల యని, యభ్యా
గతపూజల వాని సంతుష్టుంగాఁ జేసి శిష్యుంగాఁ జేసికొని
యున్నంత నక్కచుండు. 10

సీ. పనియేమి పంచినఁ ♦ బదపడి చేసెద
ననక తన్ బంచిన ♦ యాక్షణంబ
చేయుచు నిజగురు ♦ చిత్తవృత్తికిఁ గడు
ననుకూలుఁడై విన♦యంబుతోడ
మనమునఁ జెయ్వుల ♦ మాటల భక్తి నే
కాకారుఁడై మఱి ♦ యంతకంటె
దేవయానికి సువి♦ధేయుఁడై ప్రియహిత
భాషణములఁ బుష్ప♦ఫలవిశేష

ఆ. దానములను సంత • తప్రీతిఁ జేయుచు
నివ్విధమునఁ బెక్కు • లేండ్లు నిష్ఠ
గురుని గురుతనూజఁ • గొలిచి య య్యురుపుర
నెమ్మి వడసెఁ దనదు • నేర్పు పేర్మి. 11

వ. ఇట్లు గురుశుశ్రూషాకౌశలంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుండై యున్న నెఱింగి దానవులు సహింపనోపక బృహస్పతితోడియలుక నక్కుచు నొక్కనాఁడు హోమధేనువులం గాచుచు వనంబున నేకతంబ యున్నవాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించి చని, రంత నాదిత్యుం డస్తగిరిశిఖరగతుం డగుడు మగిడి హోమధేనువు లింటికి వచ్చిన వానితోడన కచుండు రాకున్న దేవయాని దనమనంబున మలమల మఱుఁగుచుం బోయి, తండ్రి కిట్లనియె. 12

ఉ. వాఁడిమయూఖముల్ గలుగు•వాఁ డపరాంబుధిఁ గ్రుంకె
ధేనువుల్। నేఁ డిట వచ్చె నేకతమ• నిష్ఠమెయిన్ భవదగ్ని
హోత్రముల్। పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ • బ్రొద్దును బో
యెఁ గచుండునేనియున్। రాఁడు, వనంబులోన మృగ•రా
క్షస పన్నగబాధ నొందెనో. 13

వ. అనిన విని శుక్రుండు, తన దివ్యదృష్టి నసురవ్యాపాదితుం డైనకచుం గని వానిం దోడ్కొని తేర మృతసంజీవనిం బంచిన నదియును బ్రసాదం బని యతిత్వరితగతిం జని విగత జీవుం డయిన కచు నప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని

వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు సంతసిల్లి యు
న్నంతఁ గొన్నిదినంబులకు, మెండియు నొక్కనాఁడు. 14

క. అడవికిఁ బువ్వులు దేరఁగ
వడి నరిగిన కచునిఁ జంపి ♦ వానిని దనుజుల్
పొడవుసెడఁ గాల్చి సురతోఁ
దడయక యబ్బూది శుక్రుఁ ♦ ద్రావించి రొగిన్. 15

వ. శుక్రుండును సురాపానమోహితుం డై యున్నఁ దొల్లిం
టియట్ల దేవయాని కచుం గానక దుఃఖితయై నేఁడును
గచుండు రాక మసలె నసురులచేత నిహతుం డయ్యెం గావల
యు నని శోకించిన, దానిం జూచి శుక్రుం డిట్లనియె. 16

క. వగవక సంజీవని పెం
పగణితగర్వమున నసురు ♦ లాకచుతోడం
బగఁ గొని చంపెద రాతఁడు
సుగతికిఁ జనుఁ గాక యేల ♦ శోకింపంగన్. 17

వ. అనిన దేవయాని యిట్లనియె. 18

మ. మతిలోకోత్తరుఁ డైనయంగిరసుమ ♦ న్మాన్యుం డాశ్రితుం డా
బృహస్పతికిం బుత్త్రుఁడు మీకు శిష్యుఁడు సురా ♦ పబ్ర
హ్మచర్యాశ్రమవ్రతసంపన్నుఁ డకారణంబ దనుజ ♦ వ్యా
పాదితుం డైన నచ్యుతధర్మజ్ఞ ! మహాత్మ ! యక్కచున
కేఁ ♦ శోకింప కె ట్లుండెదన్. 19

వ. వానిం జూచి కాని కుడువ నొల్ల నని దేవయాని యేడ్చు
చున్నఁ బెద్దయుం బ్రొద్దునకుఁ బ్రసన్నుండై శుక్రుండు దన
యోగదృష్టిం జూచి లోకాలోకపర్యంతభువనాంతరంబునఁ
గచుం గానక సురాసమ్మిశ్రభస్మమయుండై తనయుదరం
బున నున్న యక్కచుం గని సుర సేసిన దోషంబును నసురుల
వలన నైన యపకారంబును నెఱింగి. 20

ఆ. మొదలి పెక్కుజన్మ♦ములఁ బుణ్యకర్మముల్
పరఁగఁ బెక్కు సేసి ♦ పడయఁబడిన
యట్టియెఱుక జనుల ♦ కాక్షణమాత్రన
చెఱుచు మద్యసేవ ♦ సేయ నగునె? 21

క. భూసురు లాదిగఁ గలజను
లీసుర సేవించి రేని ♦ నిది మొదలుగఁ బా
నాసక్తిఁ బతితు లగుదురు
చేసితి మర్యాద దీనిఁ ♦ జేకొనుఁడు జనుల్. 22

వ. అని శుక్రుండు సురాపానంబు మహాపాతకంబుగా శపియించి
తనయుదరంబున నున్న కచు నప్పుడ సంజీవితుం జేసిన
నందయుండి కచుండు శుక్రున కిట్లనియె. 23

క. తనువును జీవము సత్త్వం
బును బడసితి నీప్రసాద♦మున, నీయుదరం
బనఘా! వెలువడుమార్గం
బొనరింపుము నాకు భూసు♦రోత్తమ! దయతోన్. 24

వ. అనిన నాయుదరంబు భేదిల్లినం గాని యిమ్మునికుమారుండు వెలువడ నేరం డుదరభేదనంబున మూర్ఛితుండ నయిన నన్ను సంజీవితుం జేయవలయు నని, శుక్రుండు గచునకు సంజీవని నుపదేశించిన. 25

క. ఉదరభిదాముఖమున న
భ్యుదితుండై నిర్గమించె ♦ బుధనుతుఁడు గచుం
డుదయాద్రిదరీముఖమున
నుదితుం డగు పూర్ణహిమమ♦యూఖుఁడ పోలెన్. 26

వ. అంత. 27

తే. విగతజీవుఁడై పడియున్న ♦ వేదమూర్తి
యతనిచేత సంజీవితుఁ ♦ డై వెలింగె
దనుజమంత్రి, యుచ్చారణ ♦ దక్షుచేత
నభిహితంబగు శబ్దంబు ♦ నట్లపోలె. 28

వ. ఇట్లతిప్రయత్నంబునఁ గచుండు శుక్రువలన సంజీవని వడసె... 29

# * నీతికందవ్రాతము



క. కేశవ! భావింపంగా
నాశాన్వితజనుఁడు దాసుఁ డగు నందఱికిన్
దేశాధిపత్య మున్నను
లేశంబును సుఖముఁ బొందలేఁడు దనమదిన్. 1

---

* ఈ కేశవాది నామములుగల నీతికందవ్రాతము 'శ్రీమహారాజా విక్రమదేవవర్మ రచనలు అను గ్రంథములోనిది. గ్రంథకర్త లగు శ్రీవిక్రమ దేవవర్మ మహారాజావారు నేఁడు జయపుర సంస్థానప్రభువులై విరాజిల్లుచున్నారు. సంస్కృతాంధ్రాంగ్ల ఓఢ్రభాషలలో పండితులగుటచే వీరు, మహారాజబిరుదే గాక, సాహిత్యసామ్రాట్, డాక్టర్ బిరుదులఁగూడ నొందిరి. ప్రాచీనులగు 'భోజమహారాజువలె శ్రీకృష్ణదేవరాయుని' భాతిఁ బెక్కు గ్రంథములఁ గృతి నొందుటయే గాక పండితకవులునునై యున్నారు. వారి రాజ్యము 'ఆంధ్రోత్కల' సంయోగమున నుండుటచే ఓఢ్రాంధ్రభాషలను వీరు సమానముగా నాదరించి యీరెండుభాషలలోను బెక్కుగ్రంథములను రచించిరి. ఇప్పటికి డెబ్బదియొక్క సం॥రములు దాఁటిన వయస్సుగలవా రయ్యు యువకులవలె శక్తిమంతులై రాజ్యలక్ష్మితోఁగూడ కవితాసామ్రాజ్యమును నేలుచున్నారు. వీరు సంస్కృతమున, 'సంధ్యాప్రయోగము' మొదలగు కొన్ని పుస్తకములను, ఆంధ్రమున (1) శ్రీనివాసకల్యాణనాటకము (2)మానవతీచరిత నాటకము. (3)కృష్ణార్జున చరిత్రమునకు టీక. (4)నీతిగీతితతి (5) కృష్ణగీతవ్రాతము. (6) జార్జిపట్టాభిషేకము, మొదలగు గ్రంథములను, ఓఢ్రభాషయందు (1) భగవద్గీతామాహాత్మ్యము (2) ఋతువర్ణనము

క. నారాయణ ! యాపద చే
కూరెడుసమయంబునందుఁ ♦ గొంచెం బయినన్
ధీరతఁ బాయుదు గాదే ?
ధీరవరునిమానసంబు ♦ దృఢతర మగుటన్. 2

క. మాధవ ! కామము లోభముఁ
గ్రోధము సజ్జనిగఁ జేయుఁ ♦ గోవిదు నైనన్
బోధమును గోరుమనుజుఁడు
దా ధీ నిడనీక వానిఁ ♦ దరలింపఁ దగున్. 3

క. గోవింద ! యమృత మయినను
వావిరి యగునేని గరళ♦భావము నొందున్
గావున, వివేకి మితముగ
నేవస్తువు నైన వాడు♦టే యుక్త మగున్. 4

క. శ్రీవిష్ణూ ! యధికముగా
నేవానికిఁ దెలియు వాని ♦ హృదయము సందే
హావృత మై వర్తించును
భావింపఁగ నీదుమాయ ♦ బహువిచిత్రముగా. 5

---

(3) తులసీవిక్రమరామాయణము (బాలకాండ) (4) బుద్ధచరితనాటకము (5) ఉత్కలకుందమాలానాటకము మొదలగునవియు రచించిరి. వీరి ఓడ్రాంధ్రగ్రంథములు పెక్కు 1908 సం॥రము మొదలు నేఁటివఱకు, ఆంధ్ర మద్రాసు యూనివర్సిటీలలో, పాఠ్యగ్రంథములుగా నేర్పఱుపఁబడుచున్నవి. ఈపద్యములు నీతికందవ్రాతములోఁ గొన్నిమాత్రమె.

క. మధుసూదన ! మూఢుఁడు బహు
విధముల గౌరవము నొంది ♦ వెలయుచు నుండున్
బుధశూన్యము లగుపట్టుల,
సుధ దొరకని చోటునందు ♦ సుద్దవిధముగన్. 6

క. బొం కొకటి గవ్వఁ బూనుచుఁ
గొంకక పది బొంకునుడులఁ ♦ గూర్చుదురు ఖలుల్
సంకటసమయమునందును
బొంకరు గద పద్మనాభ ! ♦ పుణ్యాభిరతుల్. 7

క. పంకభయంబును లోకా
తంకంబును జిత్తమునకుఁ ♦ దగులనికతనన్,
సంకర్షణ ! దుర్మార్గుఁడు
జంకక యొనరించు నెగ్గు ♦ సామికి నైనన్. 8

క. తులసీవనిఁ బ్రద్యుమ్నా !
కలంజము జనించుమాడ్కిఁ ♦ గాపురుషుఁడు స
త్కులమున నరుడుగఁ గలిగి వి
మల కులమర్యాద నగ్గి ♦ మంటం బెట్టున్. 9

క. అనిరుద్ధా! కుచ్చితకుల
మున నొకసమయంబునందుఁ ♦ బొడముచు గాదే?
యనవద్యగుణుఁడు బొగ్గుల
గనియందు వినిర్మలమణి ♦ గలిగెడుభంగిన్. 10

క. పండితుఁడు మితాలాపి, య
పండితుఁడు సదస్సునందు ♦ వదరును మిగులన్
నిండినకుండ యధోక్షజ!
యుండుఁ దొణక కెపుడు నద్రి ♦ యూఁపంబడినన్. 11

క. నరునకు స్వకీయదోషము
గురిగింజ విధంబుగానె ♦ గోచర మగుఁ గా
పరుఁ డొనరించినదోషము
ధరాధరమువోలెఁ దోఁచుఁ ♦ దనమదికి హరీ! 12

క. శ్రీకృష్ణ! యసంతృప్తుఁడు
నాకమునకుఁ జనిన మేరు♦నగముం గనినన్
లోకేప్సితసుఖముం గన
లేకుండును జుమి విషాద♦లిప్తహృదయుఁడై. 13

---

## *రావణుని మోక్షాసక్తి

మ. పగవారై నగధారితోఁ దొడరి త♦ద్బాహాబలక్షీణులై
తెగి హేమాక్ష ముఖాసురాగ్రణులు ము♦క్తిం జెందరే! య
గ్గతిన్ బగ గోవిందునియం దొనర్చి సుగతిం ♦ బ్రాపింతు
నంచున్ గడంగి గురుప్రజ్ఞ, సనత్కుమారుకడ కేఁ♦గెన్
వాఁడు బోధార్థియై. 1

* ఈ పద్యములు 'కంకంటి పాపరాజు' కృతమగు 'ఉత్తరరామాయణము'నందలి ఐదవ యాశ్వాసములోనివి. వాల్మీకిరామాయణములోని

తే. ఏఁగి చలిగట్టుపై నొక్క♦యెడ సనత్కు-
మారు జితమారు బ్రహ్మకు♦మారుఁ గాంచి
హర్షపులకితగాత్రుఁడై ♦ యతని కెఱఁగి
హస్తములు మోడ్చి యసుర యి♦ట్లనుచుఁ బలికె. 2

మ. అమలజ్ఞాననిధాన! యీజగములం ♦ దవ్యక్తనానార్థహ
స్యములున్ మీకుఁ గరస్థలామలకముల్ ♦ సర్వజ్ఞులౌ మి
మ్మువంటి మహాత్ముల్ నతులైన శిష్యుల నకౌ♦టిల్యాత్మ
వీక్షించి నిక్కముగా దాఁపక యానతిత్తురుగదా! ♦ కాం
క్షానుకూలార్థముల్. 3

---

యుత్తరకాండమును, తొలుత తిక్కనమహాకవి 'నిర్వచనోత్తర రామాయణము' అను పేరితో నాంధ్రీకరించెను. కాని యది కావ్యఫక్కికగా నుండనందున కాబోలు క్రీ. శ. 1750 సం॥ర ప్రాంతమున నెల్లూరు జిల్లా 'ప్రళయకావేరి' గ్రామనివాసుఁడగు నీ పాపరాజకవి రసవత్తరముగా నాంధ్రీకరించెను. ఈ గ్రంథమును రచించుటలో 'సమీరకుమారవిజయము, భర్తృహరి సుభాషితము' అను గ్రంథములను రచించిన 'పుష్పగిరి తిమ్మన్న' అను కవి యీ పాపరాజకవికిఁ దోడ్పడెనఁట! పాపరాజకవి యక్షగానమగు 'విష్ణుమాయావిలాసము' అను మఱియొక గ్రంథమును గూడ రచించెనఁట! రెండు గ్రంథములను శ్రీకృష్ణునికే యంకితమిచ్చెను. కథ శ్రీరామపట్టాభిషేకానంతరము రాముని జూడవచ్చిన 'అగస్త్యమహర్షి' శ్రీరామునకుఁ జెప్పినది.

మ. అనఘా ! యెవ్వఁ డనాదిమధ్యలయుఁడై ♦ యవ్యక్తుఁడై
యుండు, నెవ్వనిచే నయ్యె నధీశయుక్తమగు వి♦శ్వం బెల్ల,
నెవ్వానిఁ బేర్కొనినన్ బంధవిముక్తి యగా, విబుధవ♦ర్యుల్
బుద్ధి నెవ్వాని వర్తన మూహింపఁగఁ జాల రట్టిఘనునిన్ ♦
దథ్యంబుగాఁ దెల్పవే ? 4

క. నావిని సనత్కుమారుఁడు
రావణునకు ననిెను, వినుము ♦ రక్షోవర ! స
ద్భావముతో నీ వడిగిన
దేవుని మహిమంబు నీకుఁ ♦ దెలిపెదఁ దెలియన్. 5

మ. అనఘుం డవ్యయుఁ డచ్యుతుం డమలుఁ డ♦వ్యక్తుం డని
ర్వాచ్యుఁ డంజనదూరుం డఖిలేశ్వరుం డచలుఁ డ♦క్ష
య్యుం డమేయుం డటంచు, ననాదిశ్రుతు లుగ్గడింప నతి
గాం♦చున్ బ్రహ్మ మాబ్రహ్మమే । విను, నారాయణ కృష్ణ
విష్ణు హరి గో♦విందాఖ్యలం జెల్వగున్. 6

సీ. కన్ను విచ్చినయంతఁ ♦ గలుగు బ్రహ్మాండముల్
గన్ను మూసిన నవి ♦ గాంచు లయము
మదిఁ దలంచినఁ మాత్ర ♦ నొదవు నేక్రియయైన
మదిఁ దలంపకయున్న ♦ మాయ యగును
జేపట్టిన ఖలుండు ♦ శిష్టుఁడై వెలయుఁ జే
పట్టకున్న బుధుండె ♦ పామరుఁ డగు

వలసిన నీరూప♦ముల నైన వర్తించు
వలవకున్న నభంబు♦వలె వెలుంగు

తే. నాదిమధ్యాంతరహితుఁ డ♦వ్యక్తుఁ డఖిల
భువనసృష్టిక్రియాహేతు♦భూతుఁ డతని
సంస్మరించిన సకలదో♦షములు వాయు
హరియ సేవింపఁ దగు దైవ ♦ మసురనాథ ! 7

చ. అన విని రావణుం డను మ♦హాత్మ ! ముకుందునిచేత సంగరం
బున హతులైన శాత్రవులు ♦ పొందెడి సద్గతి యానతి
య్యవే! యన, హరిచేత నొచ్చిన సు♦రారులు శ్రీహరిలోక
మంది యం। దనయము విష్ణురూపధరు♦లై విహరింతురు
రాక్షసేశ్వరా ! 8

వ. అని పల్కి సనత్కుమారుండు వెండియు నిట్లనియె. 9

సీ. ప్రణవంబు జపియించు♦ఫలము కేశవుఁ జేరి
యట్టహాసముఁ జేసి♦యంతలోన
భాగీరథీస్నాన♦ఫలము శ్రీధరుఁ డేయు
నస్త్రాళి మునిఁగిన♦యంతలోన
బహుకాలచింతనా♦ఫలము నారాయణు
నలుకమై వీక్షించి ♦ నంతలోనఁ
బ్రాఁబల్కుల నుతించు♦ఫలము నందకపాణి
నదలించి తిట్టిన♦యంతలోనఁ

తే. దనువు కృశియింప శాంతితోఁ ♦ దపము సేయు
ఫలము బహుమత్సరంబుతోఁ ♦ బద్మనాభు
నాఁగి మెయి వొంగ మార్కొన్న ♦ యంతలోనఁ
గలదు, హరిఁగోడి పగకంటెఁ ♦ గలదె మేలు? 10

చ. చపలత లేని చూడ్కులను ♦ సారెకు శౌరిముఖంబు సూచు
చున్ | విపుల రణోత్సవంబులను ♦ విష్ణుని బేరులు పెట్టి
పిల్చుచున్ | గుపితమనస్కులై యురసి♦కొంచు ముకుందుని
మ్రోలఁ గూలు దైత్యపతులభాగ్య మెంత సుకృ♦తాత్ముల
కైనను గల్గనేర్చునే! 11

చ. పలుకులు వేయునేల? మధు♦భంజనుకిన్నఁ తపఃఫలంబు శ
త్రుల కని, యమ్మహామునివ♦రుం డెఱిఁగించినఁ బంక్తికంధ
రుం | డలరి ముకుందుతో సమర ♦ మబ్బునె? యవ్విభు
చేతఁ జచ్చి నిశ్చలపద మొందఁగాఁ గలనె? ♦ శాంతనిధీ!
వివరింపవే! యనన్. 12

క. సనకావరజుం డిట్లనుఁ
గనకాచలధీర! పంక్తి♦కంధర! వినుమా!
ఘనకాయునితో నని మా
ర్కొని కాయము విడువఁగలవు ♦ కుందకు మదిలోన్. 13

తే. అనిన ముద మంది దశకంఠుఁ ♦ డమ్మహాను
భావుఁ గని యెన్నినాళ్ళ క♦ప్పని యొనర్చ

హరి, యన నతండు వెండియు ♦ ననియెఁ, గృతయు
గాంతమున మానవేంద్రుఁడై ♦ హరి జనించు. 14

సీ. వేల్పులు గావించు ♦ విన్నపంబులు వించు
హరి నిన్ను వధియించు ♦ నాత్మ మెంచు
రవికులాబ్ధిఁ జనించు ♦ రామనామము గాంచు
దపసి జన్నముఁ బెంచు ♦ రిపుల నొంచు
శిలఁ జెల్వ నొనరించు శివునిచాపముఁ దుంచు
జానకి వరియించు ♦ సంతసించు
జామదగ్న్యుఁ గలంచు ♦ జనకాజ్ఞఁ బాలించు
మునివృత్తి ధరియించు ♦ వనిఁ జరించు

తే. నీ సహోదరిముక్కు ఖం♦డింపఁ బంచు
నరగ ఖరదూషణాదుల ♦ సంహరించు
నవనిసుత నీవు గొనిపోవ ♦ నాగ్రహించు
నరి నిమిత్తంబు నిను రాముఁ ♦ డని వధించు. 15

సీ. మణికిరీటమువాఁడు ♦ మకరకుండలకాంతిఁ
దళుకొత్తు చెక్కుట♦ద్దములవాఁడు
నిడుదకన్నులవాఁడు ♦ నీలమేఘచ్ఛాయఁ
గర మొప్పు దివ్యవి♦గ్రహమువాఁడు
కంబుకంఠమువాఁడు ♦ కౌస్తుభశ్రీవత్స
లక్ష్మియుతోరస్స్థ♦లంబువాఁడు

కనకాంబరము వాఁడు ♦ ఖడ్గాదిపంచాయు
ధముల మించు చతుర్భు♦జములవాఁడు

తే. చిలువదిండుపైఁబవ్వ ♦ మెలఁగువాఁడు
లీలఁ బెనుపాముపైఁ బవ్వ♦ళించువాఁడు
నీమనోరథ మీడేర్ప ♦ నిక్కముగను
సంశయింపకు మన్న, రా♦క్షసవిభుండు. 16

ఆ. అతని బెక్కుగతుల ♦ నుతు లొనర్చుచు భక్తి
నతు లొనర్చి, దేవ♦తతులమతుల
నతులభీతు లొదవ ♦ నచ్చోటుఁ బెడఁబాసి
చనియె స్వైరవృత్తి ♦ జనవరేణ్య ! 17

ఉ. రామనృపాల ! వింటెగద ♦ రావణుబుద్ధిసమృద్ధి ? జానకీ
గాముకుఁడై హరించె నని ♦ కానక పల్కుదు; రామె యిం
దిరా! శ్యామ యటంచు నీవు హరి ♦ వంచు నెఱింగియె
యుద్ధభూమి నీచే మృతిఁ బొందఁగా వలసి ♦ సీత నొగిన్
గొనిపోయె లంకకున్. 18

మ. రవివంశంబున నెన్నఁ జెప్ప డవతా♦రం బౌనో ? యమ్మో
టికో ! బవరం బెప్పుడు గల్గునో ? యెపుడు త ♦ ద్బాణా
హతిం గూలి మఃర్భవమున్ మృత్యువులేని దివ్యపదముం ♦
బ్రాపింతునో ? యంచు నెంచి, విరాగస్థితి సంచరించు నసు
ర ♦ శ్రేష్ఠుండు సీతాధిపా ! 19

చ. నెమకి సనత్కుమారుఁ గని ♦ నీ మహిమంబులు విన్నదాదిగా
నమరవిరోధి నీమదికి ♦ నల్కఁ జనింప సురాళి నొంచు, లో
కముల నలంచు, జన్నములు ♦ గాంచిన విఘ్నము లాచ
రించు, సంయములఁ గలంచుఁ, బుణ్యసతు ♦ లన్న గ్రహిం
చుఁ, జరించు నెయ్యెడన్. 20

## *పుత్రధర్మము



వ. తల్లిదండ్రు లిరువురయందును బుత్త్రనిమిత్తంబైన యా యానం బెవ్వరి కెక్కుడు, వారలయెడం బుత్త్రుం డెట్టివాఁడు గావలయు వివరింప నీవ యర్హుండ వనిన నమ్మహాముని యమ్మహీపతి కిట్లనియె.

* ఈ యంశము ఆంధ్రమహాభారతము వనపర్వము 5 ఆశ్వాసము లోనిది. మార్కండేయమహర్షిని ధర్మరాజు ప్రశ్నింపగా నా మహర్షి చెప్పినది.

కవి, ఎఱ్ఱాప్రగడ. క్రీ. శ. పదునాల్గవశతాబ్దమధ్యమున నెల్లూరు, గుంటూరు మండలముల నేలిన ప్రోలయవేమారెడ్డి యాస్థానమున నుండు వాఁడు. ఈతఁడు 'నన్నయ, తిక్కన' మహాకవులాంధ్రీకరింపగా మిగిలిన భారతములోని యరణ్యపర్వశేషమును, హరివంశమును, ఆంధ్రీకరించెను. మఱియు, నరసింహపురాణమును, రామాయణమును గూడ రచించెను. ఈకవికి శంభుదాసుఁడను మఱియొక పేరును, ప్రబంధపరమేశ్వరబిరుదమును గలదు.

సీ. జతనంబు మిగుల మాఁ◆సములు దొమ్మిది యుద
రంబునం గరము భ◆రంబుతోడ
భరియించి పదపడి ◆ ప్రాణసంశయదశ
నొంది పుత్త్రునిఁ గాంచు ◆ నొనరఁ దల్లి
తపములు యజ్ఞముల్ ◆ దానముల్ వ్రతములు
దేవతాసజ్జన◆సేవనములుఁ
గావించుఁ బుత్త్రునిఁ ◆ గామించి జనకుఁ డి
ట్లిరువురపాటును ◆ సరియె తలఁప
తే. తనయుఁ గని తల్లిదండ్రులు ◆ దమకు నతఁడు
భక్తుఁ డగుటకు ధర్మార్థ◆సక్తుఁ డగుట
కాసపడుదురు విను మట్టి◆యాస సిద్ధిఁ
బొందఁజేయునతఁడుచువ్వె ◆ నందనుండు. 2

క. జననియు జనకుఁడు నెవ్వని
యనువర్తనమున బ్రియంబు ◆ నందుదు రెదఁ ద
త్తనయుఁడు ధర్మముఁ గీర్తియు
ననూనముగఁ బొందఁ బడయు ◆ నక్షయగతులన్. 3

తే. జనని జనకుఁడు సద్గురు ◆ డనలుఁ డాత్ముఁ
డనఁగ నియ్యేవురును నే గృ◆హస్థుచేత
సుగతివాంఛఁ బ్రసాదితు ◆ లగుదు రట్టి
వాఁడ చూవె! ధర్మాత్ముఁడు ◆ వసుధమీఁద. 4

---

# శ్రీరాముఁడు కైకతోఁ జెప్పి వనవాసోన్ముఖుం డగుట



క. పినతల్లిం బోడగని క
మ్మని పలుకుల నిట్టులనియె ♦ మము నేడఁగ నో
పినతల్లి! నీడెందం
బున నిటువలె లాఁతితనము ♦ పూనఁగఁ జనునే? 1

క. ఓయమ్మ! యట్టు లఱమఱ
సేయంగా నేల? నీవు ♦ సెప్పినచెయ్యుల్
ద్రోయంగా నేర్తుమె? యిఁక
నీయానతిఁ గడవఁ బోము ♦ నీయాన సుమీ! 2

---

*శ్రీరాముని వనవాసోన్ముఖాదిగాథలు కవిసార్వభౌమబిరుదుగల కూచిమంచి తిమ్మకవి కృతమగు 'అచ్చతెనుఁగు' రామాయణములోనివి. ఈ మహాకవి క్రీ. త. 1680 సం॥ర ప్రాంతమున జన్మించి 1760 సం॥ర ప్రాంతము వఱకు పిఠాపురమునకు సమీపమునందలి 'కందరాడ' గ్రామములో నుండువాఁడు. ఈ మహాకవి (1) రుక్మిణీపరిణయము (2) సింహశైలమాహాత్మ్యము (3) నీలాసుందరీపరిణయము (4) రాజశేఖరవిలాసము (5) సారంగధరచరిత్ర (ద్విపద) (6) అచ్చతెనుఁగురామాయణము (7) సాగరసంగమాహాత్మ్యము (8) రసికజనమనోభిరామము (9) సర్పపుర

తే. ఒనరఁ దలిదండ్రు లెలమితోఁ • బనుపుదు రఁట !
తోడఁబుట్టువు పుడమికి • దొర యగు నఁట !
పున్నయపునేల లోఁగిఁ గాంచఁ • బోవుట యఁట !
మెలఁత ! మఱి యింతకంటెను • మేలు గలదె ? 3

క. తలఁపఁగ జగమునఁ గల వే
ల్పులు, సంగడికాండ్రుఁ, జుట్టములు, మఱి సెప్పం
గలవార లెందఱేనియుఁ,
దలిదండ్రుల కెన యొనర్పఁ • దగుదురె యెందున్ ? 4

తే. అట్లు గావున నిపుడు మీ • యానఁ బత్తిఁ
దవిలి యొనరింతు నని యటఁ , దరలి తనదు
తల్లికడ కేగి యత్తెఱం • గెల్లఁ దెల్పి
యడుగులకు మ్రొక్కు టయు, నాతి • యతనిఁ జూచి. 5

క. కటకట ! బిడ్డఁడ ! కోరిక
లటమట లై చనియె నిప్పు • డద్దిర ! తా నో

---

మాహాత్మ్యము (10) శివలీలావిలాసము, అను గ్రంథములను రచించెను
ఈ కవిసోదరుఁ డగు 'జగ్గకవి'యుఁ బ్రసిద్ధి నొంది యున్నాడు. అతని
చంద్రరేఖావిలాపము, జగత్ప్రసిద్ధము. తిమ్మకవిని అతని కాలమునం దుండి
న, 'ఏనుఁగు లక్ష్మణకవి' యిట్లు నుతించెనఁట !
క. హాటకగర్భవధూటీ। లాటనచలితాంఘ్రినూపు • రారావశ్రీ
పాటచ్చరములు తేనియ। తేటలు మాకూచిమంచి • తిమ్మయమాటల్.

క్కటి దలఁచిన దయ్యం బో
క్కటి దలఁచు నన్నమాట ♦ కడు బెడఁ గగుచున్. 6

క. పుడమిఁ దనకన్న కొడుకున
కడుగుకొనియెఁ గాక కైక ♦ యహహా ! నినుం గా
అడవులకుఁ బనుపు మనుచున్
నుడువఁగ నెప్పగిదిఁ దనకు ♦ నోరాడె నొకో ! 7

తే. సవతితన మూని యిట్టు ల♦య్యువిద వలుక
నటులె తానును డెందంబు ♦ దిటముపఱుచు
కొని యయ్యో ! నిన్నుఁ గానల ♦ కనుపుకొనఁగఁ
దండ్రిఁ యేచందమున నఱ ♦ దలఁచెఁ జెపుమ ? 8

క. అజ్జోటియు నొడయఁడు నీ
పజ్జం గనికరము మాలి ♦ పని గొల్పినచో
నిజ్జాడ మీకుఁ దగ దని
యొజ్జయుఁ బ్రెగ్గడలు నాడ ♦ కుండిరె వారిన్ ? 9

క. గడియయ యేఁ డగు మును నినుఁ
బొడఁగానక యుండునెడలఁ ♦ బొలుపరి నీ వి
ట్లెడవాసి దవ్వ చనుచోఁ
గొడుకా ! యిఁక నెట్లు తాళు♦కొనఁ గలఁ జెపుమా ? 10

తే. అనుచు నడలెడు తల్లి నూ♦రార్చి యంప,
దొనలు విల్లును గయికొని ♦ చనఁ దలంచు

నెడల నడ్డంబుగా వచ్చి ♦ పుడమికాన్పు
వలపు గులుకంగ మెల్లనఁ ♦ బలికె నపుడు. 11

—♦ సీతారాముల సంవాదము ♦—

ఆ. ఎమ్మెకాడ! యగ్గి ♦ యెల గాఁగఁ బెండిలి
యైనచెలిని డించి ♦ యకట! యొంటి
నేఁగఁ దగునె? మీర ♦ లెఱుఁగని నడవడు
లింకఁ బుడమిఁ గలవె ♦ యేర్పఱింప? 12

తే. మేలు గలనాఁడు మురియుచు ♦ మెసవ నేర్చి
గొడవ లొదవెడుతఱిఁ బోవఁ ♦ విడువఁ దగునె?
తలఁప నుసురులయొడయఁడై ♦ తనరు మగని
వెర వెఱింగిన నాఁడెంపు ♦ వెలఁదుకలకు. 13

ఆ. మగనితోడ నెలమి ♦ దగిలి ముత్తయిఁదువ
పోణిమిని గరంబు ♦ రాణఁ బొసఁగు
చున్ననాఁడె కాక ♦ యున్నల కటమీఁద
నెన్నఁడైన నెమ్మి ♦ యింత గలదె? 14

ఆ. అట్టు లగుటఁజేసి ♦ యరగడియయుఁ దాళఁ
జాల నిన్నుఁ బాసి ♦ నేలతేఁడ!
మాఱుమాట లుడిగి ♦ కాఱియఁ బెట్టక
తోడుకొని కడంక♦తోడఁ జనుము. 15

క. అనవుడు నబ్బల్లిదుఁ డా
ననఁబోఁడులమిన్నఁ జూచి ♦ నగి యిట్లనియెన్
బెనుగానలఁ బడి చెలులకుఁ
జనఁ జనునే? వెరవు మాలి ♦ చక్కెరబొమ్మా! 16

క. నగువారి నెల్లఁ దలఁపక
మగువా! మగవారివెంట ♦ మచ్చికతోఁ రాఁ
దగవా పగవాఁడని! నినుఁ
దిగనాడి చనంగ లాఁతి ♦ తెఱఁ గెన్నుదురే? 17

సీ. చెలిమితోఁ నాడంగ ♦ జింకకూనలు గావు
గద్దఱికొదమసిం ♦ గములు గాని
కులుకుచుఁ బలికిరాఁ ♦ జిలుకబారులు గావు
దుగ మొగంబులపుల్గు ♦ తెగలు గాని
వలపుతోఁ బెనుప జ ♦ వ్వాదిపిల్లులు గావు
బలితంపుఁబొగరు బె ♦ బ్బులులు గాని
కయిసేయఁ బువ్వుదీ ♦ వియపొదిరులు గావు
పొదలు జొంపపుకాఱు ♦ పొదలు గాని

తే. గొండ్లి సలుపంగ ననుఁగుఁబూఁ ♦ బోండ్లు గారు
తులువపోలయోగిరపుపోలం ♦ తుకలు గాని
గోల లెచ్చట? గాటంపుఁ ♦ గోన లెచట?
వలవ దుడుగుము పయనంబు ♦ తలిరుఁబోఁడి! 18

క. వల నొడవనిపని యగుటం
బలికితి రా వలవ దనుచుఁ; ♦ బరికింపఁగ నో
యెలదీ వేఁబోడి! నిన్నుం
గలలోపల నైనఁ బాయఁ♦గలనే చెపుమా! 19

క. అని యిట్టు లెన్ని సెప్పిన
విన నొల్లక కలువకంటి ♦ వెగ టొదవఁగఁ బ
ల్కినఁ దలఁకుచు వెంటం దో
డ్కొని చనుటకు నాతఁ డియ్య♦కొని యుండుటయున్. 20

తే. అత్తలకు మ్రొక్కి వారల♦యానతిఁ గొని
జా నొడవఁ జెల్మిబోటులఁ ♦ జాలఁ గూర్చి
తోడఁ గవుఁగిటఁ బెనచి యా♦తొడవుతొడవు
నెమ్మిఁ బెనిమిటిదరిఁ జేరి ♦ నిలుచు నెడను. 21

క. లక్ష్మణుఁడు సింగాణియు
నక్షజపుం దొనలు పూని ♦ యరుదెంచి కడున్
మ్రొక్కు లిడి యున్న నాతని
మక్కువ కెదలోన నలరి ♦ మఱి యప్పిదపన్. 22

{ సీతారామలక్ష్మణు లరణ్యప్రయాణము
పౌరుల సంభాషణము }

తే. తమ్ముఁడును గేస్తురాలును ♦ దాను నగరు
వెడలి యమ్మేటి దమునీఁటి ♦ నడిమిత్రోవఁ

జనుచు నుండెడుచోఁ గనుం♦గొనుచు నుండి
యెల్లవారలుఁ దమలోన ♦ నిట్టు లనిరి 23

క. ఇట్టి నిగారపుగొనముల
తిట్టులఁ గనికరము మాని ♦ తెం పొదవంగాఁ
గట్టడవులకుం బనుపఁగఁ
గట్టా! యమ్మదుకఁ డెంత ♦ కట్టిఁడి చెపుమా! 24

క. తడవేఁడు లయ్యెఁ దనకుం
గొడుకులు లేరనుచు ముందు ♦ గుందుచు నెన్నో
పడరాని పాట్లువడి యిపు
డడవులకుం ద్రోచుకొనుట ♦ యరుదై తోఁచున్. 25

క. తప్పక యాఁడుది గోరిన
మెప్పులకై వెడఁగుఁదనము ♦ మీఱఁగ నిటు లీ
యొప్పులకుప్పల విడుచుట
ముప్పుందటి నితని కేమొ ♦ ముది మది దప్పెన్. 26

తే. అలిమాటకొఱకు ♦ బేలయ్యె కోడలిఁ
గొడుకుఁ బోవఁ ద్రోచు♦కొనియె నితని
కేటిమగతనం బి♦పీ! కడుఁ గొద లేని
ఱట్టు వొందె నింక ♦ అంతు లేల? 27

తే. అనుచుఁ గలఁగుచు నెల్లరు ♦ నాడుకొనఁగఁ
బ్రోల్వెడలి వార లొయ్యనఁ ♦ బోవు చుండి

రత్తెఱం గెల్ల నాలించి ♦ యపుడు చాల్పు
టరదములదొర దద్దయు ♦ నడలుకొనుచు. 28

—♦ దశరథుఁడు సీతారాములకై శోకించుట ♦—

శా. ఏఁడీ! నాబలుమానికంబులకోటా ♦ రేఁడీ! జగావన్నికాఁ
డేఁడీ! రక్కసినీరుదాలుపులగా ♦ డ్పేఁడీ! జగం బేలుఱేఁ
డేఁడీ! పేదలపాలివేలుపుల చె ♦ ట్టేఁడీ! నిరాబాల్గమే
లేఁడీ! వేఁడివెలుంగువంగడపు రే ♦ వెల్గంచు బిట్టేడ్చుచున్.

ఉ. రా! యనుఁ గా! యనుం దొగల ♦ రాయనిఁ గేరునిగార
పుంగుఱా।రా! యను మేటినాఁడెపుడొ ♦ రా! యనుఁ గిన్క
యొనర్చె దేమి మే।రా! యను నింత నీకుఁ గనరా। యను
దయ్యము పాడి దప్పె నా।రా! యనుఁ గన్నవారు నగ ♦
రా! యను నిప్పని మానురా! యనున్. 30

ఉ. కా! యను మేటితప్పు గొడుఁ ♦ కా! యను నిద్దపుఁబూఁత
మావిమో।కా! యనుఁ బంజరంపుఁజిలు ♦ కా! యను నబ్రి
పుసోయగంపుఁబో।కా! యనుఁ బల్కవేమి యలు ♦ కా!
యనుఁ బంతము దీఱె నోట్టుకై।కా! యను నేరయిట్లు
దుడు ♦ కా! యనుఁ బాయఁగఁ గోరికా యనున్. 31

క. అప్పా! విప్పారెడునగ
వొప్పారఁగఁ జూచి పలుక ♦ కున్నాఁడ వదే

చొప్పా? తప్పా? బంగరు
కుప్పా! యిప్పాట నింత • కొఱకొఱ మెప్పా? 32

క. ఉడుకా విడ కున్నది మది
పడుకా మిడుకంగ నుఱక పఱవం జనునే?
కొడుకా! నడుకానల కిటు
దుడుకా! నాపాలిపుడుకు • నొడుకా! నీకున్. 33

నిరోష్ఠ్యసీసము.

చలియిక్కు దిండియం • దెలతేని జిగిచేగ
సింగాణిఁ జెఱిచిన • చేఁతకాఁడ!
జడదారినెలదండఁ • జని క్రిచ్చఱ గయాళి
రాకాసిఁ జెండిన • రాచకంద!
తలఁగనికడగండ్లఁ • దగిలి చట్టయి యున్న
చాన నేసిన నెఱ • జాణరాయ!
నీటార నెదిరిన • నేలజేజేదంట
తే జెల్ల నడఁచిన • దిట్టలెంక

తే. తండ్రి నైనట్టినాయాన • దాఁట లేక
కడఁదికాఁణాచిరాసిరి • యెడలఁ జేసి
హాళిఁ గానల కరిగిన • యాదగాఁడ!
తలర నిన్గాంచ కేఁ దాళఁ • గలనె యింక! 34

క. కైకా! నీపూనినపని
కైకా కైకందినట్టె • యనుగుంగొడుకి

పై కానల కేఁగెదు నిఁక
నేకడ నీవంటితులువ ♦ లేరే! పుడమిన్. 35

క. నెయ్యపుకొడుకుల నిటు లెడ
సియ్యంగా మిగులఁ జలముఁ ♦ జేకొనియెదు నేఁ
డయ్యయొ! యాకట్టెఁడిబ
ల్లయ్యంబున కేమి యొగ్గు ♦ దలఁచితినో చుమీ! 36

తే. అంగదల కోర్చి సిరులపై ♦ యాప వదలి
గరితతన మెల్ల జగములఁ ♦ గనబడంగ
మగనివెనువెంట నడచికిఁ ♦ దగిలి చనితె?
తోడరి మముఁ జూడ రోసి యో ♦ పుడమికాప్ప! 37

తే. కోడలా! యింక బంగరు ♦ గోడ లేల?
మేడ లేటికి రతనంపు ♦ వాడ లేల?
మాడ లేటికి బలురాచ ♦ జాడ లేల?
వాడలో నీవు దిమ్మర ♦ నోడి చనిన. 38

తే. మక్కువలయిమ్మ! వలజేరి ♦ మారికమ్మ!
పసిఁడికీల్బొమ్మ! జగముల ♦ పట్టుఁగొమ్మ!
పొగడపూరెమ్మ! వలపుగ ♦ ప్పూరపుదిమ్మ!
కాన వేలమ్మ? యోనేల ♦ కాన్పుఁగొమ్మ! 39

---

# *భీముఁడు గదాయుద్ధమున దుర్యోధను తొడలు విఱుఁగఁగొట్టి తలఁ దన్నుట,



మ. ఒకది క్కుద్ధతిఁ బూన్చి యొండుదెస వ్రే◆యున్ మేను వం
చించి వ్రేఁతకుఁ దప్పున్ వడి వ్రేయు నొడ్డనమునం◆దప్పించి
వేగంబు గుందక నొప్పించుఁ జలం బెలర్పఁగ గదా◆దండం
బు దూలించుఁ బాండుకుమారుం డుఱ కట్లు కౌరవవిభుం◆
డుం గేలి సల్పుం దగన్. 1

ఆ. పాండురాజసుతుఁడు ◆ పటుతరోల్లాసియై
వైచుటయును ధరణి◆వల్లభుండు
తొలఁగ దాఁటె రయము ◆ దలకొని గదఁ బుచ్చి
కొనియె నాబకాంత◆కుండు నుఱికి. 2

క. ఆలోనం గురుధరణీ
పాలుఁ డడరి వ్రేయుటయును ◆ బవనసుతునిమై
సోలె నది గానఁ డాపతి
కేలివిభ్రమము దోఁప ◆ గ్రేళ్లురికె నృపా! 3

---

* ఈకథ ఆంధ్రమహాభారతములోని శల్యపర్వము ద్వితీయాశ్వాసములోనిది. కవి, తిక్కనసోమయాజి. ఆతనిచరిత్రము ఇంతకుముందు వ్రాయఁబడెను.

ఉ. ఉఱికినఁ దేఱి, పై కుఱికి ♦ యుగ్రత భీముఁడు వ్రేయ నవ్వి
భుం । డుఱక మహోద్భటస్ఫురణ ♦ నూర్ధ్వపరిభ్రమణంబు
సేసినం । దెఱపి యతండు గాంచి సము♦దీర్ణరయంబున వై
చెఁ బెన్నొడల్ । విఱిగి నగాగ్రముద్భటప♦విప్రహతిం బడు
చాడ్పునం బడన్. 4

వ. ...ఇట్లు తనగద తాఁకునఁ దొడలు విఱిగి సింగంబుచేతం గూ
లిన గంధశుండాలంబుచందంబునం బడి యున్న కీచకుం
జేరం జని భీముండు. 5

తే. ఏకవస్త్రఁ బాంచాలి స♦ట్లీడ్చి తేరఁ
బనిచి సభలోనఁ బఱచిన♦పాపఫలము
ననుభవింపుము దుష్టాత్మ! ♦ యనుచు వామ
చరణమున బెట్టిదము గాఁగ ♦ శిరము దన్నె. 6

వ. తన్ని యలుక మలుగక యతనియాననం బాలోకించి. 7

క. పసు లని యార్చుచు మము ను
ల్లస మాడిన ధర్మహీను♦లను నృపధర్మం
బెసఁగఁగ నే మిదె యిప్పుడు
పసు లని యార్చెదము మగుడ ♦ బంధుద్రోహీ! 8

క. విను మేను కల్లసారెలు
గొని కపటపునెత్త మాడు♦కుశలతఁ గాదో
ప్పనివారి నే పడంచుట
ఘనబాహుస్వైరకేళిఁ♦గాని దురాత్మా! 9

వ. అని పలికి పెలుచ నవ్వి ధర్మనందన గోవింద పాంచాలప్రకర
పార్థ సాత్యకి నకుల సహదేవుల నాలోకించి. 10

ఆ. శంకలేక కడఁగి ♦ సభ కల్లు పాంచాలి
నంటరానిదాని ♦ నొంటిచీర
తోన యున్నసాధ్వి ♦ వేనలి పట్టి యీ
డ్పించినతనిఁ జూడుఁ ♦ డఁచుఁ బొదలి. 11

వ. పాంచాలి సేసినతపంబు పెంపున నీశోభనంబు సమకూరె
ననిన, విని వారు ప్రమోదంబు నొంద మిక్కిలి సంతసంబున సం
దేలి యక్కురుఘస్మరుండు నర్తించు చెన్ను దోఁప జెలంగి.

చ. మును మము గొడ్డువోయి రని ♦ ముష్కరతం జెడనాడినట్టి
దుర్జనుల ననిం గడంగి ధృత ♦ రాష్ట్రతనూజుల బంధువర్గమి
త్రనికర సైన్యకోటిసహి ♦ తంబుగఁ గీటడఁగింపఁ గంటి మిం
క, నమరలోకమైన నర ♦ కం బయినన్ సరి మాకు నారయన్.

క. అని గదఁ జేకొని నృప ! నీ
తనయుని మెడ పట్టి యదిమి ♦ తల గ్రిమ్మఱఁ ద
న్నినఁ గని మును దన్నుట నె
మ్మన మెరియు తదగ్రజుం డ ♦ మర్షముతోడన్. 14

{ భీముని చేఁతకు ధర్మజుఁడు చింతింప భీముని
శ్రీకృష్ణుఁడు సమర్థించుట. }

వ. హార్దావేశలఘుచారిత్రుండగు నమ్మారుతపుత్రున కిట్లనియె.

చ. తల యది యేల తన్నెద వ ♦ ధర్మము నొందుట కాత్మ రో
యఁగా ! వలవదె రాజరా జనుజవర్గముఁ దక్కినబంధుకో

టియుం । గలపరివారముం దెగిన ♦ గౌరవ మేదకఁ బోరి
సంగరస్థలమున బడ్డ నీతులునఁ♦చందము చేఁత జనంబు మె
చ్చునే ! 16

క. మును లోకము ధర్మపరుం
డనఁ బరఁగినవాఁడ విట్టి ♦ లనుచితకృత్యం
బునకుఁ జనఁ దగునె దీనం
గనియెదుఫల మేమి దూష్య♦గర్వం బేలా ?

వ. అని దూఱి దుర్యోధనుం జూచి బాష్పాకులలోచనుండై.

సీ. విధి ప్రతికూలుఁడై ♦ వేరంబు పుట్టించి
మాకు నీవును మేము ♦ నీకు నలిగి
యితరేతరద్రోహ♦మతిఁ దెగి యింతలు
సేయుట గావించె, ♦ నీయధర్మ
పరతయు లోభంబు ♦ బాల్యంబు మదమును
నిన్ను నింతకుఁ దెచ్చె ♦ నీకతమున
నాకు బాంధవకుల♦నాశంబు వాటిల్లె
ధృతరాష్ట్రుకోడండ్రు ♦ దీవ్రశోక

గీ. కారి యయినవైధవ్యంబు ♦ కారణముగ
నన్ను నిందింతు రను వచ♦నములు మొదలు
గాఁగ బహువిలాపంబులఁ ♦ గరుణ మావ
హిల్ల దురపిల్లె నుల్లంబు ♦ దల్లడిల్ల. 19

వ. తదనంతరంబ వాసుదేవుండు ధర్మపుత్త్రు నాలోకించు నెడ

నతండు దీనాననంబుతోడ మానసంబు విషాదంబు నొంద నూరకున్న నారాయణుం డతని కిట్లనియె. 20

ఆ. బంధునాశకుండు • పాపాత్ముఁ డీ సుయో
ధనుఁడు వీని సమర•ధరణిఁ గూల్చి
శిరము దన్నె భీముఁ • డరయంగ నిది యధ
ర్మంబె నీకు నేల • మఱుఁగఁ జెపుమ ? 21

వ. తలఁ దన్నువాఁడ ననుప్రతిజ్ఞయుఁ గీచకారాతికిం గలదు గాదె ? యనిన, విని కుంతీనందనుండు దేవకీనందనున కిట్లనియె. 22

క. కురుకులము పొలియుటకు మది
యెరియంగా నున్ననాకు • నితఁ డీరాజున్
శిర ముఱక తన్నె యిమ్మెయిఁ
బరిభవ మొందింప వగవు • పాటిల కున్నే ? 23

తే. ఇతఁడు పఱిచినపాటులు • హృదయకీలి
తంబులై భీమసేనుండు • తగవు మాలె
నేమి సేయంగవచ్చుఁ బో•నిమ్ము పుణ్య
పాపచింత యిం కేటికిఁ • బద్మనాభ ! 24

వ. అనుటయు నట్లకాక దీని నింత గొనియాడ నేల యని యతండు భీమసేనపక్షపాతంబున నతనిచింత గీటునం బుచ్చె విష్వచ్చుండు నెఱయం బ్రియం బందవిడెందంబుతోఁ గడుమేలాడక యూరకుండె; నమ్మారుతి మోదం బెసఁగ మోదుప్ప

గేలు ఫాలతలంబున మోపికొనుచు నుత్ఫుల్లంబు లగులోచ
నంబుల నొప్పి నిజాగ్రజుం జేరం జని యిట్లనియె. 25

చ. పరిభవకారి యైన కుల♦పాంసనుఁ డాహవభూమిః గూలె, ద
త్పరమతి వైరముం బెనిచి ♦ పాపవినిశ్చయకారకత్వని
ష్ఠురు లగుమన్నసేనఁడును ♦ సూతసుతుండును సౌబలుండుఁ
దు౹ంగి; రితనికంబె మున్ను మహీ♦కిం బతి వీవ భరింపు
మున్నతిన్. 26

వ. అనిన విని ధర్మతనయుం డతని కిట్లనియె. 27

క. హరితలఁపు గూడఁ గురుపతిఁ
బరిమార్చితి వ్రతినతోడఁ ♦ బగ దీర్చితి నీ
కరయంగ దైవబల వి
స్ఫురితభుజాబలము లింత ♦ చొప్పడి యున్నే ! 28

వ. ..భీముచేసినగదాసమరధర్మవిరోధంబు లాఁతిరాజులమనంబు
ల నుండునో యని శంకించి కృష్ణుం డెల్లరాజులం గలయం
గనుంగొని యిట్లనియె. 29

ఉ. చక్కటిలేని యాలమునఁ ♦ జంపె ననన్ వల దీదురాత్మకుం
డక్కటికంబు లేక సతి ♦ నంతలు సేసినను గృపారతిం
దక్కక తండ్రిపా లడిగె♦ధర్మజుఁ; డన్నలు సేయఁడయ్యెవీఁ,
డుక్కువుఁ డిట్టిచాపునకు♦యుక్తుఁ డగుం దలపోసి చూడఁగన్.

క. విదురాదులు సెప్పఁగ ను
న్మదుఁ డై యాఁడుయ్యెఁ దగిన♦మాత్రము భూసం

పద వీఁడు పాండవుల, కిది
యది యగునె? బకారిపత్రిన ♦ కగ్గం బైనన్. 31

ఆ. నేలఁ గూలి మాఱిను ♦ వోలె నిట్లున్న యి
ప్పాపకర్ము గుఱిచి ♦ పాడి తెలుఁగు
తేటపడఁగ మాట ♦ లాట దానేల మీ
రెక్కుడరదముల మ♦హీశులార! 32

—♦ దుర్యోధన శ్రీకృష్ణుల సంవాదము ♦—

వ. అని యిట్లు పుండరీకాక్షుండు దన్ను నాక్షేపించుట యాక
ర్ణించి కౌరవేశ్వరుండు గోపాయత్తచిత్తుండై పిఱుందు మోవ
లేచి, చేతుల భూతలం బూఁదికొని, బొమముడితోడి
చూడ్కి యతనిపయిం బఱపె, నప్పు డపరభాగంబు విఱుగ
వ్రేటుపడి యలిగి తలయెత్తి చూచుమహానాగంబుచందంబు
దోఁచె; నట్లు ప్రాణాంతికరణంబైన వేదనాభరంబు దలంపక
కూర్చుండి ముకున్నకృష్ణుండు జిష్ణుతోడ సంభాషించు
టయు నతం డూరుతలంబుఁ గరపుటంబున నప్పళించుటయు
వెడవెడ గనుటంజేసి, భీము వాటువం దొడలు విఱిగిపడియె నప్పు
డప్పటి బుడిబుడిమాటలు నాసన్నయు దీనికిం గాకేమి యని
యూహించి చేయునది లేక యవుడు గఱచుచున్నవాఁ డ
గుట నగ్గోపాలదేవుతో నిట్లనియె. 33

సీ. కంసదాసునిపుత్రి ! ♦ కానవు నీదురా
చారంబుఁ గృపయు ల♦జ్జయును లేక
ప్రేలెదు నీవు సె♦ప్పినఁ బాగ్ధుచేసిన
సన్నద్గై కొని గదా♦సంగరంబు
పాడి దొఱంగి యి♦ప్పాపకర్ముఁడు వైచెఁ
గాక చక్కటితోడి♦కయ్య మైన
లీల మిమ్మందఱ ♦ నేలపాలుగఁ జేయు
నే ? శిఖండి గడంగి ♦ యేసె ననఁగ
తే. నర్జునుఁడు శాంతనవుఁ గూల్చు♦న్లు చేసి,
తస్త్రగురుచాపునకుఁ బాండ♦వాగ్రజన్ము
బొంకు మని పంచి, తరదంబు ♦ పుడమిఁ గ్రుంగఁ
గర్ణుఁ జంపించి, తే మనఁ ♦ గలదు నిన్ను ? 34
క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ
బోరఁగ నేయించి త్గ్గు ♦ పొడిచీఁకటి నం
హారహితు సైంధవుని నరు
బారిపడఁచి తిట్టెనికుఁ ♦ బల్కులు సనునే ? 35
క. నను భీష్మ గురుని సూతసు
తుని భూరిశ్రవు జయద్ర♦థుం జక్క టిద
ప్పని యనిఁ గోల్పుచ్చఁగ వ
చ్చునె నీకుం గపటశూర ! ♦ సుచరితదూరా ! 36
వ. అనిన విని యచ్యుంతుం డతని నవలోకించి నీవు భీముని

బాలునిఁ బాములం గఱపించియు విషం బిడియు నీటం దో్రి చియుం బలుమాఱుం జంపం దెగితివి! గొంతియుఁ గొడుకు లేవురును నిద్రించుసమయంబున జతుగృహంబు దహించి తివి; ధర్మోత్తరచరిత్రుం డగు నజాతశత్రుసంపదలఁ గపట ద్యూతంబున నపహరించి, తంతఁ దనివింబోక యాజ్ఞసేని నేక వస్త్ర రజస్వలం గొలువులోపల భంగపెట్టి తాప్రౌఢ్ద నిన్ను నిట్టిదురవస్థకుఁ దేరం దగి యుండ, నట్లు పోయి సమయంబు నడపి నీచేసిన సకలదుష్కృతంబులు సహించిన యిప్పాండ వాగ్రజుండు వనుప నేను బుడమిపా లడుగవచ్చిన నీనేర వైతి; నీనేరమి నిల్లితి; భవదీయం బగులోభంబునం బాప నిశ్చయంబున మదంబున శాంతచిత్తు లగుశాంతనవద్రోణు లకుం బ్రాణహాని వాటిల్లె; వినుము, ద్రుపదునితపోయజ్ఞ ప్ర భావంబుల నదియపనిగా జనియించిన శిఖండి ధృష్టద్యుమ్ను లా భీష్మ గురు మరణంబులకుం గారణంబులు గాక తక్కుదు రే? పెక్కండ్రితోడం బోరి డస్సినసాత్యకిం జంపువాఁడైన భూరిశ్రవుం జంపకుండుమే? యనేకప్రౌఢయోధు లొక్క రుని బాలు సౌభద్రుం బొదివి చంపినం, బూనినపూన్కి నిఖి లోపాయంబుల చెఱుపక, పుణ్యాత్మయైన పాంచాలి నరణ్యం బునం బరిభవించినపాపాత్ముని సైంధవుని బ్రదికిపో విడిచి యర్జునుం డగ్నిం బ్రవేశించు నే? యిన్నితెఱుల చరిత్రంబులు నిర్మలంబులు; ఘోషయాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొని

పోవునప్పుడు నీవారెల్లం బాఱిన నర్జునుండు నిన్ను విడిపిం
చుట యెఱుంగవే? గాంగేయ కుంభజ కర్ణాశ్వత్థామ కృపు
లుద్దామ సమగ్రసైన్యంబులతోడ నడవ నీవు విరటుని గోవు
లం బట్టికొనిపోవుచోట మీరందఱుం దన సమ్మోహనాస్త్రం
బున మూర్ఛితులైన సమయంబున నర్జునుండు నిన్నుం గా
చుట యెఱుంగరాదె? నీవు సాధించినపాపంబుల కెల్ల మూ
లంబైనకర్ణునరదంబు ధరణిం గ్రుంగినం గవ్వడి వాని నేయ
కేల కాచుకొని యుండు? నుండునేనియు భూసురశాపంబున
నైన రథంబునకు నిష్కృతి గలుగునే? కావున నన్నీచు
సమయించుట సముచితంబు; యుధిష్ఠిరుండు శల్యుం డెగ
టార్చిన తెఱం గొప్పు; నొప్ప దని యుగ్గడింపక మేలు సేసితి;
పాండునందనులు పుట్టినంతనుండి నేఁడు దుదిగా నీయెడ
ధర్మవిరోధం బాచరింపరు; కురుకులంబునకు గుద్దలి గొని
దుర్ద్యూతంబు సీవ తొడఁరితి; దాన నింతలు పుట్టెఁ; బవనత
నయుండు వట్టినప్రతిన యెఱుంగవె? గద నూరుభంగంబు
సేయుదు నని పలికి పిడికిటం బొడుచునే? యవి యెల్లను వృ
థాజల్పంబు లూరకుండు మనుటయు నజ్జననాథుండు జనా
ర్దనున కిట్లనియె. 37

చ. చదివితి నెల్లవేదములు ♦ జన్నము లొప్పఁగఁ జేసితిన్ రమా
స్పదమగువృత్తిఁ బోల్చి నర♦పాలకు లెల్లను గొల్వఁ గంటి దు

ర్మదరిపుగాఢగర్వపరి♦మర్దనకేళి యొనర్చితిం దగం
దుది నని మిత్రబాంధవుల♦తోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే?

వ. నీకుం జూడ నెట్టివాఁడ నైన నా కేమి ? మీరింకఁ బశ్చాత్తాపదుఃఖితు లగుచు నుండుదురు గాక ! యనియె; నప్పు డతనిపైఁ బుష్పవర్షంబులు గురిసె; దేవదుందుభులు మొరసె; దిశలు తెలివొందె; మృదుసమీరణంబు సుగంధియై వీతెంచె; నంతయు నునుసంధించి యక్కౌంతేయులు దారు ధర్మంబు దొలంగి గాంగేయద్రోణకర్ణశల్యదుర్యోధనాదుల వధించుట యత్యంతం గౌర్యమై తోఁచినఁ జిత్తంబుల వగయు లజ్జయు మిగులం బొడమ మొగంబుల విన్ననై యున్నం జూచి, వెన్నుండు తత్సమీపంబునకుం జని వారలతో ని ట్లనియె. 39

సీ. గాంగేయగురుకర్ణ♦కౌరవపతులఁ జ
కృటి యనిఁ బరిమార్ప ♦ గాన మైతి
మని మీరు వగవకుఁ ♦ డద్ధీర లుగ్రాస్త్ర
వేదులు పరిస్ఫుట♦విక్రమమున
నడరి వారల గెల్వ ♦ టరిది గావున, నేను
బహువిధోపాయముల్ ♦ వన్ని యిట్లు
దీర్చితిఁ గాక యం♦త్రివిపరాక్రము
లలఁతులఁ బోదురే ? ♦ యట్లుగాక !

తే. వారి విధి యివ్విధమునఁ జా ♦ వంగఁ జేసె
దైవఘటనలు దప్పింప ♦ మీ వశంబె?
సురలు దనుజుల గెల్చిన ♦ చొప్పు లిట్లు
సంతసపుసమయంబున ♦ వంత లేల?

---

# *రావణుఁడు సీత నెత్తుకొనిపోవుట.

తే. పక్షిరథధారణీపత్య ♦ పత్యవరు శు
భాభిగమనావలోకనా ♦ యత్తచిత్త
యగుచు నుటజాంతరంబునఁ ♦ బొగులుచున్న
జనకనృపజాతఁ గని పల్కె ♦ దనుజనేత. 1

---

*ఈకథ 'వారణాశి వేంకటేశ్వర, లక్ష్మీపతి' కవులచే రచింపఁబడిన 'రామచంద్రోపాఖ్యానము' లోనిది. కవు లిరువురును సోదరులు. క్రీ. శ. 1850 సం॥ర ప్రాంతమున పిఠాపురమునకు సమీపమునందుండిన 'ఇసుకపల్లి' గ్రామమున నుండువారు ఇద్దఱును సంస్కృతాంధ్రభాషా కోవిదులు. సత్కవితాధురంధరులు వీరిలో 'లక్ష్మీపతి' అస్మద్గురువర్యులును, పండితులును. 'శంబరాసుర విజయాది' బహుసంస్కృతగ్రంథములను, 'కాళిందీపరిణయ, శంతనూపాఖ్యానాద్యనేకాంధ్రప్రబంధములను' రచించి. క్రీ. త. 1915 సం॥రమున స్వర్గస్థులైన 'శ్రీ భద్రాద్రిరామశాస్త్రిగారికి' మాతామహుఁడు కనక మాయామృగము వెంట రామలక్ష్మణులు వెళ్లగా సన్యాసివేషమున రావణుఁడు సీత నపహరించుట.

క. వ్రతి లేని వ్రతిని సుమతిని
నతి నియతిని యతిని కృతిని ♦ నతిథిని నతివా!
యతులితమతి చతురత, శ్రుతి
హితగతి నతిఁ జేసి బికిర ♦ మిడి, నుతిఁ గనుమీ 2

ఉ. ఎవ్వరిదాన వో శశిము♦ఖి! పురుషోత్తముకూర్మిపట్టపున్
జవ్వనివై జనంబులకు ♦ సంపద లీగల చిన్నె లొప్పు నీ
కవ్విధి నవ్విధిం దగని♦యంగద నెట్టినొ చూడ నైన నేఁ
డివ్వని నొంటి నీవు చరి♦యింపఁగఁ గారణ మేమి చెప్పుమా?

క. అని యడిగిన నవనీసుత
దనవృత్తాంతంబు సత్య♦తాపసి గానుచున్
వినిపించిన విని ముదమునఁ
దనచందముఁ దెల్పఁ దొడఁగె ♦ దశముఖుఁ డంతన్. 4

సీ. అఖిలలోకారాధ్యుఁ ♦ డగు నగేష్వాసనుం
డిష్టదైవము మాకు ♦ హీరరదన!
సకలజగత్సర్గ♦ చతురుఁ డౌ చతురాస్యుఁ
డన్వయస్వామి మా ♦ కబ్జవదన!
కడలేని విడిముడి ♦ గల యలకేశ్వరుం
డగ్రజన్ముఁడు మాకు ♦ హరిణనయన!
స్వారాజ్యపతి యగు ♦ జంభాసురారాతి
పరమభృత్యుఁడు మాకుఁ ♦ బద్మగంధి!

తే. తొల్త దెసతేని తోడుకు మా♦దొడ్డిగిడ్డి
పెట్టుచెట్టు తలంప మా♦పెరటిచెట్టు
కనకసాలాంక లంక మా♦కునికిపట్టు
పొలతి! నీయాన నాయాన♦భువనములకు. 5

క. కొఱంత యొకించుక యెందే
తెఱఁగునఁ గనరాదు గాన♦స్థిరమతి నన్నున్
బెఱవానిగఁ జూడకు మిఁక
నుఱుసిరి గలవాఁడఁ బొందు♦ముగ్ధలి నన్నున్. 6

క. కుహనాముని నై వచ్చితి
గహనావని కిట్లు నీకుఁ♦గలభాగ్యము పా
కహనారి కైనఁ గలదే?
స్పృహ నాపై నుంచి నను వ♦రించితివేనిన్. 7

క. అని క్రూరోక్తులు జనకజ
కును గళపెళ నుడ్కునూనె♦గూబలు కంటన్
మునుకొని వీనులలోఁ బో
సిన తెఱఁగున నుల్కిపడి వ♦చించెం గినుకన్. 8

ఉ. కూళ! సహింపరాని పలు♦కుల్ పలుమాఱును బల్కె దేల?
మున్గ్ల లెఱుఁగ లేక సద♦ళీకమునీంద్రుఁ డనంచుఁ బల్కితే
తాళుము, రాఘవాస్త్రఫణి♦దగ్ర హాలాహలభక్ష్య మిచ్చనీ
వేళ భుజింతుగాని రఘు♦వీరుఁడు వచ్చినదాఁక నిల్వుమీ.

క. పులిమీనంబులు గొని యు
య్యాల లూఁగఁగ నాత్మ నుత్స◆హించుట, హాలా
హాల మానఁ గోరుట దవా
నలము మెసవఁ దివురు టిదియ ◆ నమ్మ నృశంసా. 10

మ. అని వైదేహి ముహుర్ముహుశ్శ్రుతికటు◆వ్యాహారముల్
పల్కుచుం దనప్రాణేశు భజించుచున్ వనరుచు◆న్నం జూ
చి దుస్సాధ్యగా దనుజాధీశ్వరుఁ డూహఁ జేసి యచటం ◆ ద
ర్పోద్ధతిన్ శాంబరీ మునివేషంబుఁ బరిత్యజించి మొగముల్ ◆
మూఁ డా ఓకం దొప్పఁగన్. 11

క. పెటపెట దంష్ట్రలు గొఱుకుచు
స్ఫుటకుటిలాకృతి వహించి ◆ భూసుత కెదుటన్
గటగట! యని పెనుభయమున
నటమట నొందంగ గాన ◆ నయ్యెఁ దటుకునన్. 12

క. తాదృగ్విధవికృతాకృతి
భూదుహిత పరీక్షఁ జేసి ◆ భోరున మూర్ఛన్
మేదిని వ్రాలిన నయ్యెడ
నాదశముఖుఁ డెత్తి యునిచె ◆ నరదము మీఁదన్. 13

తే. రావణుం డంత నరద మ◆భ్రగతి వేగ
నడపికొనుచుఁ జనంగ జా◆నకి యొకింత
మూర్ఛఁ దెలిసి కనుంగొని ◆ మొఱ్ఱ వెట్టె
జోడు విడి కుందు జక్కవ◆చేడికరణి. 14

# * చంద్రగుప్తుఁడు—ఆతనిపుత్రిక చంద్రవతి

సీ. చేయించె నెవ్వఁడు • సేవితోర్వీశుల
రాజ్యంబు లక్ష్మీవి • రాజితముగ
వ్రాయించె నెవ్వఁ డు • ర్వర సర్వదిగ్జయ
స్తంభంబులను జయ • శాసనముల
మాయించె నెవ్వఁడు • మార్తాండవిక్రమో
ద్ధతి జనాకించన • ధ్వాంతములను
కాయించె నెవ్వఁ డు • త్కటకీర్తిచంద్రికల్
చక్రవాళాంతభూ • చక్రమునను
తే. అతఁడు జలరాశిపరివేష్ట • తావనీశ
రాజరాజీవచండమా • ర్తాండమూర్తి

---

* ఈకథ 'నాగులూరి శేషనార్య' మహాకవి కృతమగు 'శ్రీపర్వత పురాణము' లోనిది. కవి క్రీ. శ. 1600 సం॥ర ప్రాంతమున కర్నూలుజిల్లా లోని సంగమేశ్వరప్రాంతమునందలి నాగులూరు గ్రామవాసిగా నుండెను. ఈతఁడు పతంజలిభాష్యాదికముఁ జదివిన పండితుఁడు. అనర్గళకవితాధారతో గవిత్వముఁ జెప్పువాఁడు. అష్టభాషాకోవిదుఁడు. కథాసందర్భము క్రీ. శ. నాల్గవశతాబ్దమున ప్రసిద్ధికెక్కినసముద్రగుప్తునిపుత్రుఁడగు రెండవ చంద్రగుప్తునికుమార్తె 'చంద్రవతి' అను కన్యక శ్రీపర్వతేశ్వరుని మల్లిపూలతోఁ బూజించి వీణావాద్యముచే మెప్పించి ప్రత్యక్షపఱచికొని, తాను పూజించిన అర్జునమల్లికాపుష్పములు కలవాఁడగుటచే పర్వతేశ్వరుఁడు మల్లికార్జుననామధారి యగునట్లు వరము నొందుట.

చంద్రిచంద్రాతపామృత ♦ చారుకీర్తి
గుప్తవంశోద్భవుఁడు చంద్ర♦గుప్తనృపతి. 1

క. ఆచంద్రగుప్తకూఁతురు
ఆచంద్రవతీవధూటి ♦ యనిశము మదిలో
నాచంద్రముఖులు దానును
నాచంద్రకిరీటుఁ గొలుతు ♦ రచలితభక్తిన్. 2

క. విద్యుత్కాంతులడాలును
ఖద్యోతప్రభలుఁ గూర్చి ♦ కనకపుపీటన్
హృద్యంబుగఁ బులుగడుగుచుఁ
జోద్యంబుగఁ జేసె నబ్జ♦సూనుం డింతిన్. 3

క. వలరాజు రాణివాసము
తలిరాకుంబోఁడి చక్కఁ♦దనమును నొఱపున్
గిలుమాడి యొప్పు లన్నియు
నిలిపి ప్రయత్నమున నజుఁడు ♦ నెలతుకఁ జేసెన్. 4

తే. కలదె! యీరీతిమానవాం♦గనలు ధరణి
ననుచుఁ బువుబోఁడు లెల్లను ♦ నభినుతింప
కంతుసామ్రాజ్యపట్టంబుఁ ♦ గట్టఁ దగిన
రమణ విలసిల్లె విభ్రమా♦రంభములను. 5

* * * * *

—♦ చంద్రవతి పరమేశ్వరుని నుతించుట. ♦—

తే. ఎల్లపువ్వులఁ బూజించి ♦ యిందువదన
మల్లికాదామ మీశ్వరు ♦ మకుటవీథి

నింతి పూజింప వేలుపు♦టేటిభాతి
ననుకరింపుచు నుండ ని♦ట్లభినుతించె. 6

శా. శ్రీకంఠాయ నమోస్తు తే భగవతే ♦ శీతాంశుజూటాయ తే
వైకుంఠాక్షి సమర్పితాయ దివిష♦ద్వంద్యాయ తే దేవతా
నీకాభీష్టఫలప్రదాయ కరుణో♦న్మీలత్కటాక్షాయ తే
లోకేశాయ నమోస్తు తే యనుచు నా♦లోకించుఁ బూజింపుచున్

క. సరి గావు నీదుభక్తికిఁ
బరమతపోయజ్ఞవిధులు ♦ పదివేలైనన్
కరుణింపు నాకు శివ ! నీ
చరణాంబుజభక్తి జన్మ♦జన్మము లందున్. 8

వ. అని యివ్విధంబున నభినుతించి గానవిద్యావిలాసంబున కభి
ముఖయై. 9

—♦ చంద్రవతి వీణావాద్యము. ♦—

క. ఏవేళల నేరాగము
లేవీణెలఁ గూర్చి పాడ ♦ నీశ్వరహితమా
నావేళల నారాగము
లావీణెలఁ గూర్చి పాడు ♦ నభినవగతులన్. 10

ఉ. ఆ లలితాంగిపాట విని ♦ యశ్వముఖాంగన లప్సరోంగనల్
సోలుచు, గానవిభ్రమముఁ♦జూచుచునుండిరి పారవశ్యమున్
జాల వహించి సొక్కుచును ♦ జంద్రవతీనవగానచంద్రికా
జాలసుధానుభావపరి♦శాతచకోరవిహంగరాజితోన్. 10

క. అంబరచరు లెట్లరుగక.
యంబరమున నిలువ ఖగమ్ము♦గావళియును మో
దంబున మేఁతలు మఱువఁగఁ
దుంబురనారదులు ముదము♦తో వెఱగందన్. 11

మ. తరులున్ జీర్ణలతాదులున్ బవనమున్ ♦ స్తంభించె నిష్కం
పతన్ । గరఁగెన్ గండశిలాసమూహము శిరః♦కంపంబు గా
వించెఁ జిత్తరువుల్ జీవము లొంది, నీరసతరుల్ ♦ తారు
ణ్యావిస్ఫూర్తి నంకురము ల్నిండ నిగిర్చె, జీవులకు సౌ♦ఖ్యో
త్సాహముల్ చేకురెన్. 12

వ. అంత. 13

—♦ చంద్రవతికి పర్వతేశ్వరుఁడు ప్రత్యక్షమై వరము నిచ్చుట ♦—

సీ. వింజామరంబుల ♦ విధములఁ జూపట్టు
జడముడిపై బాల♦చంద్రికళలు
జడముడిపై బాల♦చంద్రమరీచుల
నెలకొని నిండువె♦న్నెలలు గాయ
నిండువెన్నెలతేట♦నిగ్గున వికసించు
చదలేటి కల్వల ♦ సంభ్రమంబు
చదలేటికల్వల♦చవులుగాడ్పులు గ్రోలి
పాపపెండెరకళా♦ప్రౌఢి మెఱయ

తే. నెఱయు, నరసంజకెంజాయ♦యొఱపుఁ దెగడు
వన్నెచారలతో లుదు♦వ్వలువ మెఱయఁ

బ్రిమథగణరాజితో సుర♦ప్రితతితోడ
నతివమ్ముంగటం బ్రిత్యక్ష ♦ మయ్యె శివుండు. 14

వ. ఇట్లు ప్రిత్యక్షంబై. 15

తే. కమలనేత్రిని గృపం జూచి ♦ గారవించి
పరిణమించితి నీదృఢ♦భక్తిమతికి
గానవిద్యావిలాసము ♦ కడు ఫలించె
వెలది! యెయ్యది యిష్టంబు ♦ వేండు మనిన. 16

వ. అమ్మహాదేవునకు నానందకందళితహృదయారవిందయై ప్రిణా
మంబు చేసి యిట్లనియె 17

తే. వరద! నేం బూన్చు నర్జున♦వర్ణ మయిన
మల్లికాదామ మెపుడు నీ♦మౌళిం దాల్చి
మల్లికార్జునలింగనా♦మంబు నీవు
అవధరింపుమ యిదియె నా♦కభిమతంబు. 18

తే. అనినం బరమేశుం డవ్వరం ♦ బతివ కొసంగి
యంబికానాథుం డానామ ♦ మవధరించె
నిఖిలకైవల్యసౌఖ్యంబు ♦ నెలంత కొసంగ
దేవసాయుజ్య మెల్ల నుం♦తించి రంత. 19

# *అశోకవనములోని సీతను హనుమంతుఁడు చూచుట



ద్విపద. ఎలమి జొంపరిగూడ ♦ హేమవర్ణమున
విలసిల్లు శింశుపా♦వృక్షంబు క్రింద
వ్రతములఁ గడు డస్సి ♦ వనటులఁ గ్రుస్సి
యతిదుఃఖములఁ గుంది ♦ యాత్మలోఁ గంది
జీవంబుపై రోసి ♦ చెలువంబుఁ బాసి
యావిధి మది దూల ♦ యలసత మీఱి
చెక్కుటఁ జెయిఁ జేర్చి ♦ చింతల గ్రోర్చి
దిక్కులేమి దలంచి ♦ ధృతి దూర డించి
యినరశ్మి వాడిన ♦ యెలదీఁగెఁ బోలె
ఘనధూమయుతదీప♦కళికయుఁ బోలె
జలదమాలికలోని ♦ శశికళ వోలెఁ

---

* ఈకథ, రంగనాథరామాయణమునందలి సుందరకాండములోనిది. కవి క్రీ.శ. 1240 సం॥ ప్రాంతమున కృష్ణామండలమున నుండెనని కొందఱు తలంచుచున్నారు. రంగనాథరామాయణము ద్విపదగా నాంధ్రమున రచింపఁబడిన మొదటి రామాయణకథ, వాల్మీకిరామాయణము నాంధ్రీకరించుటలో నీకవి తనకాలమునఁ జేయఁబడు శైవమత ద్విపదకావ్యములకుఁ బ్రతిగా విశిష్టాద్వైతమతపరముగా నాంధ్రీకరించెను. ఈకవికిఁ బిమ్మట నే రామాయణకథలు పద్యగద్యకావ్యములుగా రచింపఁబడెను.

బలుమంచుఁ బొదలిన ♦ పద్మినివోలె
చెలఁగి పిల్లులలోని ♦ చిలుకయుఁ బోలెఁ
బులులలో నావును ♦ బోలె దుర్వార
ఘోరరాక్షసవధూ ♦ కోటిలో నున్న
నారీశిరోమణి ♦ నలినాయతాక్షి
మలినాంగి యలివేణి ♦ మాతంగగమన
కలితభూషణజాల ♦ గద్గదకంఠి
జనితోష్ణనిశ్వాస ♦ సతతోపవాస
జనకతనూజాత ♦ జగదేకమాతఁ
బొడఁగని సీతగాఁ ♦ బోలుఁ బొమ్మనుచు
నడరెడు ముదమున ♦ నామేడ డిగ్గి
మది నుబ్బి యంగుష్ఠ ♦ మాత్రుఁడై కదిసి
పదిలుఁడై యాశింశు ♦ పావృక్ష మెక్కి
బాలుఁడై యల వట ♦ పత్త్రంబునందు
వేలీలఁ గ్రీడించు ♦ విష్ణుండు పోలె
శాఖామృగేంద్రుండు ♦ జడిగొన్న దాని
శాఖలలో డాఁగి ♦ చతురుఁడై యుండె
పావనచరితుఁ డా ♦ పద్మాయతాక్షి
భావించి భావించి ♦ పలుమాఱుఁ జూచి
కడఁకతో ఋష్యమూ ♦ కమునందుఁ గన్న
తొడవులు నీయున్న ♦ తొడవులుఁ జూడ

నేకప్రకారంబు ♦ లీపద్మనయన
కాకుత్స్థుసతి సీత ♦ గాఁబోలు ననుచు
మఱియును బరికించి ♦ మారుతాత్మజుఁడు
నెఱసిన బుద్ధిమై ♦ నెలఁత నీక్షించి
శ్రీరాముఁ డానతి ♦ చ్చిన ప్రకారమున
నారమణీమణి ♦ యవయవశ్రీలు
చెదర కన్నియుఁ జూచి ♦ చింతించి మఱియు
గొనకొని రాముఁ బే ♦ ర్కొని ప్రలాపింపఁ
గనుఁగొని మఱి సీత ♦ గా నిశ్చయించి
యావిన్న నగుమోము ♦ నాకృశాంగంబు
నావిరిసినవేణి ♦ యాయున్నయునికి
యాదురవస్థయు ♦ నావిలాపంబు
నాదైన్యమును జూచి ♦ యాత్మ శోకించి
చంద్రునిఁ బాసిన ♦ చంద్రిక రీతి
చంద్రాస్య యారామ ♦ చంద్రునిఁ బాసి
యుండునే యీయింతి ♦ నొగిఁ బాసి రాముఁ
డుండునే యిది చోద్య ♦ మూహించి చూడఁ
గులశీల దాక్షిణ్య ♦ గుణ వయోధర్మ
లలితరూపము లొక్క ♦ లా గొటఁ జేసి
యారామవిభునకే ♦ యంగనామణియు
నీరామ కారామ ♦ నృపతియుఁ దగును

ఈకాంతకై కాదె ♦ యినకులేశ్వరుఁడు
శ్రీకంఠువిల్లుఁ ద్రుంచెఁ ♦ జెఱకుచందమునఁ
దొలుతఁ బట్టినయంతఁ ♦ ద్రుంచె విరాధు
నలిఁ గోసె నాశూర్ప ♦ ణఖ ముక్కుచెవులు
ఖరదూషణాదిరా ♦ క్షసుల ఖండించె
మరణంబు నొందించె ♦ మారీచు నీచు
వాలి నొక్కమ్మున ♦ వధియించి కపుల
నాలుగుదిశల కు ♦ న్నతశక్తిఁ బనిచె
వారిలోపల నేను ♦ బలవంతుఁ డనుచు
నారూఢగతి నంగ ♦ దాదులఁ గూడి
ఘనపుణ్యనిధి యైన ♦ కాకుత్స్థు నెదురఁ
బనిబూని వచ్చితిఁ ♦ బంతంబు మెఱసి
నాపుణ్యవశమున ♦ నాకోరినట్టు
లీపుణ్యవతిఁ గంటి ♦ నిచ్చోట వచ్చి
దారుణ సురవధూ ♦ తతి నట్టనడుమఁ
గారణాకృతిఁ జిక్కి ♦ గలఁగు నీసతిని.

---

# కఠోపనిషత్తు

—:O:—

క. వాజశ్రవుని కుమారుఁడు
వాజశ్రవసుండు యాగ ♦ ఫలితముకొఱకై
యాజకులకు సర్వస్వము
నోజం దక్షిణగ నిచ్చుఁ♦చుండఁ గని మదిన్. 1

గీ. నీళ్లు లాని తృణముఁ దిని ♦ పాల నిచ్చు
నోరు లేనియీగోవుల ♦ నూరక కిచ్చు
నితఁడు సుఖహీనలోకము ♦ లెనయుఁడై యని
యతనిపుత్త్రుఁడు నచికేతుఁ ♦ డనెడువాఁడు. 2

---

* ఈకఠోపనిషత్తు యజుర్వేదమునందలి తైత్తిరీయశాఖకు సంబంధించినది. కథ, వాజశ్రవుఁ డనువానికుమారుఁ డగు నచికేతుఁడుతండ్రి చేననుజ్ఞ పొంది యమలోకమున కేఁగి యమునివలన జ్ఞానోపదేశము నొందుట. వేదభాషలో నుండిన నీకఠోపనిషత్తును కాకినాడ కాలేజిలోని యాంధ్రపండితులగు శ్రీశృంగారకవి సర్వారాయకవిగా రాంధ్రీకరించిరి.

ఈ కఠోపనిషత్తును షాజహాన్ చక్రవర్తి పుత్త్రుఁ డగు 'దారా' (క్రీ. శ. 1640 ) పారసీకభాషాలోనికిని, రాజా రామమోహనరాయలు వంగభాషలోనికిని, 'మాక్సముల్లర్. విండిశ్చమాన్, హోలీ,వీబర్,మూయిర్, రెగ్నాడ్, గఫ్' మొదలగు పాశ్చాత్యదేశపండితులు, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మనీ, భాషలలోనికిని, భాషాంతరీకరించిరి.

ప్రసిద్ధికెక్కిన 'శంకర' రామానుజ, మధ్వాచార్యులు, అద్వైత, విశిష్టాద్వైత,ద్వైత' మతబోధకములుగా సంస్కృతభాషలో భాష్యములఁ జేసిరి.

గీ. తండ్రికి హితంబు చేయఁగఁ ♦ దలఁపు పుట్టి
యేల ? గోవుల నిట్లిత్తు ♦ వింకమీఁద
నన్ను నెవరికి నిచ్చెద ♦ వన్నఁ దండ్రి
కనలి నిను మృత్యువున కిత్తు ♦ ననియె నంత. 3

ఉ. ఇంతయుఁ గోపవృత్త మని ♦ యానచికేతుఁ డెఱింగి యా
త్మలో । సంతత ముత్తమత్వమున ♦ సంచరణం బొనరించు
చున్న న । న్నంతకుఁ డేమిచేయఁ గలఁ ♦ డాతని కే నొన
రింపఁ గల్గుకార్యాంతర మేమొ ? యంచుఁ ♦ దనయంత
నిరంతరచింతఁ దేలుచున్. 4

క. ఆరీతి మానసము వి
స్తారము గనిపెట్టి తండ్రి ♦ తద్దయు వగతోఁ
గూరినఁ గని నచికేతుం
డూరక, కనుచుండు వేల ♦ యూహింపు మిదే. 5

ఉ ఎందఱు చావలేదు మును♦పిప్పుడు నెందఱు చచ్చుచుండరే
డెందఱు; పైరు లెల్ల జని♦యించి ఫలించుచు జీర్ణమైనయ
ట్లిందలిలోకు లెల్ల జనియించి ♦ ప్రవృద్ధిని గాంచి నాశముం
జెందుదు రేల? సందియముఁ ♦ జెందెదు పంపుము తండ్రి !
పోదు నాన్. 6

ఉ. సత్యముకై సుతుం బనిచెఁ ♦ జయ్యన నాతఁడు నేఁగి చేరె
నా। మృత్యుగృహంబు, వేళ కతఁ ♦ డింటను లేఁ డటు గాన
మూఁడునా । ళ్లత్యుపవాసము ల్జరుపు ♦ చచ్చట నుండ

యముండు వచ్చి యాక్కృత్య మెఱింగి సర్వమిది ♦ కీడయి
వచ్చె నిఁ కేమి సేయుదున్. 7

గీ. ఏగృహస్థునియింట మ♦హీసురుం డే
వం డుపవసించునో వాని♦ఫలము లుడిగి
సత్యదానతపోవ్రత♦సంతతి పశు
ముఖ్యవిభవము చెడు నని ♦ బుద్ధిఁ దలఁచి. 8

ఉ. ఏయెడఁ బూజ్యుఁ డీయతిథి♦యే నితనిం బ్రీతిమాలుకొందు
నన్ । చాయువనీసురుం దఱిసి, యయ్య! ♦ నమస్కృతు లా
చరింతు మే। ల్సేయుమ ! మూఁడునా ళ్లుపవ♦సించుట మూఁ
డువరంబు లిత్తుఁ గొమ్మా ! యిదె వేగ నన్నడుగు ♦ మన్న
నతం డతితృప్తచిత్తుఁడై . 9

గీ. చచ్చి వచ్చితి నని న న్న♦సహ్యపడక
మంచిమనసునఁ దండ్రి) మ♦న్నించునట్టి
మొదటివర మిమ్ము నాపుడు ♦ మునుపటివలె
దయఁ దలఁచు, మంచు వరమిచ్చె ♦ ధర్ముఁ డపుడు. 20

ఉ. క్రిమ్మవు క్షుత్పిపాసలు జ♦రామరణంబులు లేవు, లేదు శో
కమ్మమృతత్వ మబ్బును సు♦ఖం బవు, స్వర్గనివాసికంద్రుడు త
త్త్వమ్ము నెఱుంగు దీవెపుడు ♦ ధర్ముఁడ ! స్వర్గము నొందు
నట్టి మా। ర్గమ్ము నాకు రెండవవ♦రంబుగఁ జెప్పు మె
ఱుంగ నాపుడున్. 11

సీ. ఈనచికేతాగ్ని ♦ లోన ముమ్మాఱు య
థావిధి యజ్ఞతం ♦ త్రములు నడపు
నతఁడు తత్త్వ మెఱింగి ♦ యతిశాంతుఁ డవు, మఱి
యీయగ్ని నెఱిఁగిన ♦ యెట్టినరుఁడు
మృత్యుశోకంబుల ♦ మించి యానందించు,
మూఁడవ వర మింక ♦ వేఁడు మన్న
మఱి విను, ధర్ముఁడ! ♦ మరణంబు నొందిన
పిదప నీయాత్మ యు ♦ న్నదియొ? లేదొ?

గీ. తెలియవలయును నా కిదె ♦ తెలుపవలయు
నన్నఁ, గాలుఁడు నచికేతుఁ ♦ డా! యగమ్య
మిది తెలియలేరు దేవత ♦ లేని, వేఱు
వరము వేఁడుము నావుడు ♦ వాఁ డెఱింగి. 12

ఉ. దేవరతప్ప మా కొరులు ♦ తెల్పెడివారలు లేరు గావునం
దేవతలైనను దెలియ ♦ నేరరు గావున నిన్ను వేఁడెదన్
నావుడుఁ, బాడిపంటలు ధ ♦ నంబులు నాయువుభూవిభుత్వముం
గావలె నన్న నివ్వ యడు ♦ గం దగు నియ్యది తప్ప, నావుడున్.

గీ. ఈవు చెప్పిన భోగము ♦ లెల్ల నశ్వ
రంబు, లింద్రియసుఖము జీ ♦ ర్ణమవు, బ్రహ్మ
మైన, నల్పాయు, వల్పాయు ♦ వైన నాకు
నీ వనిన భోగములఫల ♦ మేమి చెపుమ? 13

ఉ. కోరికలన్ ద్యజించితివి ♦ గొబ్బున నోనచికేత ! నీవు సం
సారమున న్మనింగెడి య♦సారగతిం గనకుంటి వెంతయుం
దూరము లయ్యె విద్యయును ♦ దోడియవిద్యయు. నిన్నుఁ
జెందవే । కోరికలు న్నవిద్యఁ గనఁ ♦ గోరినవానిగ నేఁ ద
లంచెదన్. 15

గీ. చెప్పఁ దెలియునె యణుగతి ♦ నొప్పు నాత్మ
బ్రహ్మసాక్షాత్కృతిం గన్న♦వారు సెప్ప
సులభముగఁ బోధపడు దర్క♦ములను బడయ
నలవిగా దాత్మవిషయ ము♦జ్జ్వలము గాన. 16

క. గురువులు చెప్పినచో నది
పొరయించున్ జ్ఞానసిద్ధి; ♦ పొరిపొరి నీతో
సరిగాఁ బ్రశ్నము లడుగం
దొరకొను వాఁ డింక మాకు ♦ దొరకఁ గలఁడే. 17

సీ. ఎద్దాని వేదంబు ♦ లెల్లఁ బ్రాప్యం బని
తలఁచునో, దేనిని ♦ దపము లెల్లఁ
జెప్పునో, దేనికై ♦ చిత్తంబునను గోరి
బ్రహ్మచర్యాదు లే♦ర్పఱుపఁబడెనో
తత్స్వరూపముఁ జెప్పె♦దను విను నచికేత !
యదియ యోంకార ♦ మయ్యక్షరంబె
బ్రహ్మ, ముత్తమ మదె♦వ్వఁ డెఱింగి దేనిని
గోరునో వాఁ డది ♦ కూర్మిఁ జెందు

గీ. నీవరావరబ్రహ్మ స్వ♦రూపసాధ
నం బెవఁ డెఱుంగు వాఁడు, బ్ర♦హ్మంబు నందు
నాత్మ పుట్టదు చావ దె♦ట్లయిన దేహ
మంత మైనను జెడదు ని♦త్యం బజంబు. 18

---

# *రామరావణుల ప్రథమ యుద్ధము— రాముని న్యాయబుద్ధి.



క. జననాథుఁ డనికిఁ గడఁగఁగ
హనుమంతుఁడు కేలు మొగిచి ♦ యవనీశ ! దశా
ననుఁడు రథి గాన నే వా
హన మయ్యెద నీకు ననిన ♦ నగుఁగా కనుచున్. 1

---

* ఈ కథ భాస్కరరామాయణమునందలి యుద్ధకాండములోనిది. ప్రహస్తుని మరణమునకుఁ గోపించి రావణుఁడు తొలిసారి రామునితో యుద్ధ మొనర్చిన సందర్భములోనిది. ఈపద్యములు హుళక్కి భాస్కరకవి కర్తృములు.

ఈమహాకవి క్రీ.శ.1300 సం॥రప్రాంతమున రెండవ ప్రతాపరుద్రుఁడు ఓరుగల్లును పాలించుకాలమున నుండెనట !. ఈభాస్కరకవియింటిపేరు హుళక్కివారు. ఇప్పు డావంశస్థులు 'అళక్కి వారు' అని పిలువఁబడుచున్నారు. రంగనాథరామాయణమునకు పోటీగా మంత్రిభాస్కరునిచేఁ బ్రశే

తే. అతని వెన్కకు నైరావ♦తాధిరూఢుఁ
డైన జంభారి చెలువున ♦ నగ్గలించి
శింజినీఘోరటంకృతుల్ ♦ సెలఁగ సన్న
రేంద్రనందనుఁ డెలుఁగెత్తి ♦ యిట్టు లనియె. 2

ఉ. నాకు మహోపకారము మ♦నంబున నోడక చేసి తింక నే
లోకము దూఱువాఁడవు! నె♦లుంగుచు నీ వెనువెంటనా
శరానీకము వచ్చినం, దులువ! ♦ నిన్నిట నెవ్వరు గాచు
వారు! దిక్పాకమలాసనప్రభృతు ♦ లైన వధింపక రా
ముఁ డేఁగునే? 3

క. నీవారైన ఖరాదుల
త్రోవయె నీ కనిన నధిక♦రోషముతో నా
రావణుఁడు విల్లు మోప్రియుం
బావకపటుబాణపంక్తిఁ ♦ బావని నేసెన్. 4

---

పించబఁడి తన పుత్రుఁడగు మల్లికార్జునభట్టు' శిష్యుఁ డగు కుమారరుద్రదేవుఁడు, మిత్రుఁ డగు 'అయ్యలార్యుఁడు' సహాయపడగా హుళక్కిభాస్కరుఁ డీ రామాయణమును రచించె నందురు. ప్రోత్సహించిన మంత్రిభాస్కరుఁ డీరామాయణములోని 'అరణ్యకాండము' నాంధ్రీకరించెను. ఈ భాస్కరుఁడు యుద్ధకాండములో సగమును, ఆతనిమిత్రుఁ డగు 'అయ్యలార్యుఁడు' యుద్ధకాండములోని కడపటిభాగమును, మల్లికార్జునభట్టు 'బాల కిష్కింధ, సుందర' కాండములను, కుమారరుద్రదేవుఁడు 'అయోధ్య' కాండమును ఆంధ్రీకరించిరి.

వ. అప్పు డారఘువీరశేఖరుండు గన్నుఁగవఁ గెంపు నిగుడం
గనుంగొనుచు నప్పౌలస్త్యుం గదిసి. 5

ఉ. ఒక్కట నారిఁ బోసి వివిధోగ్రశరంబులఁ దేరిచక్రముల్
చెక్కలు సేసి పైపడప్రు ♦ చిందఱవందఱ లాడి వాజులన్
వ్రక్కలు వాపి సూతుఁ బడ ♦ వైచి పతాక దళించి కైదు
వుల్ । చక్కఁగఁ ద్రుంచి యెల్లి పలు ♦ చందములం బొలి
యించి వెండియున్. 6

తే. అశనిసంకాశ మగు నొక్క ♦ నిశితశరము
గొని రయంబున నురమేసి ♦ కొంకఁ జేసి
యర్ధచంద్రబాణమునఁ దీ ♦ వ్రార్చు లడరఁ
దోన కోటీరపంక్తియుఁ ♦ ద్రుంచివైచె. 7

వ. ఇట్లు రావణుండు పరిభవింపంబడి కోఱలు వెఱికిన మహాస
ర్పంబు తెఱంగున దర్పం బుడిగి మనంబున. 8

చ. వరుణునిపాశము ద్రిదశ ♦ వల్లభువజ్రముఁ గాలుదండమున్
సురలనమస్తశస్త్రములుఁ ♦ జూచినవాఁడన కాదె! యీర
ఘూత్తరువిశిఖంబులంత బెడి ♦ దంబులు గా వని నాకు నంచు
నై । విరవిర వాఱఁ జే సడలి ♦ విల్లు పడంగని రాముఁ
డిట్లనున్. 9

ఆ. ఇంతదాఁకఁ గయ్య ♦ మినసుతాదులతోడఁ
జేసి యలసినట్లు ♦ చేష్ట దక్కి

యున్నవాఁడ వగుట • నిన్నింక నే సేయ
దప్పి దీర్చుకొని క•డంగు మనిస. 10

క. మీఁజీనభయమున రామునిఁ
దేఱి కనుంగొనఁగ నోడి • ధృతి కడుఁ దూలన్
వేఱొకని తేరిపైఁ బడి
పాఱె యతఁడు లంక సొచ్చెఁ • బౌరులు బెదరన్. 11

---

## వర్షకాలము—శ్రీకృష్ణుని ప్రవర్తనము



సీ. పూర్వవాయువులు ప్ర•భూతంబులై వీచెఁ
బడమట నింద్రచా•పంబు దోఁచెఁ
బరివేషయుక్తమై • భానుమండల మొప్పె
మెఱుపు లుత్తరదిశ • మెఱవఁ దొడఁగె

---

ఈ గాథ బమ్మెర పోతనామాత్యకృతమగు 'ఆంధ్రభాగవతమునందలి దశమస్కంధపు పూర్వభాగములోనిది. శుకయోగి పరీక్షిన్మహారాజునకుఁ జెప్పిన శ్రీకృష్ణగాథాసంబంధమైనది. పోతనమహాకవి క్రీ. త. 1420 సం॥ర ప్రాంతమున 'ఏకశిలా' నగరము (ఏక + శిల=ఓరు + గల్లు=ఓరుగల్లు)నం

దక్షిణగాములై ♦ తనరె మేఘంబులు
జలధరానీకంబు ♦ సంతసించెఁ
జాతకంబులపిపా♦సలు కడపలఁ జేరెఁ
గంతారవహంసల♦గర్వ మడఁగ
ఆ. నిజకరాళివలన ♦ నీరజబంధుండు
దొల్లి పుచ్చుకొన్న ♦ తోయ మెల్ల
మరల నిచ్చుచుండె ♦ మహీకర్షకానంద
కందమైన వాన♦కందువ నొగి. 1

క. వాడక ప్రాలక తెవుళులఁ
గూడక తగ నల్లగెఱలు ♦ గొని నవకములై
చూడఁగ భద్రము లగుచును
వీడెన్ సస్యంబు లిడుమ ♦ వీడెం బ్రజకున్. 2

క. జీవనము సాలఁ గలిగియుఁ
గావరమున మిట్టిపడని♦ఘనునికిప్రియ నదీ
జీవనములు సార జలనిధి,
ప్రావృట్కాలమున డిందు♦పడి యుండె నృపా! 3

శా. ఆవర్షాగమమందు గోవుల నర♦ణ్యాంతంబులన్ మేపుచున్
గోవిందుండు ప్రలంబవైరియుతుఁడై ♦గోపాలవర్గంబుతోఁ

దుండువాఁడు. శ్రీరామభక్తుఁ డగుటచే నాతనికే భాగవతము నంకితము చేసెను. సహజపాండిత్యప్రతిభావంతుఁడు. కవిత ధారాశుద్ధి గలది. ఆంధ్ర వాఙ్మయమున నీభాగవతము 'భక్తిజ్ఞానవైరాగ్యములను రసయుక్తముగాఁ జెప్పుటలో నగ్రగణ్య మైనది. పోతనమహాకవి 'వీరభద్రవిజయము' అను మఱియొక ప్రబంధమును రచించెను.

బ్రావీణ్యంబునఁ గందమూలఫలముల్ ♦ భక్షించుచున్
మంజులగ్రావాగ్రంబులఁ బ్రీతిఁ జల్లి గుడిచెం ♦ గాసార
తీరంబులన్. 4

సీ. విశ్వమోహనమైన ♦ వేణునినాదంబు
సరసగంభీరగ♦ర్జనము గాఁగ
మహనీయనిర్మల ♦ మందహాసస్ఫూర్తి
లలితసౌదామనీ♦లతిక గాఁగఁ
దల చుట్టు బాగుగ ♦ దనరు పింఛపుదండ
శైలభేదనశరా♦సనము గాఁగఁ
కరుణాకటాక్షవీ♦క్షణసుధావర్షంబు
సలిలధారాప్రవ♦ర్షంబు గాఁగ
తే. జాడ నేతెంచు గోపాల♦జనముసింద్రి
చాతకంబుల దురవస్థ ♦ సక్క జేసి,
కృష్ణమేఘుంబు బహుతర♦కీర్తి నొప్పె
విమలబృందావనాకాశ♦వీధియందు. 5

క. గోవుల వృషవత్సంబుల
వావిరిఁ బూజించి పిదప ♦ వర్షాకాల
శ్రీవనితను బూజించెను
శ్రీవల్లభుఁ డయ్యె గోప ♦ శేఖరుఁ డధిపా ! 6

వ. ఇట్లు కృష్ణుండు విహితవిహారంబుల వర్షాకాలంబు పుచ్చె నంత.

---

# * ప్రవరుఁడు—వాని దినచర్య.



మ. వరుణాద్వీపవతీతటాంచలమునన్ ♦ వప్రస్థలీచుంబితాం
బరస్థసౌధసుధాప్రభాధవళిత ♦ ప్రాలేయదిఙ్మండలీ
హారిణంబై యరుణాస్పదం బనఁగ ♦ నార్యావర్తదేశంబునన్
బుర మొప్పున్ మహీకంఠహారధవళ ♦ స్ఫూర్తిన్ విడంబిం
చుచున్. 1

ఉ. ఆపురిఁ బాయకుండు మక ♦ రాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివి ♦ ధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహ ♦ గర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవ ♦ రాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై.

---

* ఈకథ ‘ ఆంధ్రకవితాపితామహుఁ ’ డను బిరుదును శ్రీకృష్ణదేవరాయలచే నొందిన అలసాని పెద్దనమహాకవికృతమగు ‘ స్వారోచిష మనుసంభవము ’ అను మారుపేరుఁగల మనుచరిత్రములోనిది. ఇది శ్రీకృష్ణదేవరాయునికే అంకిత మీయఁబడెను. పెద్దనమహాకవి క్రీ. శ. 1509 సం॥ము మొదలు 1526 సం॥రమువఱకు కర్ణాటకసామ్రాజ్య మేలిన శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునందు విజయనగరమున (హంపి) నుండువాఁడు. కవి మనుచరిత్రను గృతి నిచ్చినపుడు శ్రీకృష్ణదేవరాయలు కవిని బల్లకిలోఁ గూర్చుండఁబెట్టి యూరేగించుచుఁ దానె తొలుత పల్లకిని బట్టి యెత్తెనఁట !

మనుచరిత్ర ఆంధ్రవాఙ్మయమునందు మొదటి ప్రబంధము. పెద్దన హరికథాసారము, అను మఱియొక గ్రంథమును గూడఁ జేసెనఁట ! అది యిప్పుడు మృగ్యము.

ఉ. యూవనమందు యజ్వయు ధ♦నాఢ్యుఁడు నై కమనీయకౌ
తుక। శ్రీవిధిఁ గూకటుల్ గొలిచి ♦ చేసినకూరిమి సోమి
దమ్ము సౌఖ్యావహ మై భజింప సుఖు♦లై తలిదండ్రులు
గూడి దేవియున్ । దేవరవోలె నుండి యిలుఁ ♦ దీర్పఁగఁ
గాఁపుర మొప్ప వానికిన్. 3

సీ. వరుణాతరంగిణీ ♦ దరవికస్వరనూత్న
కమలకషాయగం♦ధము వహించి
ప్రత్యూషపవనాంకు♦రములు పైకొనువేళ
వామనస్తుతి పర♦త్వమున లేచి
సచ్ఛాత్రుఁ డగుచు ని♦చ్చలు నేఁగి యయ్యేట
నఘమర్షణస్నాన ♦ మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి ♦ సావిత్రిఁ జపియించి
సైకతస్థలిఁ గర్మ♦సాక్షి కెఱఁగి

తే. ఫలసమిత్కుశకుసుమాది ♦ బహుపదార్థ
తతియు నుదికిన మడుఁగుదో♦వతులుఁ గొంచు
బ్రహ్మచారులు వెంటరా ♦ బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ దన్ను ♦ మెచ్చి చూడ. 4

శా. శీలంబున్ గులమున్ శమంబు దమమున్ ♦ జెల్వంబు లేఁ
బ్రాయమున్ । బోలం జూచి యితండె పాత్రుఁ డని యే ♦
భూపాలుఁ డీవచ్చినన్ సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు
మాన్యక్షేత్రముల్ పెక్కు-చం।దాలం బొందు నొకప్పుడున్
దరుగ దిం♦టం బాడియున్ బంటయున్. 5

తే. వండ నలయుదు వేవురు ♦ వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియా ♦ నతని గృహిణి
నతిథు లేతేర, నడికిరే ♦ యైనఁ బెట్టు
వలయు భోజ్యంబు లింట న♦వ్వారిగాఁగ. 6

సీ. తీర్థసంవాసు లే♦తెంచినా రని విన్న
నెదురుగా నేఁగు ద♦వ్వెంత యైన
నేఁగి, తత్పదముల ♦ కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నా♦తిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్నసం♦తృప్తులుగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ ♦ జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు♦నవధి పర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ ♦ దెలియ నడుగు

తే. నడిగి యోజనపరిమాణ ♦ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు నూ♦ర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శ♦నాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరు♦ణాగ్నిహోత్రి. 7

క. ఈవిధమున నభ్యాగత
సేవాపరతంత్రిసకల♦జీవనుఁ డై భూ
దేవకుమారకుఁ డుండం
గా విను మొకనాఁడు కుతప♦కాలమునందుఁ, 8

---

# శ్రీరాముఁడు రావణునిఁ బ్రశంసించుట.



ఉ. మానుపరాని దెవ్వగల ♦ గ్రమ్మంది దురంతవిషాదవేదనన్
మానము దూలిపోవ నస♦మానదయారస ముట్టునట్లుగా
మానక యేడ్చు దైత్యపతి♦మానవతీజనులన్ విభీషణున్
మానవరాజశేఖరుఁడు ♦ మానుగ నిట్లని పల్కె నత్తఱిన్.

క. వగవంగ వలదు నీ వీ
మగువల నూరార్పు; ధైర్య♦మహితాత్ముఁడ వై
తగుభంగి నాదుమాటలు
విగతార్తత నాదరించి ♦ విను మసురేంద్రా! 2

క. వైరులఁ జంపుదు రొండెను
వైరులచేఁ జత్తు రొండె ♦ వరజన్యములన్

---

* కథ భాస్కరరామాయణమునందలి యుద్ధకాండములోనిది. రావణుఁడు మృతినొందినపిమ్మట శ్రీరాముఁడు రావణుంగూర్చి చెప్పి రావణుభార్యలను, విభీషణుని నోదార్చిన సందర్భములోనిది.

కవి 'అయ్యలార్యుఁడు' వాళక్కిభాస్కరునిగూర్చి చెప్పినపు డీతని ప్రశంస కలిగెను.

వీరుల జయాపజయములు
నారయ సమవృత్తి నుండ • వనిరి మహాత్ముల్. 3

ఉ. ఈతఁ డశేషదిక్పతుల • నే పరిగించె, నుదగ్రవృత్తిమై
నీతఁడు సప్తలోకముల • నేలె, నిరంకుశశాసనాఢ్యుఁడై
యీతఁడు సర్వదానవుల • నేర్పడ నేలె, నుదీర్ణసారుఁడై
యీతఁ డసాధ్యుఁ డేరికి న•హీనపరాక్రమశాలి యెల్లెడన్.

శా. నీరంధ్రిప్రథిత ప్రతాప మొదవన్ • నీయున్నచందంబునన్
బోరంగాఁ దరమే ? తదీయసమర•స్ఫూర్జద్విలాసంబు గ
న్నారం జూచితి గాదె? విక్రమకలా•వ్యాపారవిఖ్యాతి మ
న్నారే? యీతని సాటిశూరుల సమా•శ్చర్యసామగ్రులన్.

మ. తడబాటించుక లేక, యుల్లసితదో•ర్దర్పోద్ధతుండై యనిం
బడుచుండాఁకఁ బ్రవర్ధమానవిభవ•ప్రఖ్యాతిమైఁ బేర్చి నే
ర్పడరం బోరె నితండు విస్మయరణ•వ్యాపారనిష్ణాతుఁ డీ
య్యెడ, నీదానవరాజు మెచ్చఁదగుఁగా•కీదుశ్శకన్ శోచ్యుఁడే?

చ. గెలుపది యేల, పోరఁ బరి•కింప జయంబుఁ బరాజయంబునుం
దురితగతిన్ ఘటించు నది • తొల్లియ నిశ్చయ మౌ, నిశా
టుదోర్బలమును విక్రమంబు రణ•పాటవమున్ బహు
దివ్యసాధనంబులకుశలత్వ మచ్చెరువుఁ బొల్పుగ నీక్రియఁ
జావు మేలకా ? 7

వ. కావున,

చ. నిలుకడ గల్గి సాంగముగ నిశ్చితశాస్త్రనిరూఢితోడ నీ
వలయక ధైర్యకౌతుకసమగ్రడ వై భవదగ్రసూతికిన్
నెలకొని యున్నభక్తి విధినిర్ణయ మొప్పఁగ నగ్నిసంస్క్రి-
య । ల్సలుపుము లెమ్ము పొమ్ము సకలంబును జేయుము
వేడ్క నావుడున్. 9

# * మండిరాజుశాసనము.



శ్రీ స్వస్తి సమధిగతపంచమహాశబ్ద, మహామండలేశ్వర, వీర మాహేశ్వర, కులోత్తుంగచోడదేవదివ్యశ్రీపాదారాధక, పరబలసాధక, ఎలదాయసింహాసాహసోత్తుంగ, రణరంగరామ, అకలంకభీమ, సత్యరాధేయ, శౌచగాంగేయ, దుర్జయకులకుముదక్షీరార్ణవనిశాకర, సురుచిరగుణాకర, విక్రమక్రీడావినోద,

* దక్షిణహిందూదేశశాసనముల నాల్గవసంపుటములో నెం 677 రుగా, ముద్రింపఁబడినశాసనము. ఇది గుంటూరుజిల్లా నాదెండ్లమూలస్థానేశ్వరుని దేవాలయస్తంభముపైఁ జెక్కఁబడినిదానికి నకలు. ఈశాసనాంశము క్రి. శ. 1128 సం॥రమున కులోత్తుంగచోడదేవుని సేనానియగు బుద్ధవర్మ పుత్రుఁడు 'మండిరాజు' దీపదాన మిచ్చుట! నన్నయకుఁ బిమ్మట 85 సంవత్సరాలనాఁడుండిన కవిత్వము, అప్పటిరాజుల బిరుదులు నిందు తెలియఁగలవు.

కావ్యవినోద, సుకవికీరసహకార, సుజనాధార, తురగరేవం
త, వైరికృతాంత, వివేకపద్మాసన, గిరిపశ్చిమశాసననామా
ది సమస్తప్రశస్తిసహితుం డయిన శ్రీమన్మహామండలేశ్వర
బుద్ధనరేంద్రునకు.

ఉ. శ్రీరమణీలలాముఁడు వశీకృతవీరశరోధి, హారనీ
హార సరోజ రాజ హర హాసయశోనిధి, వందిబృందమం
దారుఁ డపారవిభ్రమజితస్మరమూర్తి చతుర్థవంశని
స్తారకుఁ డెఱ్ఱమండఁడు బుధప్రణుతుం డుదయించె దానికిన్.

క. సూరికవిస్తుతుఁ డనఘుఁడు
చారుచతుర్థాన్వయాబ్ధిచంద్రుఁడు గులని
స్తారకుఁడు సుజననిధి రిపు
వారణగజరిపుఁడు బుద్ధవమ్మ జనించెన్. 2

మ. అమృతాంశుండు పయఃపయోధి నుదయంబయ్యెట్లు మం
దారవృక్షము హేమాద్రి జనించినట్లు రసరాగం బొందఁ
బూర్వాచలేంద్రమునం దుష్ణమయూఖు యట్లతని కుద్య
త్తేజుఁడయి మండమహీపాలుఁడు పుట్టె వైరిజనలుంటా
కుండు శౌర్యోన్నతిన్. 3

క. ఆస్థాన గగన తరణి మ
నస్థగిత మృగాంకమౌళి నాదింద్ర(ం)మూ
లస్థానమ్మున కాసమ
రస్థలి హాలి, మన్మమండిరా జతిభక్తిన్. 4

ఉ. అంబరసాయకాంబరమృగాంకమితం బగుచుండఁగా శకా
బ్దంబులు మేషమాస సిత( )పంచమి నిర్జరనాథమంత్రి
వారంబున దేవదేవునకు రాగముతోడ నఖండదీప ర
త్నం బొనరించె నార సుధాకరతారకమై వెలుంగంగాన్.

---

# * భామినీవిలాసము

## (పండితరాజశతకము.)

### మామిడిపండు

మ. ఫలచూడామణి చూత మెల్లయెడల న్భాసిల్ల జంబూఫల
మ్ములు నల్లంబడె, లజ్జ; గొబ్బరిఫలమ్ముల్ భీతి నీరయ్యె లో
పల వృక్షమ్ముల మీఁద నుండియును, గోపస్ఫూర్తి శూ
లాళి ఔ।మ్ములఁ జెందె న్పనసమ్ముల్; దాడిమఫలమ్ముల్
వ్రక్కలయ్యె న్హృదిన్. 1

---

* భామినీవిలాసమునకు పండితరాజశతకము అని మఱియొక పేరు కలదు. సంస్కృతమున 'జగన్నాథపండితరాయలు రచించిన దీనిని, ఆంధ్రమున బ్రి. శ్రీ. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారాంధ్రీకరించిరి. వీరు రాజమహేంద్రపురమున 'ఆర్ట్సుకాలేజీ'లోఁ బెక్కేండ్లు పండితులుగా

——♦ సంపెంగ ♦——

గీ. భ్రమణవేళను గనుబంత ♦ రాళమందుఁ
గంటె? యెందైన జవి గొంటె? ♦ వింటె? కలదె?
తథ్యము వచింపు! పక్షపా♦తమ్ము మాని;
జాజిపువుఁబోలు కుసుమమ్ము ♦ చంచరీక! 1

క. తిరుగుచు విరిగుత్తుల, బం
భరములు మూర్కొనవు గంధ♦ఫలి; యది కాదే?
సురభి; యవి వల పెరుంగవె;
పరమేశ్వరునాజ్ఞ యెంత ♦ బలవత్తరమో! 2

——♦ చిలుక ♦——

క. అపు రవుర సకలవిహగము
లవిరతము నిజేచ్ఛఁ దిరిగి ♦ యలరన్, శుక! నీ
కవు పంజరమున బంధము
చెవి కింపగు పలుకు తప్పు చేతనె, కట్టా! 1

క. పలుతేనియ లొలికెడు పలు
కుల నేరుపు మేనిసొంపు ♦ గురుశీలము, నా

---

నుండిరి. బహువిధ సంస్కృతాంధ్ర గ్రంథములను రచించిరి. అందు సంస్కృత భారతమును కవిత్రయమునకుఁ బిమ్మట శ్రీవ్యాసమూర్తిశాస్త్రిగా రాంధ్రీకరించుటయే వీరి ప్రశస్తికిఁ దార్కాణము. భారతము నాంధ్రీకరించుటచే వ్యాసనామ మీపండితునియందు సార్థకమైన దనవచ్చును. భామినీ విలాస పద్యములు 'అన్యాపదేశములు' భావకవిత్వమునకుఁ బునాదులు.

బలు చిలుకపిల్ల సుగుణ
మ్ములు, ఫలహీనములు పిల్లి ♦ ముందవి, యెల్లన్. 2

—♦ చాతకము ♦—

చ. తనువును నేఁడె చేరి జ ♦ దా ! జలదానము చాతకార్భక
మ్ము, నతిచిరోపవాసకృతి ♦ భూరిదవానలపీడితమ్ము; వీ
వను నిమిషంబులో మఱొక ♦ రై పురకు న్నవనంబు నీవెటన్
జనెదవో, నీ జలం బెటనో ♦ చాతక పోతము నేడ కేఁగునో.

చ. విడిచి పరాకు నాపలుకు ♦ విన్మ చెలీ ! నినుసంబు చాతకా;
యడరెడు నింగిఁ బల్మొగుళు ♦ లన్నియు నొక్క తెఱంగుగా
వు నూతడి పెడు కొన్ని వానలను ♦ ధారణి యెల్లను; గొ
న్నియూరకే । నడిచెడు; గన్నయన్నిటికి ♦ నాలుక చాఁపక
విన్నఁ బాటుతోన్.



# వచనభాగము.

## బాలభారతకథలు

### పాండవుల బాల్యము—పాండురాజుమృతి.

సుతపంచక లాభమునఁ బాండునృపాలుఁడు పంచకల్పకములతోడి స్వర్గమువలెఁ బంచబాణములతోడి మన్మథునివలెఁ బంచభూతములతోడి సృష్టికర్తయుం బలె నలరారెను. పాంసుకేళీరతులు, తపోధనోపలాలితులు, సింగంపుజడల నూడఁబెఱుకువారు నగునాబాలురు తపోవనములోని గజకలభములంబోలిరి. క్రమముగ నుపనీతులై సకలశ్రుతిస్మృతుల నభ్యసించిన వారింగాంచి, కేవల భరతవంశజులే కాక సజ్జనులును గృతార్థులయిరని ప్రశంసలు వెడలెను. వారికి యౌవనము వచ్చినంతట లోకుల నేత్రములకుఁ బద్మములం గాంచిన తుమ్మెదలకువలె నానందము కలిగెను. వారిభుజములకు దైర్ఘ్యమును వక్షములకు వైశాల్యమును స్వరములకు మంద్రవృత్తియు నేత్రములకు స్నిగ్ధత్వమును

---

ఈగ్రంథము త్రిలింగరాజ్యము నేలిన రెండవప్రతాపరుద్రుని (క్రీ.త. 1290—1323) ఆస్థానకవియు, సంస్కృతమున 70 గ్రంథములు రచించినవాఁడును, 'విద్యానాథుఁడు' అను బిరుదుగలవాఁడు నగు 'అగస్త్యమహాకవి' చే వ్రాయఁబడిన బాలభాగవతమున కాంధ్రీకరణము. ఆంధ్రీకర్త కొత్తపల్లి సూర్యరావుగారు. వీరు, సంస్కృతాంధ్రద్రవిడాంగ్లభాషలు నేర్చి తెనుఁగున ముప్పది గ్రంథములకుఁ బైగా పద్యగద్యాత్మకములను రచించిరి. 'రాజయోగిని, సరస్వతి, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలకు' సహాయ సంపాదకులుగా, నలువదియేండ్లకుఁ బైకాలము భాషాసేవఁ జేసి కీర్తిశేషులైన ధన్యులు.

దశ్త్రాలమునఁ బొడసూపెను. ఇట్లుండ నొక్కపుడు కుహూకాము ఖమునకుఁ గుశలోదయమును మన్మథగజమునకు మదోదయము ను వాయువులకుఁ బురుటిల్లును నైన మధుమాస మాసన్న మ య్యెను. గాలివలన లేచిన నూతనచూతపరాగము వసంతలక్ష్మి చీరలకుం బురుగు పట్టకుండ వేసికొను పటవాసపిష్టమువలె నుం డెను. మన్మథమంత్రవాదులకు మోహనచూర్ణము నయ్యెను. సకలపుష్పగంధములచేత నష్టదిక్కులుఁ బరిమళింపఁజేయు మాధ వునకు మాలతీసౌరభశోభను గల్గించుశక్తి లేకపోయెను. ప్రపంచ ములో సర్వసమర్థుఁ డెవ్వఁడు? అశోకవృక్షములనుండి గాలికి రేఁగిన పుష్పాదితిట్టలు, కోపించినమన్మథుఁడు వియోగులపైఁ బ్రయోగించు నాగ్నేయాస్త్రములవలెఁ గనఁబడియెను. మధు ద్రవస్వేదమిళితములైన కేసరకుట్మలములు వసంతసంపర్కమున లేచిన వనలక్ష్మీపులకలవలెఁ దోఁచెను.

అంతట దక్షిణదిశనుండి వచ్చువాయువు లనెడుయమ భటులవలన లాఁగబడినమనస్సు గలవాఁడగు పాండురాజు మద్ర రాజపుత్రితో వనమునకు వయాళి వెడలెను. కేసరములనుండి వె డలు శీతలశీధుశీకరములచేతను గలకంఠపంచమనాదములచేతను నతనిమనంబునఁ జిరకాలమునుండి నిద్రించు మనోజుఁడు లేచెను. పుష్పగంధగర్భితమగు మాధవీలతామండపములోఁ జేరి, మునిశా పమునకు వెఱచి కంపించుచున్న మాద్రిని బలాత్కారముగఁ బరి గ్రహించి యతిశీఘ్రకాలములో నసువులు విడిచి మన్మథశయ్యా

మగునను శంకచే నిస్పృహుఁడనై యొక్కనాఁ డతని సకాశమున కేగితిని. అపుడీ నా కుమారుఁడు ముగ్ధుఁడు దుగ్ధకాంక్షియై పిండిగలిపిన నీరములే క్షీరము లనుకొని తుష్టిఁ జెందు వీని దైన్యమునకై ఖిన్నుఁడనై యాచనను గర్హించుచుఁ, బండితుఁడు కూడనిపని చేసియైనను గుటుంబరక్షణము చేయక తప్పదు గావున నా యజ్ఞసేనునికి నేను పూర్వమిత్రుఁడ నని తెలిపితిని. అతఁడు కోపకలుషీకృతముఖుఁడై యుపహసించుచు నిట్లు పలికెను. దుర్గతిబ్రాహ్మణుఁడవగు నీకును; రాజనైన నాకును గాజునకును రత్నమునకును గూటికవలె సఖ్య మెట్లగునది. అనిన నామాటలచే నవమానితుఁడనై నీసన్నిధికి వచ్చితిని. మహాస్త్రపారగులైన నీమనుమలకు వారిమనోరథములను బూర్తిగావించెదను.' అనిన నలరి గంగానందనుఁడు, మొదట ధనమును, బిదపఁ బౌత్రవర్గమును నా గురునకు సమర్పించెను. రేణుకాతనయ పాదరేణుపూతమైన శిరస్సుగల ద్రోణుఁడు వారి నాయుధపరిశ్రమమునకు నియమించెను. భూతలమునకుఁ దిలకమువంటి యర్జునునిచేత సగుణమైన శరాసనమును ద్రోణాచార్యుని చిత్తమును నిత్యము నాకర్షింపఁబడుచుండెను. ఒకనాఁడు తనయాజ్ఞచేతనే శిక్షితాస్త్రుఁడై యర్జునునికంటె నధికుఁడైన యేకలవ్యుని, గురుఁడు గురుదక్షిణగా వానిదక్షిణాంగుష్ఠము నడిగి పుచ్చుకొని యాతనితో సమానుని గావించెను. ద్రోణాచార్యుఁ డొకప్పుడు వారిగుఱిం బరీక్షించుటకై చెట్టు చివరకొమ్మమీఁదఁ జిన్న

పిట్టవంటి యొక లక్ష్యమును నిలిపిన నొక్క యర్జునుఁడు మా త్రమే లక్షించి యాకృత్రిమపక్షిశిరమును నిశితధన్వుల మత్సర ములతోఁ గూడ హరించెను. స్నానమునకై నీటిలో దిగుడు, మొసలి కాలు పట్టుకొనఁగాఁ గష్టపడిన గురుఁడు ఫల్గునాస్త్ర ములచేతనే సుఖముం గాంచి మెచ్చుకొని యాతనికి దివ్యాస్త్ర ము లిచ్చెను. అర్జునుని యస్త్రకౌశలము నెఱుక పఱుచుటకై ద్రో ణుఁడు శిల్పులచే నొక్క రంగస్థలమును నిర్మింపించి మంగళ బలులు నిర్వర్తించి రాజపుత్రులతోఁ గూడి యచ్చటికి వచ్చెను. అది చూచుటకై వచ్చి పౌరులు జానపదులు రాజులు ననేకము లగు మంచలపై గూర్చుండి రంగము నలంకరించిరి. దేవవి మానములచే నభఃస్థలము పూరింపఁబడినది. గురుపూజ గావించి ధర్మజ ముఖ్యులు ధనుర్ధారులై స్థూలసూక్ష్మ చలాచల లక్ష్యము లయందుఁ దమ నైపుణిం గనఁబఱచిరి. పిమ్మట నాయుధవిశే షములగు ఖడ్గములు ముద్గరములు మొదలగు వానితో వినోదిం చి నేర్పు మెఱయించిరి. పిదప గుఱ్ఱముల నడిపించి, యేనుఁగు లం ద్రోలి, రథములెక్కి యనేకరీతులఁ జమత్కారములయుద్ధో పయోగవిధములఁ దమతమ సామర్థ్యములఁ బ్రకటించిరి. గదలు చేఁబూని భీమదుర్యోధనులు సాలవృక్షములం జేకొన్న యేనుఁ గులవలె రంగమున కవతరించిరి. మండలపరిచారములతోఁ గు ప్పిగంతులతో నుభయులును గదాఘాతము లొనర్చుకొంచు వే డుకలు చూపుచుఁ గ్రమక్రమముగా నయ్యది క్రోధము విజృం

భించి యుద్ధము చేయుటలోనికి దింపుట గాంచి, యశ్వత్థామ నారి గదావిహారమును మానిపించెను. అనంతరము గురుని యానతి నర్జునుఁడు గురుపాదవందనము చేసి కవచధారియై ధనుర్ధరుఁడయి రంగభూమి నలంకరించెను. అగ్ని, వారిధర, హస్తి, కేసరి, వ్యాల, గరుడ, మారుత, సూర్యాది ప్రభృతము లగు దివ్యాస్త్రములను సభ్యులకు సవిశేషముగఁ గనఁబఱిచెను. అపుడు సింహసంహననుం డగు కర్ణుఁడు సింహనాదముచే దిక్కులు నిండించుచు రంగములోనికి దిగియెను. అతఁడును గురుశాసనమున నయ్యర్జునుఁడు చూపిన ధనుర్విద్యావినోదములకంటె నధికవినోదములను గనఁబఱిచెను. ఆనేర్పు చూచి యందఱు నచ్చెరుపడిరి. పాండవులు వ్రీడితు లైరి. దుర్యోధనాదులు సంతోషించిరి. నీతో ద్వంద్వయుద్ధము చేసెదను రమ్మని కర్ణుఁడు పార్థుని బిలిచెను. నీ నా యంతరము తెలిసికొనకుండఁ బ్రేలుచున్న నిన్ను నా శరములు పరముఁ బొందించు నని యర్జునుఁడు పలుకఁ, గర్ణుఁడు, నిలు రంగములోఁ జక్కఁగ నిలుము, నే నీరంగగృహదేవతకు నీశిరఃపద్మమును బలిచేసెద ననియెను. ఈమాటలు వినిన కృపుఁడు "పౌరవుఁ డగునర్జునుండు సూతపుత్రుఁడ వగు నీతో యుద్ధముచేయఁ"డనిన నాతఁడు సిగ్గుపడియెను. దుర్యోధనుఁడు లేచి యపుడు కృపాచార్యునితో నిట్లనియె. 'ఆచార్యా! నీ విట్లు పలుకఁ దగదు. లోకవిఖ్యాతపౌరుషము గలవానికులమును బండితులు గణింపరు. పురాతనుఁ డగునారాయణుఁడు స్తంభము

లోఁ బుట్టెను. క్రౌంచ వింధ్యపర్వతముల గర్వ మడంచిన కుమారాగస్త్యులవలె నీవును ద్రోణాచార్యులును శర కుంభ సంభవులు గదా!' అనిపలికి మంత్రవిదుం డగుదుర్యోధనుఁడు కర్ణుని బంగారు కలశముల జలంబున నంగరాజ్యమున కభిషేకించి తన కాతనిని సఖునింగాఁ జేసికొనియెను. పరస్పరోపకారు లైన వా రిరువురును పాండవులను లక్ష్యము చేయ రైరి.

ఈరీతిగా నస్త్రవిద్యాసాగరపారగు లైన నందఱం గూర్చికొని యొక్కనాఁడు ద్రోణుఁడు వారితో 'మీ రువ్వెత్తుగఁ బోయి కయ్యంబున నోడించి ద్రుపదుని బట్టి తెచ్చి నాకు గురుదక్షిణ యిండని కోరెను. ఆగురునిమాటలను శిరస్త్రాణములుం బోలె శిరసావహించి పటహ నిస్వనములతో బలములం గొని రాజకుమారులు ద్రుపదపురమునకు బైలువెడలిరి. కుంభజన్ముఁ డగుద్రోణునివలనఁ బ్రేరేపింపఁబడిన యీసేనలు పరివహ నామకవాయువుచేత రేఁపఁబడిన మేఘములు మేరుమేఖల నాక్రమించినట్లు ద్రుపదనగరముచుట్టును నాక్రమించెను. పౌరవసేనలోని గజఘీంకారము వినినద్రుపదుబలము, మేఘధ్వనిని వినిన సింహములు సహ్యపర్వతకందరములలోనుండి వెడలినట్లు పట్టణమునుండి వెడలెను. సోమకులచేతను గురుకుమారులచేతను నిర్మింపఁబడిన సజ్జనవినుత మైన యారణ మర్జునసైన్యవేదమునకుఁ బ్రణవత్వమును బొందెను. సృంజయరక్తముచే రంజింపఁబడిన భూమిని విశిఖజాలవర్షము గురిపించుచుఁ బార్థుఁడు కౌరవశత

ఘును బరిభవించెను. బాణములచే ధనువులు విఱిచి ఖడ్గధారి యై చని యర్జునుఁడు గురువైరిని సృక్వలోలజిహ్వుఁ డైనరాహువు చందురునిఁ బట్టుకొనినట్లు పట్టుకొనియెను. కౌరవపాండవులు ద్రుపదుని గురుసన్నిధికిం దెచ్చిరి. సిగ్గుచేఁ దలవంచికొనిన ద్రుపదునితో ద్రోణుడు, "క్షత్రియప్రవర! పూర్వము నీవు బ్రాహ్మణుఁడ వని నన్నవమానించితివి. ఇపుడు దానికి ఫల మిట్లు నాశిష్యనివహముచేతఁ బొందితివి. అర్ధరాజ్యము నాకిచ్చితివా, యర్ధాసన మిచ్చిన కుబేరునితో శివునకువలె నాతో నీకు శాశ్వతసఖ్య మగును." అని పలికి సత్కరించి పంపఁగా నాతఁ డొనర్చిన పరాభవమును పార్థునిపరాక్రమమును దలంచుకొనుచు నిజపురమునకుఁ జని యంతటినుండి ఋశ్యశృంగుని వంటి తపస్విద్వారమున ద్రోణుని తల ద్రెంచుసుతుని ఫల్గునప్రణయిని యగుసుతను గాంచుటకు ద్రుపదుఁడు యత్నము చేయసాగెను. జాహ్నవీతటతపోవనమున నున్న యుపయాజునికడకు యాజచోదితుఁడై యేఁగి పెక్కుగోవుల నిచ్చి తనకాంక్షితముం దెల్పెను. అతఁ డనుజసహితుఁడై వచ్చి ద్రుపదునిచేతఁ బుత్రికామేష్టిని యథాశాస్త్రముగఁ జేయించెను. సవనాంత సంభృతమైన హవిస్సును యజమానగేహినిచేత హోమము చేయించెను. అంతటఁ గుండాగ్నిలో నుండి ధనుర్బాణములుఁ గవచముఁ గిరీటము ధరించినపుత్రుఁడు పొడముదెంచెను. యాజముని మరల హోమము చేయింపఁగా నగ్నిజ్వాలలో నుండి రక్తపంకజ

షండములోనుండి లక్ష్మివలె నొక్కకన్యక యుద్భవించెను. 'ఈ కృష్ణ, యర్జున వికాసకారిణియుఁ బ్రావృట్కాలము పద్మవనము నకువలె క్షత్త్రియకులమునకు క్షయకారిణియు నగు' నని గగన వాణి పలికెను. పృషతుఁడు తన కర్జునుఁడు చుట్ట మగు ననునా నందముతో ద్రోణునివలనిభయముం దలంపఁ డయ్యెను. ద్రోణుఁడు విరోధి యగు ద్రుపదపుత్త్రునిగూడఁ దనశిష్యునిగాఁ జేసి కొని యస్త్రపారంగతునిం జేసెను. సత్పురుషులకుఁ బ్రాణము కంటెఁ గీర్తి ప్రియముగదా! ధృతరాష్ట్రుఁడు యౌవరాజ్యము నకు యుధిష్ఠిరుఁడు తగు ననితలంచెను. ధర్మజుని బుద్ధికౌశలము నకు దుర్యోధనుఁడు సహించువాఁడు కాఁడు. జ్ఞాతిద్రోహము నకు వైరములు పుడుకలు లేకుండ మండునగ్ని యని లోకులు చెప్పుదురు. ఒకనాఁడు దుర్యోధనుఁడు రహస్యముగాఁ దండ్రి కడ కేఁగి "తాతా! యిపుడు ప్రజలు ధర్మరాజును గోయిలలు చైత్రమును బొగడినట్లు పొగడుచున్నారు. అతఁడే యువరాజైన యెడల మేమందఱము హతాశులము. కావున నీవాలోచింపు" మని వేఁడెను. అది విని ధృతరాష్ట్రుఁడు "నాయనా! నీ విట్లనఁ గూడదు. యుధిష్ఠిరుఁడు తండ్రియగు పాండునివలెనే నాకు భక్తుఁడు. నాకు స్నిగ్ధబంధువు. ప్రజాహితుఁడు. దీనిని నీవు వారింపలేవు. భేదబుద్ధిని దుర్మతమును బోఁగొట్టుకొని పాండవు లను స్నేహభావమున భజింపుము." అనవుడు దనయుఁ డిట్ల నియె. "నేను గర్ణునితో స్నేహము చేయుటచేత భీష్ముఁడు, గు

రుఁడు, గురుపుత్రుఁడు, నతని మేనమామయు నాయందుఁ బక్షము వహింతురు. సహాయరహితుఁడైన పాండవాగ్రజుఁడు మాజోలికి రాలేఁడు. నీయనుజ్ఞపై వారు వారణావతమునకుఁ బోయినయెడల మాకు భయములేదు. పాండవు లిందే నివసించిరా జనులలో వేరుపాటి మాకుఁ బెకలించుటకు వలనుగాని పెనుమ్రాఁకులవంటివా రగుదురు.'' అని పలికిన దురాత్ముని వాక్యము, మదగజము స్వచ్ఛోదకమును గలంచినట్లు ధృతరాష్ట్రుని మనస్సుం గలంప ధర్మతనయుని బిలిచి "వత్సా! పుణ్యాశతము వలనఁ గాని లభ్యముగాని వారణావతమునకుఁ జని శంకరోత్సవమును జూచుట మంచిది. నీ కచ్చట నివసించుట కిష్ట మేని క్రొత్తగా నిర్మింపఁబడిన మనభవనమునం దుండి తమ్ములతోఁ గూడి భూపాలనము చేయుము.'' అనినఁ బెద్దతండ్రివాక్యములలోని విక్రియను గనిపెట్టి బుద్ధిమంతుండు గావున ననుజసహితుఁడై కుంతీనందనాగ్రజుఁడు బైలుదేటి పోయెను.

కౌరవసచివుఁ డగు పురోచనుఁడు వారణావతమునకు ముందే పోయి పాండవులను దగ్ధముచేయుటకై లక్కతో నొక హార్మ్యమును నిర్మించెను. పౌరలోచనచకోరుఁడైన ధర్మజుఁడు పురముం బ్రవేశించి దుష్టమంత్రి చూపిన జతుగృహముం జొచ్చెను. ఆహారవస్తువులలో విష ముండు ననియు నీయిల్లు దహనశీల మైన దనియు సూతుఁడు చెప్పిన యాప్తవాక్యములవలనఁ బురోచనునియెడలఁ బాండవులు శంకించుచునే యుండిరి. వారికి

దినదినముం బురోచనుఁడు తెచ్చి యిచ్చు వస్త్రములుఁ జంద
నాది విలేపనద్రవ్యమును స్వీకరించునపుడు రహస్యముగఁ బరీ
క్షింపకుండ నుపయోగింపకుండిరి. పగలు వేఁటనెపమున గృహ
మున నుండుటలేదు. రాత్రులందుఁ బా మున్నయింటిలోవలె
మేల్కని యుందురు. ఒక్కదినంబునఁ బురోచనుండు నిద్రించు
చుండ నింటి కగ్ని దరికొల్పి విదురునిచేఁ బంపఁబడిన ఖనకుని
చేఁ ద్రవ్వఁబడిన సురంగములోనుండి పురబహిఃప్రదేశమునకుఁ
బాండవులు తల్లితోఁగూడ వెడలిపోయిరి. పాండవవైరి యగు
పురోచనుఁడు కాలిపోయినంతనే పార్థస్నేహితుఁ డగు నగ్ని
దేవుఁ డట్టహాసము చేసినట్లు చిటచిట పటపటలతో గృహము
తయుఁ గాల్చివైచెను. పురోచనునిప్రోత్సాహముచే విషఫల
ములం దెచ్చియిచ్చు వనేచరి సపుత్రికయై యాయింటఁ బరుండి
మృతినొందెను. మఱునాఁడు పురజనులు వచ్చి భస్మముచేఁ
గప్పఁబడిన సారంగముం దెలిసికొనలేక యాచచ్చినవారు కుంతి
తోడి పాండవులే యని విచారించిరి. ఈవార్త కరినగరమునకుఁ
దెలిసి యందలిజనుల హృదయములలోని సంతోషము చల్లాఱి
నట్లు లక్కయింటిలోని యగ్నియుఁ జల్లాఱెను. పాండవులు
మృతినొంది రని దుర్యోధనాదులు పైకి దుఃఖమును లోన సం
తోషమును బొందుచు నెండవేఁడిమిచేఁ బై కష్టమును లోన
శైత్యమును గల నీటికొలనువలె నుండిరి.

బిలములోనుండి వెలువడి తల్లిని నన్నదమ్ములను బుజ

లు గొఱుకు కఱకు వచ్చునని భయపడి పోవువాఁ డెవ్వఁడు ? మూఢురాలవు గాని పురుషులను రక్షించు స్త్రీ యెందుఁగలదు? నీవు మాకుఁ బరభయనివారణము చేయఁగలదానవా ? ఈవృకోదరుఁడు మీయన్నతో నెట్లు పోరునో చూచుచుందుము." అని చెప్పుచుండ రోషవహ్నికణములు గురియుచున్న కన్నులతో బొమముడిగల మొగముతోఁ గాఱుచున్న నెత్తురు నాకికొనుచు రాక్షసుఁడు వారియెదుటకు వచ్చెను. 'ఛీ, నాకులమున నీవు చెల్లెలవై తప్పుఁబుట్టితివి. నీవు మొదల నరుల నెత్తురు ద్రావుటయందుఁ బ్రియము గలదానవు. ఇప్పుడు నరులనే ప్రియపడియున్నదానవు.' అని తోఁబుట్టును దిట్టి భీమునితో 'నీ వీనిశాచరి నేల పొందెదవు, నాకత్తిమొనం జచ్చి సురలోకమున సురకాంతలం జెందెదవు రమ్మనియెను. వా రిరువురును గలియంబడిరి. రాక్షసుఁ డొనర్చిన సింహనాదమునకు వన మంతయు గగ్గోలుపడి నిద్రించుచున్న కుంతియు, నందనులతోఁ బిల్లలసింగమువలె నులికిపడి లేచెను. సాక్షాద్విజయలక్ష్మివలె నచట నిలిచియున్న హిడింబను హిడింబునితోఁ బోరుచున్న భీముని వారు చూచిరి. వజ్రపాతముంబోని పిడికిటిపోటులతో నసురవిశాలవక్షమును బీడించి, మధుదానవుని నారాయణుఁడు చేసినట్లు భీముఁడు పిండిపిప్పి చేసెను. తెల్లవాఱుచుండఁగాఁ బకములు రాక్షసుని నెత్తురు ద్రావుటకువలె వృక్షాగ్రములనుండి లేచినవి. తమోమయుఁడయిన రాక్షసాధముని బకల్పటిచినయచ్ఛిత్రకరుఁ డగుభీముఁడు

పాండవమానసంబులనువలెనే కరప్రసారము చేయుచు సూర్యుఁడుదయించి పద్మములను వికసింపఁజేసెను. మన్మథార్తయైన హిడింబపైఁ గరుణించి తల్లియానతిని బుత్రోత్పత్తి వఱకు నుండ నిమ్మని ధర్మజుఁడు భీము నొడంబఱచెను. ఆనియమమునకు సమ్మతించిన దానితోఁగూడ నిహతరాక్షసయైన వనమునుండి వెడలి శాలిహోత్రుని సరస్సు నొప్పునకుం జని పాండవులు పరాశరాత్మజుని దర్శించిరి. ఆరక్కసి సుందరస్త్రీరూపము దాల్చి పగ లంతయుఁ దనప్రభావముచే నిర్మింపఁబడిన గృహములయందు భీమునితో విహరించుచు రాత్రులయందుఁ గుంతీసపర్య చేయుచుండెను. ఇట్లు కొంతకాల మిచ్ఛావిహారములతోఁ బురూరవస్సహితయైన యూర్వశివలె నక్కాంత భీమునితో నెంతయు సంతసమున నుండెను. అంతట వజ్రపాతమును సహించుఱొమ్ముగల ఘటోత్కచుఁ డను కుమారుని భూదేవి యాదివరాహసంపర్కమున నరకుం గనినట్లు కని హిడింబ యానందించెను. ఆబాలుఁడు పుట్టినతోడనె మేను వెంచి మీసలు దంష్ట్రలు మెఱయ నిలిచి 'మీకుఁ గోరినకార్యమున సాయము చేయ వచ్చెదను, సెల విం డని మ్రొక్కి తండ్రులను వీడి తల్లిని వెంటఁగొని యెక్కడకో వెడలిపోయెను.

తరువాతఁ బాండవులు బ్రాహ్మణవేషములు దాల్చి వేత్రకీయ పురమునకుం బోయి యొకబ్రాహ్మణునియింట విడిసి భిక్షావృత్తిని వర్తించుచుండిరి. వారియింట నొకనాఁడు తమయిరువురు

బిడ్డలం గౌఁగిలించుకొని పెనిమిటికడ నేడ్చుచున్న విప్రాంగనను జూచి కుంతి, నీవంతకుఁ గతం బే మని యడిగెను. అమ్మాట కా బ్రాహ్మణి "అమ్మా! యీనగరపరిసరమున యమునానదియొడ్డున దారుణుఁడైన బకుఁ డను మొఱకురక్కసి యొక్కం డున్నాఁడు. వాఁడు ప్రతిదినమును నిండ్లమీఁదఁబడి యనేకులను బట్టి చంపితి నుచుండఁగాఁ బౌరులందఱును గూడి, యిట్లు మమ్ముబాధింపకుము, నిత్యము నిలువరుసను నీ కొక్కని బంపుచుందు మని సమయము చేసిరి. ఈప్రకారము బ్రాహ్మణులనుండియుఁ రాక్షసుఁడు భుజాబలమున వేతనము సంపాదించుకొనుచున్నవాఁడు. ఇన్నాళ్ళకు మాకు వంతు వచ్చినది. ఈభాగధేయమునకు వంశాంకుర మగు పుత్రుని బంపుదునా? పరలోకఋణముం దీర్చు కూఁతుం బంపుదునా! భర్తయే పోయిన సంసార మెట్లు నడచును. నన్నుఁబంపుటకు నాపతి యొప్పకున్నాఁడు. పరు నెవ్వనినైనఁగొని పంపుటకు నాయొద్ద ధనములేదు. ధనమునకు బ్రాణముం గోల్పోవు వాఁ డెవ్వఁడు. ఇందుకని యేమియుఁ దోఁపక చేతనైనపనిగదా యని పనవుచున్నదాన" ననినఁ గుంతీదేవి యిట్లనియె. "అమ్మా నాపుత్రులలో నొకని నిచ్చెదను. అతఁడు మిగుల బలశాలి. వానిం బలిగా నంపుము. వాఁడు మంత్రవేత్త. రాక్షసులం జంపఁగలండు" అనిన నావాక్యములకు విప్రదంపతులు సంతోషపడిరి. తల్లిశాసనముపై భీముండును సిద్ధపడియెను. పాండవులు హర్షముం జెందిరి. పౌరులు విస్మయము నొందిరి. బ్రాహ్మణు

లు భీమునికి భోజనము పెట్టిరి. రక్తగంధము, రక్తమాల్యములు, రక్తవసనములుం దాల్చి బల్యన్నముతో నిండిన బండిని దోలుకొని కుంతీసుతమధ్యముఁడు పురంబు వెలుపలికి వచ్చి. రాబందులు, జంబుకములుఁ, గాకులు మొదలగునవి చుట్టుకొనినదియు, మనుష్యకపాలాస్థులతోఁ గూడినదియుఁ, గేచురాళ్లు రొదచేయుచున్నదియు, దుర్గంధము వలచునదియు నగుమాంసభోజనుని యుషవిని సమీపించి, యీరాక్షసుని జంపినపిదప శవస్పర్శ చేసిన నేను బండిలోనున్న యన్నము తినుట తగదని ముందే నిర్భయముగ భుజింప మొదలుపెట్టును. అట్లు చక్కఁగా మెక్కుచుఁ దనకడను రాఁగియే గాక యట్టహాసముచేయువాని నసుర చూచి దంతములు గొఱికికొనుచు వచ్చి భీముని పక్కలోఁ బిడికిళ్ళతోఁ బొడిచెను. వానిపోటులను లక్ష్యముచేయకయే యూతఁడు మరలమరల మిగిలినపదార్థములను దినఁజొచ్చెను. ఏనుఁగుమాంసముం దినుచున్న సింహము నక్కకూఁతలకు బెదరునా. ఓరి ! నాకొఱకై తెచ్చిన యన్నమును నీవే తినుచున్నాఁడవా, బ్రహ్మచారీ, ఆయన్నము తినిన నిన్నొక్కమాఱు మ్రింగితినా నిన్ను వేఱుగా నన్నమును వేఱుగాఁ దినవలసిన శ్రమ కొంతనాకుఁ దలగును. నీవెందుఁ బోఁగలవు. అనిన బకునిమాటలు వినియు మాటలాడక భుజియించి చేతులు కడిగికొని కడుపు తడవికొనుచు "నోరి నృశంసుఁడా, మనుష్యవధ గావించి మంచి యశస్సును సంపాదించితివి. నీకు శక్తియున్న

లికను దాల్చినకృష్ణను గాంచి పాండవు లొక్కమాటుగాఁ బం
చబాణవిద్ధు లయిరి. అంతట ధృష్టద్యుమ్నుఁడు వచ్చి రంగమ
ధ్యమున నిలిచి యొక్క గట్టిధనుస్సును, దృఢసాయకములును,
గగనమునఁ జలించుచున్న లక్ష్యముం జూపి 'రాజముఖ్యులార!
ఈధనుస్సు నెక్కువెట్టి యీబాణములతో నాకాశమున వ్రే
లాడు శరవ్యమును నిపుణులయి యెవ్వరు పడఁగొట్టుదురో
వారు నాచెల్లెలిని బెండ్లియాడఁ గల'రని చెప్పెను.

అనంతరము ధృష్టద్యుమ్నుఁడు తన సోదరిని రాజమంచల
మధ్యమునకుఁ దీసికొనివచ్చి యామెకు రాజులం జూపి వీరు వీ
రని చెప్పఁదొడఁగెను. 'ఇతఁడు దుర్యోధనుఁడు. ఈతని యైశ్వ
ర్యముం గాంచి కుబేరుఁడు లజ్జించి యుత్తరదిక్కున నెక్కడనో
వాసము చేయుచున్నాఁడు. ఈరాజతమ్ములు దుశ్శాసనాదులు
రత్నఖచితశిరస్కులై శేషుని నాగకుమారులువలెఁ బరివేష్టించి
యున్నారు. ఈతండు గాంధారరాజు శకుని. వీని కక్షవిద్యయం
దుఁ బాండిత్యము మెం డని చెప్పుదురు. ఇతం డశ్వత్థామ. ఈ
గురుపుత్రుఁడు సాక్షాత్పినాకియే. ఇతఁడు కర్ణుఁడు. సహజకవచ
కుండలధారి. జీమూతవాహన శిబి దధీచులవిమ్మట దానమున
నీతఁ డధికుఁడు. ఈతఁడు బలరాముఁడు. కైలాసమువలె శ్వేత
శరీరుఁడు. నీలాంబరమును నాఁగలియు ధరించినవాఁడు. యము
నానదిని నీబలశాలి రెండుగాఁ జీల్చినాఁడు. ఈతండు నారాయ
ణుఁడు. యదువంశమున నుద్భవించెను. ఇతఁడు కల్పవృక్షము

ను హరించినంతట శచీముఖము నందనవనమువలె విచ్ఛాయ మును బొందెను. వీరు సాత్యకిప్రభృతి వృష్ణ్యంధక భోజ కుమారు లు. వీరివలననే యీకృష్ణుఁడు నక్షత్రగణమధ్యమునఁ జంద్రుని వలెఁ బ్రకాశించుచున్నాఁడు. ఈరాజు జరాసంధుఁడు. పదునె నిమిదిసారులు కృష్ణుఁ డీతని కోడె నని పరాఙ్ముఖ యయినదో, శూరగుణానురక్త యోగాని లక్ష్మియెల్లపుడు నీతనియొద్దనే యుం డును. ఈనృపాలుఁడు ప్రాగ్జ్యోతిషాధిపతి. సుప్రతీక మనుగజ మీతనివాహనము. ఈశిశుపాలుఁడు చేదిపతి. శౌరి నీబల శాలి తృణమువలె గణించును. మద్రరా జీతఁడు శల్యుఁడు. వీనిబాహుబలమువలననే మద్రదేశీయులు నిస్తంద్రులై సుఖిం చుచున్నారు. ఈనీలుఁడు మాహిష్మతీపురనాయకుఁడు. వీని మహిమవలననే యుద్ధములలోఁ గేవలము నగ్ని దేవుఁడు వచ్చి యీతనికి బాసట యగుచుండును. ఈ వీరందఱు నీస్వయంవర మునకు వచ్చియున్నవారు. ఈలక్ష్యము నెవ్వరు కొట్టెదరో వా రిని వరింపు" మని వివరించెను.

తదనంతరము రాజులొక్కొక్కరు లేచి యీకన్య నాకే దక్కు, నీయంత్రము నేనే కొట్టెద నని యహంపూర్వకము గా ధనుస్సుకడకు వచ్చుచుండిరి. ధనురారోపణమునకై య త్నించు యదువీరులను గృష్ణుండు వారించి బ్రాహ్మణమధ్యమున నున్న పాండవులను బలరామునకుఁ జూపించెను. రంగస్థలములో నున్న బాణాసనముకడకుఁ గొందఱు రాలేకయే పోయిరి. వచ్చి

యుఁ గొందఱు పట్టలేకపోయిరి. పట్టియుఁ గొంద ఱెత్త లేకపోయిరి. ఎత్తియుఁ బలువు రెక్కువెట్టలేకపోయిరి. ఎక్కువెట్టఁగలిగిన వారిలో నీలుఁడు మినుపగింజంత తక్కువగ, శల్యుఁడు పెసరగింజయంతలోపముగ, మగధరా జావగింజమాత్రము కొఱఁతగఁ గర్ణుఁడు వెండ్రుకవాసి వెలితిగను, గుణము నాకర్షించి విడిచిరి. ఇట్లు దుర్యోధనాదులెల్ల వారు యత్నించి విఫలమనోరథులైన పిమ్మట బ్రాహ్మణబృందములోనుండి గజహస్తమువంటి హస్తములు గల యర్జునుఁడు లేచి వచ్చెను. ధనుస్సుదరికి వచ్చి, చూచి, పట్టి, యెత్తి, యెక్కిడి, బాణము సంధించి, లక్ష్యముం ద్రుంచి, యితరరాజుల యాశలతోపాటు దానిని నేలఁ బడఁ గొట్టెను. అపు డతనిమీఁదఁ బుష్పవర్షము కురిసెను. రెండవ మన్మథునివలె నున్న యతనిపైఁ గృష్ణ పద్మపుంజనిభము లగు కటాక్షవీక్షణములం బ్రసరింపఁజేసి కల్హారమాలఁ గంఠమునఁ బెట్టెను. దానిచే నాపాండవుఁడు గైరికనిర్ఝరము వెడలు నంజనాద్రివలె నొప్పెను. తర్వాతఁ దక్కినరాజులను లక్ష్యము చేయకుండఁ గన్యను శుల్కచాపమును గ్రహించి యతఁడు రంగమునుండి వెడలెను. ఈమూఢుఁడు ద్రుపదుఁడు రాజుల నవమానించి బ్రాహ్మణున కిచ్చినాఁడు. వాఁడు రాజపుత్రిం గొని పోవుచున్నాఁ డని సహింపక వానిని గొంద ఱదిరించిరి. వృక్షపాణియైనభీముఁడు సాయముగ నర్జునుఁడు వారి కెదురు దిరిగెను. మాదండములతోఁ గమండలువులతో నీరాజలోక

మును సంహరించెద మని లేచినవిప్రులను జిష్ణునవ్వుతో నతఁడు వారించెను. కర్ణునితో నర్జునుఁడును శల్యునితో భీముఁడును బోరిరి. వారిని వారివారిపక్షములవారు శ్లాఘించుచుఁ జూచుచుండిరి. విప్రజాతి యని కర్ణుఁడు తీక్ష్ణబాణములను విడువక యర్జునుసిచేఁ దీక్ష్ణబాణవిద్ధుఁడై బ్రాహ్మణతేజమును మనము వారింపలేమని మరలి పోయెను. భీముఁడు బాహుయుద్ధమునఁ బడఁగొట్టియు శల్యుని మేనమామ యని విడిచెను. వీరు లగు వీ రిరువురు వెన్నిచ్చిన పిమ్మటఁ గృష్ణవాక్యములచేత రాజులు కోపమును విస్మయమును లజ్జయు భయమునుం బెనఁగొన నిజపురములకుం జనిరి. పాండవులు కృష్ణాసహితులై కులాలగృహమునకు వచ్చి యింటిలోన నున్నతల్లితో "నమ్మా! మే మొకభిక్ష తెచ్చితి" మని చెప్పిరి. "నాయనలార! రసప్రౌఢిమను మీరు పంచుకొని భుజింపుఁ"డని లోన నుండియే పలికి వెలుపలికి వచ్చి కన్నియం జూచి లజ్జావతియు ధర్మభీతయు నై నిలిచెను. అపుడు ధర్మజుఁడు తల్లితో, నీవచనము వృథ కాదు. ఈకన్యయందు మాయందఱ డెందంబులు నార్ద్రములైనయవి" యనియెను. ద్రుపదుఁడు వీరు క్షత్రియు లని బాణధారణాదులచేఁ దెలిసికొని పురోహితు నంపి రాజగృహమునకు రావించెను. మీ రెవ్వ రెక్కడనుండి వచ్చితి రని యడుగఁగా ద్రుపదునకు మృత్యుముఖమువంటి లక్కయింటిలోనుండి తప్పించుకొని వచ్చిన పాండుసూనుల మని ధర్మజుఁడు చెప్పెను. సంతోషించిన యారాజు తనబాహుబలంబునం

బడసిన యీకన్యక నర్జునుఁడు సుముహూర్తమునఁ బాణిగ్రహణము చేయుఁగాక యని కోరెను. మే మేవురము నీకన్యను బెండ్లి చేసికొందుము. అందఱము సమముగాఁ బంచుకొని యనుభవించుటకు మాలో సమయము జరిగినది, యనిన వారిపల్కులకు, పల్వు రొక్కతెకు భర్తలగుట యెట్లని సందేహించు ద్రుపదునికడకు వ్యాసుఁడు వచ్చి రహస్యముగా నాకన్యకకుఁ బంచపతిత్వకారణమును స్పష్టముగా నెఱిఁగించుటకై యిట్లనియె.

ఈకృష్ణ తొల్లి నాలాయని యను పతివ్రత. అతికోపనుఁడు వృద్ధుఁడుఁ గుష్ఠరోగియు నగుమౌద్గల్యునికి భార్యయై యతని నారాధించుచుండెను. అతఁడు చిరకాలమున కీమెను బరీక్షించుటకై ప్రసన్నుఁడై చిత్తమెఱింగి తానే యైదువిధములై క్రీడించుచుండెను. రెండవజన్మమునం దింద్రసేనయై వానితోన యిన్నారిభోగంబు లనుభవించెను. ఆముని మఱియు భోగేచ్ఛ విడువని యింద్రసేనతోఁ, దపోవిఘ్నభయమున “నీవు తపస్సు చేయుము, నీనియమములకు గిరీశుఁడు ప్రసన్నుఁడై వరము లిచ్చు” నని చెప్పి పోయెను. తపం బొనర్చు నామెకడకు వచ్చి యీశ్వరుఁడు “చాలును, నీకఠోరతపంబునకు మెచ్చితిని, మఱియొక జన్మమున నీవు పంచపతులం బొందెదవు. ఓకల్యాణి! దుఃఖమును విడువుము. గంగానదీతటమునకుఁ బోయి తత్కాలమున నక్కడ నున్న యొకపురుషుని నాయొద్దికిఁ గొనిరమ్ము.” అని చెప్పి యంతర్ధానము చెందెను. గంగ కేఁగి కన్నీరెల్లఁ బద్మము లగుచుండ

స్నానముచేయుచుండఁగా యదృచ్ఛగా నింద్రుఁ డక్కడకు వచ్చి యెవ్వతెవు, నీవేల యేడ్చె దని యడిగెను. కారణము చెప్పెద ను గాని నాతో రమ్మని శంకరునికడకుఁ బిల్చుకొని పోయినది. కాంతాయుతుండై కైలాసమున జూదమాడుచున్న యొకయువ కుని గాంచి యింద్రుఁడు "నే నింద్రుఁడను నన్నవమానించి స్త్రీ లోలుఁడవై యక్షక్రీడ గావించుచున్నాఁడవా" యని యఱచె ను. దేవియుం దేవరయు నొండొకళ్లం గనుంగొని చిఱునగవున నాడుకొనుచుండఁగనే యింద్రుఁడు స్తంభించుకొనిపోయెను. చే తిలోని వజ్రము జాఱిపడియెను. ఆట చాలించి దేవుఁడు గుహా ద్వారముం దెఱచినఁ దనవంటివారె నలుగురనింద్రుల నాయిం ద్రుఁడు చూచిన పిమ్మటఁ గ్రుద్ధుఁడై శివుఁడు, నీవు నీప్రల్లదము నకు ఫల మనుభవింపుము. పదచ్యుతులయిన యీయేవురతోఁ గూడి——అని శపింపఁబోఁగా వడఁకుచు నింద్రుఁడు, "నీదాసుఁడ ను, నాయపరాధమును క్షమియింపుము, కోపముం గొన్నదాని కీశిక్ష చాలును," అని ప్రార్థించెను. క్షమించితి నీ విక్కడనుండి వీరిసాయమున భూలోకమున కేగి క్రమముగా, ధర్మ పవ నేం ద్రాశ్వినులభాగములం బూని యీామెకుఁ బతి వగుము." అని ప్రభువు సెలవిచ్చెను, గాన, నీవు వీరిని వారినిగానే తలంపుము. ఆస్త్రీయే యీకృష్ణ యని యెంచుకొనుము. అని తిరోధానము నొందిన వ్యాసమహాముని వాక్యములపై విస్మయానందములతో ద్రుపదుఁడు వెనుకటి శివునివాక్యమును బాండవులమోహామును

దెలిసికొని యైదుగురకు వివాహము చేయుటకు సమ్మతించెను. మఱునాఁడు పాండవులు పెండ్లికొడుకుల వేషములతో వివాహ మండపమునకు వచ్చిరి. ధౌమ్యాదిపురోహితులు వివాహవస్తువులను సంగ్రహించిన పిదప ద్రుపదుఁడు ధర్మజుని చేయిపట్టుకొని పై దూర్యసోపానయుత మగువేదికపై నెక్కించెను. పుణ్యస్త్రీలు ద్రౌపది నలంకరించి తీసికొని వచ్చి బంగారుపీఠముమీఁద వరుని ప్రక్కను గూర్చుండఁబెట్టిరి. అనంతరము ధూమ్రాపేత మగువగ్నికి వధూసమేతుఁడై ధర్మసూనుఁడు ప్రదక్షిణముచేసిన నది భృంగ పరివృతమైన రక్తపద్మమును వధూసహిత యగు హంస వలగొన్నట్లుండెను. గురువు చెప్పినట్లు కృష్ణలాజహోమము కృశాను జ్వాలలలోఁ గావించెను. అది వాయువేగమున సముద్రమునం దలి యలలు ముత్తెములను బ్రవాళజాలములోఁ బడవేసినట్లుండెను. అవ్వల శతుప్రసీమంతినీసీమంతకుంకుమాంక యోగ్యమైన వధువు పాదమును వరుఁడు పట్టుకొని సన్నెకల్లు మెట్టించెను. ఈప్రకారము తక్కిన నలువురుపాండవులచేత ఘుర్మోద కార్ద్రకరమును బట్టించిరి. అది పుష్కరచారువైన కరిణీహస్తమును యూథపగజములు పట్టుకొన్న ట్లొప్పెను. మంగళాచారములు నిర్వర్తింపఁ బడినపిమ్మట మామ యల్లుండ్రకు ధనము, రథములు, గజములుఁ, దురంగములును, వేలకొలఁది యరణ మొసంగెను.

---

# *శకుంతలయత్తవారింటికేగుట.



" బిడ్డా! శకుంతల ! పూఁటపూఁటను నే నిక్కడ నీయా సన్నసరోవరమునందలి సంతతమరందసిక్తములైన సరసీరుహములను గనుఁగొనుచుఁ గన్నీటితోఁ గళంకితమైయున్న యీ నీ ముఖసరసీరుహము స్మరణమునకుఁ వచ్చుచుండఁగా నెన్నఁటికి మఱచిపోఁ గలుగుదును ? నే నింక మనపర్ణశాలికా ప్రాంతమున నీవు పెంపఁగాఁ బరువొందిన మాలతీలతాక్రాంత మనోహరమగు నీసహకారభూరుహమును గనుఁగొని " మాశకుంతలయు దుష్యంతుఁడు నన్యోన్యము నిట్లే సంగడి నుందురుగదా

---

* ఈ కథాంశము ప్రసిద్ధికెక్కిన రామకృష్ణకవుల గ్రంథములలో నొకటగు 'శకుంతల'నుండి గ్రహింపబడెను. కథ కణ్వమహర్షి శకుంతల నత్తవారింటికి బంపుట.

రామకృష్ణకవులు ఈయిరువదవశతాబ్దమునఁ దమయుభయకవితాధారచే నాంధ్రావనిలోఁ బ్రసిద్ధినొంది యున్నారు. శతావధానులు ఆంధ్రభోజఖ్యాతినందిన శ్రీపిఠాపురపు మహారాజావారిమన్ననలకుఁ బాత్రులై వారియాస్థానకవులుగానుండి కీర్తిశేషులై యున్నారు వారిగ్రంథములలోఁ ఆంధ్రీకృత విశ్వగుణాదర్శము, కథాసరిత్సాగరము, మొదలగు పద్యగ్రంథములును, దమయంతి, శకుంతల, మొదలగు గద్యగ్రంథములును మిగులఁ బ్రసిద్ధినొందియున్నవి.

యని సంతసింపవలసి యుండును. పోనిమ్ము; దానివలననైనఁ గొంతసుఖము నాకు జేకూరఁగలదు. ” అని యిట్లు పలుకుచుఁ బ్రేమాతిశయమున నచ్చటి తరులతా వితానంబు నవలోకించి “ఓ భూరుహములారా! పుష్పలతికలారా! మాయీ శకుంతల మీయందలి నెమ్మిచేఁ దన యలపు నేమియు గణింపక ప్రతిదినమును మీయాలవాలముల నిండ నీరువోసియు, మీరు క్రమవృద్ధినొందు మార్గము లరసివచ్చి పూఁటపూఁటకు మిమ్ము లను మిగులఁ బ్రోదిచేసియు మీయందలి ప్రేమాతిరేకముచేఁ బ్రియమండనమున కేనియు నొక్క చిగురాకునైనఁ గొనగోటితోఁ జిదుమవెఱచియుఁ గ్రమముగా మీకు నూతనప్రసవోద్గమమైనప్పు డెల్లఁ దానును దనసఖీజనము నెంతయు సంతసముతో మహోత్సవము లాచరించియు నెల్లవిధముల మీకుఁ దల్లియై యింతకాలమును మిమ్ము మిగులఁ గూరిమితోఁ బెంచినది. అట్టి యాశకుంతల యిప్పుడు తనయత్తవారింటి కరుగుచున్నది. మీ రందఱు నామె కల్యాణయాత్ర ననుమతింతురుగాత. ఇన్ని నాళ్లు నీమె మీకుఁ దోడునీడయుఁబోలె మీలోఁ బెరిగినది; పెద్దయైనది. ఇంక నీమెను బురుషునింటి కనుపక పుట్టినింట నుంచుకొనరాదుగదా?” యని చెప్పుచు నాకణ్వమహాముని యున్ను రని యూర్చి యెట్టకేలకు ధైర్యమును బట్టుకొని యాశకుంతలను దనయగ్నిహోత్రగృహమునకుఁ దోడుకొనిపోయి యందలి వీతిహోత్రములకు సాష్టాంగ దండప్రణామంబులు సేయుం

చి మునులకు నమస్కారములు వెట్టించి పుణ్యతపస్వినీజనంబులకు మ్రొక్కించి తదీయాశీర్వాదములతోఁ దానును దీవించి శకుంతల కరుగుట కనుజ్ఞ యొసఁగెను.

అంతట నాశకుంతలయుఁ దండ్రిపాదములకుఁ బ్రణామమాచరించి యతని నెడఁబాయుచుండుటచేఁ బొడమెడు సంతాపాశ్రుజలమును, భర్తృగృహమున కేగుచుండుటచే నుదయించెడు సంతోషాశ్రుజలమును గలసి గోయవెచ్చనై పయ్యెదపై జాఱుచుండ నెడపఁ దడప నిజచేలాంచలముచేఁ దుడిచికొనుచుఁ దనజనకుని యనుష్ఠానవేదికను దర్శించి వచ్చియుఁ గ్రమ్మఱ దర్శింపఁ బోవుచుఁ, దాము నిత్యమును స్నానముచేయుచుండు జలజాకరము నరసి వచ్చియు మరల నరయఁ బోవుచుఁ, దాను స్వహస్తములతోఁ బోషించిన తరువల్లికలను వీక్షించి వచ్చియు వెండియు వీక్షింపఁ బోవుచు, నాతపోవనమునందలి కుంజకోటరకుటీక్రోడవీథుల నెల్లఁ దిలకించి వచ్చియుఁ దిరుగఁ దిలకింపఁ బోవుచు నెట్లు విడువలేక విడువలేక తుద కెట్లో మూఁడునాలు గడుగులు నడచి మరల వెనుకకుఁ దిరిగి వచ్చి తండ్రిపాదములను దన తలయందు సంఘటించుకొని మరలఁ గొంత దవ్వేగి వెనుకకు వచ్చి తనతల నాకణ్వమహర్షి కడుపునఁ జేర్చి కౌఁగిలించుకొని వెండియు నొకకొంతదూర మరిగి తిరిగి వచ్చియచ్చటి మునులతో "మాయయ్య యుఁడునుజుఁడీ!" యని చెప్పి యప్పగించి మఱియుఁ గొంతదవ్వు గమనించి పెడమరలి కాశ్య

పునిదెసఁ గనుఁగొని " నాయనా ! నేను బోవుచున్నా " నని చెప్పి కన్నుల నీరు నించికొని యామహాత్ముఁడు తన్నుపలాల నముసేయ, నచ్చటి ఋషిపత్నులు తన్నదలించి మందలింప, ననసూయ చేయి పట్టుకొని " రమ్మ ర " మ్మని తిగువ నిగుడుచు మగిడి మగిడి కనుఁగొనుచు నెట్టకేల కొకవిధముగా నడువసాగెను. ఇట్లు నలువంకల మునికాంతలు తనవెంటఁ జనుదెంచుచుండ నాశకుంతల నిర్మలోర్మిసంగతయైన యనిమిషనది రత్నాకరమున కరుగునట్లు తాను తనభర్తయైన దుష్యంతునికడ కరిగెను.

# * దేవరాతుఁడు



ఇక్ష్వాకువంశమున 'వేధసుఁ' డనురాజు కలఁడు. పౌరాణికు లాతనిని త్రిశంకుఁ డందురు. ఆతనికి హరిశ్చంద్రుఁడను పుత్రుఁడు పుట్టెను. ఆహరిశ్చంద్రునకు నూర్వురు భార్య లుండినను బహుకాలమువఱకు పుత్రసంతతి లేనందున నారాజు చింతించుచుండెను.

ఇట్లుండ నాహరిశ్చంద్రుని గృహమున కొకప్పుడు 'పర్వతుఁడు, నారదుఁడు' నను మహర్షు 'లతిథులు' గా రాఁగా, హరిశ్చంద్రుఁ డామునుల కాతిథ్య మిచ్చి గౌరవించి, నారదునితోఁ బుత్రోత్పత్తి ప్రశంసం జేయ నాముని పుత్రోత్పత్తి వలనఁ గల్గు లాభములను జెప్పెను. హరిశ్చంద్రుఁడు తన కెట్లు పుత్రోత్పత్తి యగునో చెప్పు మనెను. అందులకు నారదుఁడు, ఓరాజా! నీవు 'వరుణ' దేవుని, నాకుఁ బుత్రు నొసఁగిన నేనాపుత్రుని బశువుగాఁ జేసి నిన్నుఁగూర్చి యజ్ఞముఁ జేయుదు నని ప్రార్థింపుము. అట్లు చేసితివేని నీకు వరుణుఁడు పుత్రు నొసంగు ననియెను.

పిమ్మట హరిశ్చంద్రుఁడు వరుణుఁ గూర్చి నాకొక పు

---

* ఈకథ ఐతరేయబ్రాహ్మణమునుండి యాంధ్రీకరింపఁబడెను.

త్రు నొసంగిన నే నాపుత్రుని బశువుగాఁ జేసి, యజ్ఞముఁ జేయుదు నని ప్రార్థింప వరుణుఁడు ప్రత్యక్షమై పుత్రుఁడు కలుగ వర మిచ్చెను.

పిమ్మట హరిశ్చంద్రునకు 'రోహితుఁ'డను పుత్రు డుద్భవింప వరుణుఁడు వచ్చి, యీ బాలునిచే నాకు యజ్ఞముఁ జేయు'మన హరిశ్చంద్రుఁడు పుత్రప్రేమచే బిడ్డను వదలలేక 'జాతాశౌచదినములు వెళ్ళినఁ గాని బాలపశువునకు యజ్ఞార్హత లే' దనఁగా వరుణుఁడు వల్లె యని వెడలిపోయెను.

జాతాశౌచదినములు వెళ్ళినపిమ్మట వరుణుఁ డేతెంచి నీవు చెప్పిన గడువు ముగిసినది గాన వీనిచే నాకై యజ్ఞము నొనర్పు మనఁగా హరిశ్చంద్రుఁడు 'పశువునకు దంతములు వచ్చినఁ గాని మేధ్యముకా'దనఁగా వరుణుఁ డంగీకరించి వెళ్ళిపోయెను.

పిమ్మట రోహితునకు దంతములు రాఁగా వరుణుఁడు ప్రత్యక్షమై బాలునకు దంతములు వచ్చినవి గాన వీనిని యాగ పశువుం జేసి యజనము నొనర్పు మనెను. "ఈబాలున కిపుడు వచ్చిన దంతములు స్థిరములైనవి కావు, గాన నివి యూడినఁ గాని యాగార్హుఁడై యీబిడ్డఁ డుండ" డని హరిశ్చంద్రుఁ డన 'తథాస్తు' అని వరుణుఁడు తిరోహితుఁ డయ్యెను.

తరువాత పాలపం డ్లూడఁగా వరుణుఁ డెప్పటియట్ల వచ్చి పల్లూడినవి గాన, వీనిచే జన్నము నొనర్పు మనఁగా "రెండవ

సారి దంతములు రానిదే పశువు సర్వావయవసంపూర్ణత నొందదౕ దని హరిశ్చంద్రుఁ డన వరుణుఁ డంగీకరించెను. రెండవసారి దంతములు రాఁగా, వరుణుఁ డెప్పటివలె వచ్చి యవయవ సంపూర్ణత కలిగెను గాన నీకుమారునిచే, ఇష్టిని జేయు మనెను. "పశువు కాఁగల క్షత్రియుఁడు సన్నాహశీలుఁ డగు వరకు సన్నాహ శీలి కాకుండిన యజ్ఞమునందు వినియోగింప నర్హుఁడు కాఁడు" అని హరిశ్చంద్రుఁ డనఁ బూర్వమువలెనె వరుణుఁ డంగీకరించి యంతర్ధానుఁ డయ్యెను.

పిమ్మట 'రోహితుఁడు' యుద్ధశాస్త్రమును నేర్చి కవచ ధనుర్బాణాదులను ధరించుచుండ వరుణుఁ డేతెంచి, సన్నాహశీలి గాన నీకుమారునిచే సవనం బొనర్పు మనెను. దానికి హరిశ్చం ద్రుఁ డట్లే చేయుదు నని యంగీకరించి రోహితుని బిలిచి యిట్లు చెప్పెను. "నాయనా! నాకొఱకు నిన్ని వరుణుఁ డిచ్చెను. అయ్యో! నిన్ను బశువుగాఁ జేసి నే నీవరుణుని గూర్చి యజ్ఞ ముం జేయుచున్నా" నన, నారోహితుఁ డంగీకరింపక, ధనుర్ధరుఁడై యరణ్యమునకుఁ బరుగిడి యట నుండెను.

హరిశ్చంద్రుఁ డనినరీతిని యజ్ఞమును జేయనందున వరుణుఁడు హరిశ్చంద్రుని బట్టుకొనఁగా, హరిశ్చంద్రునకు 'జలోదర' రోగము కలిగి, బాధపడుచుండెను.

## —• రోహితుని ప్రవర్తనము. •—

తండ్రికి జలోదరరోగము కలిగె నని యరణ్యమం దొక సంవత్సరము నివసించిన తరువాత 'రోహితునకు' దెలిసి యా తఁడు తిరిగి పురమునకు వచ్చుచుండగా 'ఇంద్రుఁడు' బ్రాహ్మ ణవేషధారియై మార్గమధ్యమున నొక సాకు చెప్పి రోహితుని మరల వనమునఁ దిరుగునట్లు చేసెను. ఇట్లొకపర్యాయము కా దు—అయిదుపర్యాయము లింద్రుఁ డి ట్లేవియో సాకులు చెప్పి రోహితుని వెనుక కరణ్యమునకుఁ బంపుచుండుట చే రోహితుఁ డరణ్యమున నారేం డ్లుండవలసివచ్చెను.

ఎట్లయినను హారిశ్చంద్రుఁడు మనుష్యపశువుచే యజ్ఞ మూఁ జేయనియెడల నాతనికి రోగనివృత్తి కాదని, రోహితుఁడు తలఁచి తనకు మారుగా నొకనిని హారిశ్చంద్రుని యాగముకై యరణ్యమున వెదుకుచుండగా, నాఁడుడవియం దొక పర్వతపు చరియలో దరిద్రముచే భుక్తికి లేక బాధ నొందుచున్న 'సూ యవసుని' పుత్రుఁ డగు 'అజీగర్తుఁడు' అనునొక బ్రాహ్మణుని జూచెను. అయ్యజీగర్తునకుఁ 'శునఃపుచ్ఛుఁడు, శునశ్శేఫుఁడు, శునఃలాంగూలుఁడు' నను ముగ్వురు కుమారులు కలరు. అట్టి యాబీదబాపని జూచి, రోహితుఁడు "ఓఋషీ! నీకుమారుల లో నొకనిని నాకిమ్ము, నీకు నూఱుగోవుల నిచ్చెదను. నాకుఁ బ్రతినిధిగా వానిని జేకొని యజ్ఞము చేయింతు" ననెను. దానికి

నజీగర్తుఁ డంగీకరించెను. కాని, పెద్దవాఁడు నాకెంతయుఁ బ్రియతనూజుఁడు గాన నతని నీకు నీఁ జాల ననియెను; పిన్నవాఁడు నాకెంతయుఁ బ్రియుఁడు గాన యాకుమారుని నీఁ జాల నని తల్లి చెప్పెను. తల్లిదండ్రుల మాటలను విని మధ్యముఁ డగు శునశ్శేపుఁ డీట్లనియెను.

'ఓరాజా! పెద్దవాఁడు తండ్రికిఁ జాలఁ బ్రియసుతుం డయ్యె; పిన్నవాఁడు తల్లికి ముద్దు బిడ్డఁ డయ్యె. వార లిరువురు నొల్లనివాఁడ నైన మధ్యముఁడను గాన నూఱుగోవులను వీని కిమ్ము, నీవెనుకనే వచ్చెద' ననిన రోహితుఁడు నూఱుగోవుల నజీగర్తున కిచ్చి శునశ్శేపుని వెంట నిడుకొని, పురప్రవేశంబు చేసి హరిశ్చంద్రునితో, 'తండ్రి! నాకు మారుగ వీనిని యజ్ఞపశువుగాఁ దెచ్చితి' ననెను,

అందులకు హరిశ్చంద్రుఁడు సంతసించి, వరుణునితో నీ 'శునశ్శేపుని' బశువుగాఁ జేసి నీకు యజ్ఞము నొనర్తు నన, వరుణుఁడు, క్షత్రియునికంటె బ్రాహ్మణుఁడె శ్రేష్ఠుఁడుగదా! వీనిం బశువుగాఁ జేసి 'రాజసూయ' యాగముం జేయు మని చెప్పగా, హరిశ్చంద్రుఁడు రాజసూయములోని సోమయాగాంగ మగు నొకకర్మమునందు శునశ్శేపునిఁ బశువుగా నేర్పఱచెను. ఆయజ్ఞమున హరిశ్చంద్రునకు విశ్వామిత్రుఁడు హోత, జమదగ్ని అధ్వర్యుఁడు, వసిష్ఠుఁడు బ్రహ్మ, ఆయాస్యుఁడు ఉద్గాత యను ఋత్విక్కు లైరి.

పై నల్వురు మహర్షులు రాజసూయముఁ జేయింపు చుండఁగా 'మనుష్యపశువును' బంధింపుసమయ మాసన్నమై నది. విశసింపఁబడు పశువునకుఁ గొన్ని సంస్కారణములఁ జేసిన పిదప రెండుపేటలు వేయఁబడి రెండుబారల పొడవుగల రెండు కుశనిర్మితములగు త్రాళ్లతో కాళ్లను తలను గట్టిగా బంధించి, మూఁడుపేటలు గలిగి మూఁడుబారలు పొడవు గలత్రాఁటిచే మధ్యభాగమును యూపస్తంభమున కంటఁగట్టవలయునను విధి కలదు. ఇపుడు విశసింపఁబడు పశువో! సాధారణపశువా? కాదు! యువకుఁడు_మహర్షిగోత్రోత్పన్నుఁడు_ మహాకవి_ వేదవేది — బ్రహ్మవర్చస్వి— మహాభక్తుఁడు; అట్టివానిని, బైవిధమున బంధింప నెవనికి చేతులు వచ్చును? ఎవఁడును బంధింప నంగీకరింపలేదు గాని, నూఱుగోవులకుఁ బుత్రు నమ్మిన శునశ్శేపుని తండ్రియగు 'అజీగర్తుఁడే' నా కింకను నూఱుగోవుల నిచ్చినయెడల నేను శునశ్శేపుని బంధింతు నని పలుక, హరిశ్చంద్రుఁ డట్లే నూఱుగోవుల నీయఁగా నజీగర్తుఁడు దారుహృదయముతో—కాదు. శిలాహృదయముతోఁ బుత్రుని విశసింపఁ యూపస్తంభమునకుఁ బైరీతి నంటఁగట్టెను.

అపు డధ్వర్యుఁ డేతెంచి, బంధితుఁడగు శునశ్శేపునకు వధించుటకుఁ బూర్వము చేయఁదగిన కొన్నికర్మములఁ జేసెను. పిమ్మటఁ బశువును ఖడ్గముతో విశసించుసమయ మేతేర బ్రహ్మతేజస్వియగు శునశ్శేపుని బంధించుటకే యెవఁడును సిద్ధపడకుండినపుడు

ఖడ్గముతో ఖండింప నెవం డాయత్తపడును ? ఆమహాక్రూరుం డగు నజీగర్తుండే తన కుమారుని మఱినూఱుగోవుల నిచ్చినయెడల నేను ఖండింతు నని వజ్రమయహృదయముతోం బల్కెను. నూఱుగోవులను హస్తగతముం జేసికొని యజీగర్తుండు కుమారుని వినాశింప ఖడ్గము వహించెను.

హా ! ఎంతక్రూరకర్మము ! తనగర్భమున జన్మించిన సుగుణవంతుండై, విద్యాయుక్తుండై 'సురూపుండై' పితృభక్తి దైవభక్తులు గలిగి, సుకుమారుండైన పుత్రుం జంప నెవనికి మన సొప్పును ? అజీగర్తుండు మాత్రమె ఖండింపం దలంచెను. ఇది దరిద్రదోషము. ఆకలిచేం గడుపు మాడి యుదరపోషణముకై చేయం దలంచిన మహాపాతకము ! మతద్వేషముచేం గుమారుని ఖండింప నెంచిన హిరణ్యకశిపుని చర్యయు నిట్టిదే కదా ?

శునశ్శేపుండు, శోకులతం దన్ను బాధించి, యశ్వమేధములో సింహాదిజంతువుల కొన్నిటిని కొన్ని సంస్కారములం జేసి, వానివలె మనుష్యుని గూడ నరణ్యమున విడువంగల రని యుం దా నెచటనైన విడువంబడిన నటులనే జీవింపవచ్చు నని యుం దలంచెను. కాని, రాజసూయమునం దప్పక నరుండు వినాశింపంబడవలయునను విధి యాతనికిం దెలియలేదు. కాని తండ్రి ఖడ్గముం జేంబూనంగానె యిట్లనుకొనెను.

హా ! నన్ను విడువక సాధారణపుయాగపశువువలెనే వినాశింతురా ? అయ్యో! నే నిప్పు డేవేల్పుం జింతింతును? శుభకరుం

డగు నేదేవుని బ్రార్థింతును? తిరిగి నన్నే దేవత భూమిపై నుండ నిచ్చును? నిజము గ నేను మాతల్లిని జూచు స్థితి కలుగునా? ఓవరుణా! నామొఱ్ఱ నాలకింపుము. రక్షణేచ్ఛచే నీ కెదురుగఁ జేయు నాస్తోత్రముల నాలకించి నన్ను సుఖవంతునిగాఁ జేయుము. (1) బహుజనులచే స్తుతింపఁబడు నోవరుణదేవా! సమీపము నందే మరణముగల నేను వేదవాక్కుచే నిన్ను నుతింపుచు నా కాయువు నిమ్మని కోరుచున్నాను. యజమానుఁడు గూడ (హరిశ్చంద్రుఁడు)హవిస్సులచే నిన్నాయాయువునే కోరుచున్నాఁడు. నీవు మా యిరువురకోర్కెల ననాదరముతోఁ జూడక హేళనము చేయక మా యిరువురయొక్క యాయురారోగ్యములను వృద్ధిఁ జేయుము.

శునశ్శేపుఁ డిట్లు పెక్కువిధముల వరుణాదిదేవతలను స్తోత్రము చేసిచేసి "గొప్పవారలకు నమస్కారము, పిల్లలకు వందనము, యువకుల కభివాదము, వృద్ధులకు జోహారు. ఓదేవతలారా! నాకు శక్తి గలిగి జీవించితినేని మిమ్ముల నర్చింతును! ఓపరమేశ్వరా! నిన్ను స్తోత్రము చేయుటలో లోపము గలిగింపను. రక్షింపుము; రక్షింపుము; రక్షింపుము;" అని స్తోత్రము చేయుచుండఁగా, పటుక్కుమని యాపాదమ

(1) ఈయర్థముగల మంత్ర మిపుడును బ్రాహ్మణులచే సాయంసంధ్యలో జపింపఁబడుచుండును.

స్తంభముఁ గట్టిన కట్లొక్కసారి తెగిపోఁగాఁ శునశ్శేపుఁ డెదుర నుండిన విశ్వామిత్రుని యొడిలోఁ బడి రక్షింపుము; రక్షింపు మని వేఁడెను. దయాళుఁడై విశ్వామిత్రుఁడు రక్షింతు ననెను.

శునశ్శేపుఁడు విశ్వామిత్రునంకతలముఁ జేరగనే శునశ్శేపుని తండ్రియగు నజీగర్తుఁడు విశ్వామిత్రుకడ కేఁగి నాపుత్రుని నాకిమ్మనన, విశ్వామిత్రుఁడు నీకు నే నీయను వీనిని దేవతలే నాకిచ్చిరనెను. కాదు నాకొడుకే యని యజీగర్తుఁడును, నాకొడుకే యని విశ్వామిత్రుఁడును వివాదము నొందిరి. అపుడు శునశ్శేపుఁడు నేను విశ్వామిత్రుని పుత్రుఁడనేగాని, యజీగర్తుని పుత్రుఁడను గాననెను. హరిశ్చంద్రుని రాజసూయము నెఱవేరుటెట్లను ప్రశ్న కలిగెను. ఇంతలో వరుణదేవుఁడే ప్రత్యక్షమై శునశ్శేపుని ప్రార్థనములచేఁ దనకుఁ దృప్తి కలిగెననియు, ఇఁక యజ్ఞముఁ జేయు నవసరములేకుండగ యజ్ఞఫలమును హరిశ్చంద్రున కొసఁగుచున్నాననియు నాతఁడు నీరోగి యగుననియు వరమిచ్చి వరుణుఁ డంతర్హితుఁడయ్యెను. హరిశ్చంద్రుఁ డరోగియయ్యెను.

శునశ్శేపుఁడు దేవతలకు మిత్రుఁడగుటచే 'దేవరాతుఁడు' అను నన్వర్థనామము కలవాఁడయ్యెను. విశ్వామిత్రుఁడు 'ఆంధ్ర, మధుచ్ఛందాది సంజ్ఞలతో నొప్పు తననూర్వురు పుత్రులకును 'దేవరాతుని' జ్యేష్ఠపుత్రునిగా నంగీకరించుటచే మన యాంధ్రులకు దేవరాతుఁడు దాయాదుఁడయ్యెను,

# *హృదయశల్యము.



ఇంచుమించుగ నిప్పటి కాఱువందల యేఁబది సంవత్సరములకుఁ బూర్వ మొకనాఁటి సాయంసంధ్యాసమయమున, 'ఓరుగల్లు, అంబాల' యను పట్టణములకు నడుమనుండు మహారణ్యప్రదేశమున, నొక్కపల్లకి, యోరుగల్లుముఖముగా వచ్చుచుండెను. పల్లకియందున్న యువతి ప్రాయశః పదునెనిమిది వసంతర్తువులఁజూచి యుండవచ్చును. భర్తయు నామెతోఁ గూడ నశ్వారూఢుఁడై చనుదెంచుచుండె. ప్రయాణపు బడలిక

---

* ఈకథ శ్రీయుత మాడపాటి హనుమంతరావు పంతులుగారి 'మల్లికాగుచ్ఛము' అను గ్రంథమునుండి గైకొనఁబడినది. పంతులుగారు నేఁటి హైదరాబాదు సంస్థానములోని యాంధ్రప్రముఖులలో నొకరు. వీరు బహువిధములగు చారిత్రిక సాంఘికాది విషయికములగు వ్యాసములను గ్రంథములను వ్రాసిరి. వారిగ్రంథములలో ప్రసిద్ధికెక్కిన 'చింతామణి వైద్యా' 'పండితుని క్షాత్రియుగము' అను గ్రంథమునుండి యాంధ్రీకరింపఁబడిన వ్యాసము లాంధ్రవాఙ్మయములోఁ గ్రొత్తవి. మల్లికాగుచ్ఛము చారిత్రక సాంఘిక విషయములఁ దెలిపెడి యింపైనకథానికలవి. వీరి వ్రాఁత ధారాశుద్ధిగలదై సలక్షణమైన భాషకలదిగా నుండును. హనుమంతరావుగారు, ఆంధ్రాంగ్లసంస్కృతభాషలనే కాక, ఉర్దూభాషను నేర్చి నైజాము గవర్నమెంటులో బహుకాలముద్యోగము చేసి, పిమ్మట నచటి హైకోర్టులో న్యాయవాదవృత్తి నవలంబించి యిప్పు డఱువదవపడి గడచియున్నను విశ్రాంతిం గైకొనక నచటి యాంధ్రుల యభివృద్ధికై బహువిధముల పాటుపడుచున్నారు.

వారిరువురయొక్కయు, పల్లకీబోయలయొక్కయు, ముఖములం దేకాక, గుఱ్ఱమునందు సైతము స్పష్టముగఁ గనఁబడుచుండెను. వేళ సాయంకాలమును, ప్రవేశించిన దరణ్యమును, నగుటచేత నయ్యాశ్వికుఁడు వేవేగము నడువ బోయిల కాజ్ఞాపించుచుఁ దన యశ్వమునువడిగ నడువ హెచ్చరించుచు నాసుందరికి భయము కలుగకుండునట్లు వినోదములగు ముచ్చటలఁ జెప్పుచుఁ బోవ సాగెను. బోయలంతకుమున్ను వారి కుక్షులలోఁ బ్రవేశించిన మద్యముయొక్క ప్రభావముచేత, వడివడిగ నడుగు లిడఁదొడఁ గిరి. కాని, యాశ్వికుని వాహనము బోయలనడకతోఁ దులఁ దూగలేక మెల్లఁగఁ బోవుచుండెను. అస్తమయభానుఁడు తన కరములచే నావనమునందలి వృక్షాగ్రములకు బంగరుపూఁతఁ బూయుచుఁ బూయుచుఁ దుట్టతుదకు పశ్చిమసముద్రమున నంతర్హితుండయ్యెను. వీరైనంత వేగముగ సురక్షితప్రదేశమును జేరఁదొందరపడుచుండిన యాతనికి, గుఱ్ఱముయొక్క మందగమ నము నిరుత్సాహకరముగ నుండివందున నతఁడు వెనుకఁబడి చింతించుచుఁ, బల్లకిని ముందుఁ బోనీయ నిష్టములేక, మెల్లఁగ నడువుఁడని బోయలకుఁ గేకవేసి చెప్పెను; కాని వారామాటలు వినుపించుకొనక పల్లకితోఁ బఱువిడసాగిరి. వారియోంకారనినా దవశమునఁ బల్లకిలోనున్న జవ్వనికిఁ గూడ భర్తయొక్క కేకలు వినవచ్చినవికావు. అయినను, నాయువతి భర్త వెనుకఁ జిక్కు టకు విచారించుచు, డోలాందోళితమానసయై కొంతసే పేమి

యుఁ జేయఁదోఁచక భర్త వచ్చువఱకుఁ బల్లకి నట్లే యాపియుంచఁబోయల నాజ్ఞాపించెను. కాని, యరణ్యము భయంకరమైన దనియు, తమ యేలికకెట్టిభయమును లేదనియుఁ జెప్పుచు, బోయ లెప్పటియట్లే పోవసాగిరి. కొన్ని నిముసములలోఁ బల్లకికిని యాశ్వికునకును నొకమైలు దెడమయ్యెను!

అంతరాత్రి పొడసూపెను. అది శుక్లపక్షమగుటచేఁ జంద్రకాంతి స్ఫుటముగలేక, గుడ్డివెన్నెల కాయుచుండినందున, నాప్రయాణికుల కెంతయు నిరుత్సాహముగ నుండెను. సురయొక్క మైలకము దిగినందున బోయలవడియుఁ దగ్గి వారు మెల్లమెల్లగ నడువమొదలిడిరి. అట్టితరుణమున మార్గమున కొక ప్రక్కనుండిన పొదలో నేదియో చప్పుడాసుందరి వీనులకు సోఁకఁగా నామె యనుమానముతో నటు నిటు పరికించి చూచెను. కాని యేదియుఁ గన్పట్టలేదు. తనమనమున సందడించినది యుత్త భ్రమయే యని సమాధానము చేసికొని యాయువతి ధైర్యముతో గూర్చుండిన మఱియొకనిమేషమునకు, అక్కటా! మూర్తీభవించిన యమదూతలోయన, నల్లనియాకారములును, తదనుగుణ్యములగు వస్త్రములును గలిగిన జనులగుంపొకటి, యాపొద నుండి సాయుధముగ బఱువిడి వచ్చి, "నిలుఁడు; నిలుఁ"డని బోయల గద్దరించుచుఁ బల్లకి కడ్డముగ నిలచెను! వెలవెలఁబోయిన మోములతో బోయలు గత్యంతరముఁ గానక నిలవఁబడి తమ దొరసానివైపు విస్మయవిచారమిళితము లగు చూ

డ్కులఁ బరపిరి. ఇఁక నాసుందరిమానసికస్థితిని వేఱుగ వర్ణింప వలయునా! మొదట నీదృశ్య మామెహృదయమును భేదించున ట్లుండినను, వెంటనే సహజదౌర్బల్య మామె యెదను వదలి యాస్థలమును ధీరత్వ మాక్రమించెను. కానున్నది గాక మాన దని గుండె రాయి చేసికొని యాలేమ ధైర్య మూని యుండునంతలో, దోఁపిడికాండ్ర నాయకుఁడు రెండు దండప్రహారములతో బోయలచే బల్లకివి దింపించి యాజవ్వనిని సమీపించెను. అంతవఱ కితికర్తవ్యతామూఢ యైయుండిన యాయువతి యెట్టులో ధైర్యముఁ జిక్కఁబట్టి గుప్తముగ నుండిన కటారుతో నాదోఁపిడికాని రొమ్మును గ్రుమ్మఁ జేయి యెత్తెను. నాయకుఁడును మాఱినస్థితిని నిముసమున గ్రహించి, మొలను వ్రేలాడుచుండిన ఖడ్గమును విద్యుద్వేగముతో నూడఁబెఱికి తటాలున దానితో నొకబలమగు దెబ్బ నాయువతి కోమలకంఠమును గుఱి చూచి వ్రేయ నెత్తెను.

## 11

మనకథ జరుగుకాలమునఁ ద్రిలింగరాజ్యమును 'కాకతి రుద్రమదేవి' మహావైభవోపేతముగ నోరుగల్లునగరము రాజధానిగఁ బరిపాలించుచుండెను. ఆపురమునకు దాదాపు పండ్రెండుమైళ్ల దూరమున నున్న 'అంబాల' యను గ్రామము దేవిగారికిఁ బ్రియతమమగు ప్రదేశముగ నుండుటవలన నోరుగంటికిని నాగ్రామమునకును రాకపోకలు తరుచుగ నుండినను, నాప్రదేశ

ములనడుమనుండిన సాంద్రారణ్యభాగ మొక్కొక్కప్పుడు దారి దోఁపిడిగాండ్రు కాశ్రయ మిచ్చుచుండుటకూడ సంభవించుచుం డెను. గత ప్రకరణాంతమునఁ జెప్పఁబడిన భయంకరకార్యము జరుగుచుండిన సమయమున నోరుగల్లునుండి వెడలి యంబాల గాభిమోన్ముఖులై వచ్చుచుండిన యుద్ధ అశ్వికభటులు హఠా త్తుగ నారంగమున వ్రాలిరి. క్రొత్తగా వచ్చుచుండిన వారి స్వ ల్పసంఖ్య బందిపోటుగాండ్రు కేమాత్రమును భయమును గలిగిం పక వారిని తమపని యథేచ్ఛముగఁ జేయనిచ్చెను. వెనుకఁ జెప్ప బడిన విధమున నాదోఁపికాండ్రనాయకుఁ డాసుందరి కుత్తుకను గత్తితోఁ దెగవ్రేయ నుంకించుచుండెను. మఱియొక నిముస మునకు నిర్దోషిణియగు నాకోమలి పరలోకగామినియై యుండును. కాని, యాగంతుకులలో నొక్కరుఁడు వెనుకనుండి యాఘోర కార్యమునకై కేలెత్తిన యానాయకుని కేలు నెత్తినట్లే తటా లునఁ దనపట్టాకత్తియొక్క తీవ్రమును సమయోచితమును నగు వ్రేటుచే నేలఁ బడవేయునంతవఱకు నొక్కఁడేనియు నిట్టిపని జరుగు నని యెంచి యుండలేదు. ఇఁక రెండవయాశ్వి కుఁడు తక్కిన బందిపోటుగాండ్రపని చక్కఁబెట్టసాగెను. నాయ కుఁడు తనకు సంభవించిన యాపదకు దల్లడిల్లుచు బ్రతుకు జీవుఁ డా యని పిక్కబలముఁ జూపుచుఁ దనయనుచరులకు మార్గదర్శి యయ్యె.

మన కథానాయిక ప్రాణములఁ గాపాడిన మొదటి

యాశ్వికుఁ డందమైన మోమును, స్ఫుటమగు తేజమును గలిగి
యుండెను; కాని పురుషసౌందర్యమును సంపూర్ణము నొన
ర్చు మీసములు మాత్ర మాతనిముఖము నలంకరించి యుండ
లేదు. తన్ను జంప సిద్ధముగ నుండిన దోఁపిడికానిని పాఱఁద్రోలి
ప్రాణదాన మొనర్చిన యారౌతుపై నాసుదతి కృతజ్ఞతావలో
కనములఁ బరపి, స్వీయభావమును వెల్లడింప యత్నించెను. కాని
యానందాతిశయ మామె నోటమాట వెలువడ నీయలేదు ము
త్తియములవంటి బాష్పకణము లామె కనుదమ్ములనుండి పరం
పరగ వెడలి నునుజెక్కులపై జాఱుచు నప్పటికి దేదీప్యమాన
ముగ వెలుంగుచుండిన చంద్రికిరణప్రతిఫలనముచే ధగ ధగ
మెఱయుచుండెను. ఆమె మనమ్మున వెల్లివిరిసి పాఱుచుండిన భా
వములను ముఖమున జదివిన యయ్యాశ్వికుని హృదయము చా
ల జాలి నొందిన ట్లగపడియె. అంత నాతఁ డప్రయత్నముగ ముం
దడుగిడి యాముద్దియను తనవక్షమున కదిమికొని కన్నీరు గార్చు
చుండుటయు, మైలుదూరమున వెనుకఁ బడియుండిన యాముద్ద
రాలి భృత్యు యాస్థలమునకు వచ్చుటయు నొక్కపరియే సంభవిం
చెను. తస్కరనాయకుని తెగిపడిన హస్తమును, రక్తపుమడువు
లును, బోయల చిన్నవోయిన మోములును, సాయుధపాణు
లగు క్రొత్తమనుష్యుల తెఱఁగును, నాతనికి జరిగినకథ చెప్ప
కయె చెప్పెను. ఆరంగమును జూచి వివరముల నెఱింగినతోడనే
దుఃఖమును, సంతసమును, కృతజ్ఞతయు నెట్లాతని హృదయ
మున ముప్పిరి గొనెనో వర్ణించుట యసంభవము.

'యమునా !' యనుమాట నోట వెడల నాపురుషుఁడు తనభార్యను గాగిలించుకొనెను. యమునయుఁ బ్రాణేశున కెదురుగఁ బోయి, యాతనికంఠమున బాహులతలు వైచి వెక్కివెక్కి యేడ్వసాగెను.

అంత, ప్రతాపుఁడు భార్య నూఱడించుచు నిట్లు పల్కెను. 'నెచ్చెలీ! ఏమనవలను; దైవము నేఁడు మనపాలిఁట నుండుట చేత, నీయాశ్వికరూపమున వచ్చి నీప్రాణమును, దన్మూలమున నామానప్రాణములను గాపాడెను. లేనిచో...'అని యింకేమో పలుకఁ బోయి తనప్రియభార్యను రక్షించిన యాయాశ్వికునివంకఁ జూచి వినయముతో నిట్లు పల్కెను 'అయ్యా! తమయుపకారమును దగినవిధమున శ్లాఘింపఁ జాలను. నేనేమి ప్రత్యుపకారమొనర్పఁగలను? మముఁబోలు మందభాగ్యుల రక్షణమునకై యీశ్వరుఁడు మిమ్ముఁ జిరకాలజీవులుగ నుంచుఁగాక !'

ఆశ్వి:—,అయ్యా! మేమంతటి శ్లాఘనీయకార్యము నేమియుఁ జేయలేదు. ఏమైనఁ జేసితిమేని యది మాకర్తవ్యమే యగును గాని యంతకన్న నేమియు లేదు. ఈసుందరిప్రాణముఁ గాపాడఁగల్గినందు కెంతయు సంతోషముగ నున్నది. మే మిఁకఁ బోయెదము. ఈరాత్రి మీవెంట నీయరణ్యము దాఁటువఱకు రాఁగలఁడు పాప మీసుందరిని వదలిపోవుటకు నాకిష్టము లేదు. అయినను అట్లు చేయక తప్పదు. మీగ్రామ మెద్దియో తెల్పిన నొకమా రచ్చటికి వచ్చి మిమ్ము దర్శించి ధన్యత నొందెదను.'

పరిత:—ఇంతకన్న నానందప్రదము మాకు మఱేది యు నుండదు. ఇచ్చటికి కొలఁది మైళ్లు దూరముననున్న రుద్రవరము మా నివాసగ్రామము. తమరు మా గృహమును దప్పక పావనమొనర్చి మా యాతిథ్యము నంగీకరింపవేఁడుచున్నాము.

అశ్వి:—'సుందరీ! సెలవు. అయ్యా! సెలవు!'

యమునాప్రతాపులు:— "అయ్యా! వందనములు; మాకమితోపకారమొనర్చిన తమ పవిత్రనామమును మేము విన వేఁడుచున్నాము. అంతలో నయ్యాశ్వికుఁడు కొంత దవ్వేగియుండినందున నాతఁడీప్రశ్నమున కిచ్చిన ప్రత్యుత్తరమున రుద్రదే...' అను మాటమాత్రము వినవచ్చెను. అతనిపేరు "రుద్రదేవుఁ"డని వారు నిశ్చయించుకొనిరి.

## III

యమునాప్రతాపుల వాసస్థలమగు రుద్రవరము చిన్న గ్రామమే యైనను అందముగ నుండెడిది. ఈ కథ యారంభమగుట కొలఁదిసంవత్సరములకుఁ బూర్వము, పితరులు పరలోకగతులైనందునఁ బ్రతాపుఁడు పైతృకములగు భూములఁ దన వశమునకుఁ దెచ్చికొనవలసినవాఁ డాయెను. ఆతని వార్షికాదాయము కొన్నివేల రూప్యముల పరిమితి కలిగియుండెను. రుద్రవరములోని యాతనిగృహము రాజభవనమువలెఁ గడురమ్యమై చక్కని యుద్యానవనమునకు నడుమ నుండెను. ఆవరణపు

గోడలు మిగుల నెత్తుగనుండి, దాని యుత్తరదిశను నట్టనడుమ నొకగొప్ప కమాను, అంతర్మందిరపుసింహద్వారమున కెదురుగ గంభీరాకృతిం బ్రకాశించుచు, నా గృహమున నివసించుచుండు దంపతుల గొప్పఁదనమును జాటుచుండును. యమున కాపురమునకు వచ్చిన నాల్గు సంవత్సరముల నుండియుఁ బ్రతాపుఁడు సంసారసౌఖ్యములను సంపూర్ణముగ ననుభవించుచుండెను. ఆమె హృదయము కడుమృదులము, పరిశుద్ధమునై యుండెను. తాను భర్తను మనఃపూర్వకముగఁ బ్రేమించుచు, నతనివలన గాఢముగఁ బ్రేమింపఁబడుచుంటి నను నానంద మామెహృదయమును సర్వదా సంతుష్టిం గల్గించుచుండెను.

ప్రతాపుఁడునైతము భార్యను మనఃపూర్వకముగఁ బ్రేమించువాఁడే, అయినను, ననురాగమున కానికిష్టు లగు స్త్రీలు, పురుషుల నెంతగాఢముగఁ బ్రేమింపఁగలరో, పురుషులు స్త్రీలనంతగాఢముగఁ బ్రేమింపగల్గుట కొన్నిపట్టుల నసంభవము గదా! పురుషులహృదయము బహుసులభముగ సందియములకుఁ దావొసంగును. యమునప్రాణములు రక్షింపఁబడిన యానాఁడు వారింటికి వచ్చి చేరినప్పటినుండియుఁ బ్రతాపుని యమలినహృదయమున నేదియో మాలిన్యము ప్రవేశించెను. వస్త్రముపైఁ బడిన మచ్చను గడిగివేయవచ్చును గాని హృదయమునఁబడిన మచ్చను దుడిచివేయుటదుస్సాధ్యము. నీవితరుని వెలగల ముత్తెయమును పొరపాటునఁ బగులఁగొట్టితివేని, దానికిఁ బ్రతిగఁ

దమూల్యమగు ధనమునిచ్చిన నీ నేరము తీఱిపోవును; కాని నీ
వొక్కని మనస్సును జితుకఁగొట్టితివేని ప్రపంచమునఁగల యెట్టి
యమూల్యమగు వస్తువు నిచ్చినను నాకొఱంతఁ దీర్పఁజాలదు.
దురదృష్టకారణమగు నానాఁటినుండియుఁ బ్రతాపుఁడు క్రమ
క్రమముగ విచారాందోళిత మనస్కుఁడై పరివర్తించుచుండె
ను. భార్యయెదుట నున్నవేళ సంతసమును వ్యక్తపఱచుచు, నె
వ్వరునులేని తరుణమున దీర్ఘవిచారసాగరమున మున్గియుండును.
ఈస్థితి నానాఁటికి హెచ్చెను. అంతకు మున్నుదినము ప్రేయసి
తోఁ గూడ సాయంసమయములందు గృహారామమున విహార
మొనర్ప నలవాటుపడియుండిన ప్రతాపుఁడు, ఒకనాఁడు తల
దిమ్ముగ నున్నదనియు, మఱియొకనాఁడు గాలికడుఁజల్లఁగ వీచు
చున్నదనియు నే వేవో మిషలఁ బన్నుచు విహారములను మా
నెను. విశ్రమసమయములం దభ్యంతరగృహమున యమునసరసఁ
గూర్చుండి వినోదసంభాషణములఁ బ్రొద్దుపుచ్చు నాతఁ డట్టి
యవకాశము లభించినపుడు, ఉక్కగా నున్నదనిగాని, వాకిట
నెవరో పిలుచుచున్నట్లున్నదనిగాని పల్కుచు లేచిపోవును. ఏకాం
తమాతని కెక్కువ రుచించుచున్నట్లు కన్పట్టసాగెను. స్వవ్యవహార
ములను గడుజాగరూకతతోఁ గనుపెట్టుచుండు తనతొంటి య
భ్యాసమును మానుకొనఁజొచ్చెను. పనికలిగి వచ్చు పెద్దమను
ష్యులతోఁ బూర్వమువలె వివరముగ మనసిచ్చి భాషించుట
మాని నాల్గుమాటలతో సరిపుచ్చి వారి నవ్వల కంపివేయుచుం

డును. యమున భర్త యొక్క యిట్టి మానసికావస్థకుఁ గారణ మారయఁ బలుమాఱు యత్నించెను. కాని యామె యత్నములు వ్యర్థములయ్యెను. ప్రతాపుఁ డామెపల్కు నర్మగర్భములగువాక్యముల కొకప్పుడు ఖండితముగను, వేఱొకప్పుడు కసరుకొనియు నిచ్చుప్రత్యుత్తరము లారంభము లయ్యె. ఆముఖవికాసము, ఆమందహాసము, ఆ యనురాగప్రకటనము అంతయు మాయమయ్యెను. ఈమార్పులు యమున నిర్మలహృదయమును జింతాసముద్రమున ముంచివైచెను. భర్త మనస్సునకుఁ దాత్కాలికవిశ్రాంతియేని కలిగించునను నాశజనించి, యామె మిగుల జాలి బుట్టించు నానాఁటి తన ప్రాణరక్షణవృత్తాంతపుఁ బ్రసక్తిఁ దెచ్చి, ముష్కరుఁడగు నాబందికాండ్రనాయకుఁడు తన యుసుఱులఁ గొనఁబూనినవిధమును, రుద్రదేవుఁ డాదుర్మార్గుని చేతిని నఱికి యాబందిపోటునాయకునిఁ బఱుగెత్తించినవిధమును, మనసు కరగునట్లు చెప్పఁబూన నతని దృక్కులుకొంచెము ప్రసన్నములుగ మాఱెనట్లామెకుఁ దోఁచెను. కాని తరువాత జవ్వని, రుద్రదేవునియెడఁ గృతజ్ఞతఁ జూపినపుడెల్ల నతని హృదయము మఱింత ఖిన్నమై యుండుటయు, నొక్కొక్కప్పుడు రుద్రదేవుని పేరామె పెదవుల నుండి వెడలునప్పు డతఁడు భార్యముఖమునఁ దనదృష్టిని దీక్షముగ నిల్పి, యామె హృదయాంతరాళము నన్వేషించువానివలె నగపడుటయు, సంభవింపుచుండెను. ఈలక్షణములనుబట్టి యమున భర్తహృదయమును గలంచుచున్న విచార

కారణమును గొంతవఱకు—కాదు సంపూర్ణముగఁ బోల్చుకొనఁ గల్గెను. ఆమె నిర్దోషియగుట నిశ్చయము. యమున మానసము గంగాంబువువలెఁ బవిత్రమైనదని మన మెఱుఁగుదుము; కాని, ప్రతాపు నెట్లు సమ్మింపఁగల్గుదుము ? తన హృదయమును విచ్చి భర్త యెదుటఁ బెట్టి భర్త యంతస్తాపముందీర్ప యమున పలుమారు తలంచుకొనెను; కాని యంతమాత్రమున నాతని 'హృదయశల్యము' పీడఁగల్గినచో నంతకుఁ బూర్వమామె భర్త యెడఁ జూపియుండిన నిశ్చలానురాగమును, నామె పవిత్రప్రవర్తనమును నాతని మనస్తాపముం దీర్చియుండఁగూడదా ? ఇట్టి భావము లామె నట్టియుద్యమమునుండి మఱలించెను. మానవ హృదయము విచిత్రమగు క్షేత్రము. అందొక నిముసమునఁ బరిమళవంతములై ఘ్రాణతర్పణములగు కుసుమము లుదయించును; మనోజ్ఞములగు ఫలములు పండును; వేఱొకనిముసమున నాహృదయక్షేత్రముననే కంటకావృతమైన విషవృక్షములకుఁ దావలమై దుష్టఫలయుక్తమగును. ప్రతాపుని మనోక్షేత్రమి విధముగ మాఱుటను జదువరులు తెలిసియున్నారుగదా! అక్కటా ! ఈహృదయశల్యము పోవుటెట్లు ?

## IV

ఈ విధముగ దినములు గడచెను. యమునప్రాణములు రక్షింపఁబడిన యా యదృష్టదినము—కాదు—దురదృష్టదినము

గడచి నేఁటికి మూఁడుమాసములయ్యెను. వారిభవనము నాశ్రయించి యుండిన యా రామములోని వృక్షతతియు, లతావితానమును నవవసంతసమాగమమున, నవనవలాడఁజొచ్చెను. కుసుమసంతానము తమసౌరభమును, వాయుదేవుని ముఖమున నలుదెసలకంపి యెల్లరమానసములఁ బల్లవింపఁజేయసాఁగెను. ఉద్యానవనములోని కేళాకూళుల స్వచ్ఛనీరముల కడకు జల విహంగమిథునములు మాటిమాటికివచ్చి జలక్రీడలు సల్పుచు పరస్పర సహవాససౌఖ్యముల నవ్వారిగా ననుభవించుచుండెను. కాని దైవనిర్మితము లగు నీసౌఖ్యసాధనములలో నొక్కటియేనియు సంతప్తహృదయులగు యమునా ప్రతాపులకుఁ జిత్తవిశ్రాంతి నీయఁజాలవయ్యె. ఇన్నిసంవత్సరముల సహవాసము ననుభవించినతరువాతఁగూడ భర్త తనయంతరంగము నెఱుంగఁడయ్యెఁగదా యను సంతాపమామెను మఱిమఱి బాధింపఁజొచ్చెను. "దైవమా ! నాకేల యిట్టిచిక్కులఁ దెచ్చిపెట్టితివి ! బందికాండ్రి చేతులలో నసువులఁ బాయనున్న నన్నునాఁడు రక్షింపనుండిన నీకేమి చేటు మూడియుండును ? ఓమాయలమారి రుద్రదేవా ! నీహృదయమెట్టిదో నేనెఱుంగను కృతజ్ఞతాభారవివశనై యున్న నన్నా నాఁడేలదయగలవానివలె దగ్గరకుఁ దీసికొని నాసాధుని మనస్సు ననుమానము పాలుచేసితివి దయానిధివగు నోదైవమా ! ఇప్పుడైన నెట్లో నాప్రాణములఁబాపి నాకు సంతసమును నాజీవితేశ్వరునకు శంకారాహిత్యమును, నేలకల్గింపవు !" అని కన్నీరు మున్నీరుగ

నేడ్చుచుండెను. ఆదంపతుల మనోవ్యాకుల మిట్టిదశ నందినదిన ములలో నొక్కనాఁ డకస్మాత్తుగ రుద్రదేవుఁ డని యాదంపతు లనుకొనిన యయ్యాశ్వికుఁడు వారియింటికి వచ్చెను.

ప్రతాపుఁడు రుద్రదేవు రాక వినఁగానే మనస్తాపమును మఱుగుపఱచి సగౌరవముగ నతని నెదుర్కొని లోనికిఁ దోడితెచ్చెను. తన కీయఁబడిన యాతిథ్యమునకు రుద్రదేవుఁడు కృతజ్ఞతఁ దెల్పెను. యమున కనఁబడినప్పు డయ్యతిథి యామెను కుశల ప్రశ్నము చేసెను. కాని, యుత్సాహపూర్వకముగఁ బ్రత్యుత్తరము నామె చేఁ బడయజాలఁ డయ్యె. ప్రతాపుఁ డెంతసంతసముఁ జూపినను,నాదంపతుల హృదయకమలముల యడుగునఁ గఱకుగ మెదలుచుండిన కంటకముల నాతఁడు కనిపెట్టకపోలేదు. ఇవ్విధముగ నాయతిథి రెండుదినము లచ్చటఁగడపెను. ఈరెండుదినములును యమునకు రెండుయుగములుగఁ గడచెను. ఈదినద్వయమును నామెమనస్సు చిత్రవిచిత్రములగు తర్కవితర్కముల మునింగి కర్తవ్యమును నిర్ణయింపఁజాలక తొట్రుపడుచుండెను. ఎవ్వాఁడు తనభర్తమానసికాస్వస్థతకుఁ గారకుఁ డయ్యెనో-తనచింతకు హేతుభూతుఁ డయ్యెనో-అట్టిరుద్రదేవు నామె మనస్సునఁ బరిపరి విధముల నిందించుచుండెను. అతఁడు వచ్చిననాఁడే వెడలిపోక దినములు గడపుచుండిన యాతనియునికి యమునదుఃఖసముద్రమును క్షోభింపఁజేయుచుండెను. తుద కామె వెనుకముం దాలోచింపక-భర్త యేమనునో యని తలంపక- తనప్రాణములను

రక్షించిన రుద్రదేవునియెడఁ గృతజ్ఞత నైన వహింపక-క్రోధావేశ పరవశయై, భర్తసన్నిధి నుండగనే మూఁడవనాఁడు కన్నుల జల జల బాష్పములు రాల, రుద్రదేవునిదిక్కు మొగమై యిట్లనెను. 'చాలు; చాలును; బహుమంచివాఁడ వయ్యా! నాఁటి నీదుశ్చేష్టమూలమున నాపచ్చని కాపురము పాడై పోవుదినముఁ దెచ్చితివి! ఆవిధముగ మాదాంపత్యసుఖమును దగ్ధము చేసి యంతటితోఁ బోవక, మరల యిటకు వచ్చి మమ్ము వేధించుట నీకు న్యాయమా? సిగ్గు లేదా?'

అని పరుషవాక్యములఁ బల్కునప్పుడు కనుసన్నచే విప్రుఁడు భార్యను వారింప నెంతయు యత్నించెనుగాని, యాతని కోర్కె నెఱవేఱ దయ్యె. ఆమాటలకుఁ బెదవులపై నాట్యము సేయుచుండిన చిఱునగవును బలవంతముగ నడఁచుకొని యామె కన్న నెక్కుడుక్రోధము నభినయించుచు రుద్రదేవుఁ డిట్లనెను. 'అమ్మా! నే నేల నిందింపఁబడుచున్నానో యెఱుఁగను. నాఁడు నిన్నుఁ గాపాడుటయే నే చేసిన ఘోరపాప మైనచో, పరోపకారమాహాత్మ్యమును నాకుఁ గడుఁజక్కఁగ బోధించితివి! ఆనాఁడు నీభర్త నారాకను వేఁడినందున, నే నిటు రా సాహసించితిని. తినఁ గూడు లేక మీసత్త్రమునకు వచ్చినవాఁడఁ గాను. నాకును నలుగురఁ బోషింపఁ దగుస్థితి కలదు. మీకిట్టి యగౌరవభావ మున్న దని నాకు వచ్చినతోడనే తెలిసి యుండినచో రెండు దినములు మీయింట నుండువాఁడఁ గాను" అని యాయతిథి యనుచుండఁ దన

భార్యమూలముగ నయ్యాగంతుకునకుఁ గోపమొదవుట కెంత యుఁ జింతిల్లి ప్రతాపుఁడు యమునను ముఖము వాచునట్లు చీవాట్లుపెట్టి రుద్రదేవునికిఁ దనభార్య పిచ్చితనమును బోధించి శాంతింపఁజేయఁజూచెను, కాని యాతఁడు ముఖలక్షణములను మార్పక చావడిలోనికేఁగి కూర్చుండెను. ప్రతాపుఁడు జరిగిన దానికి నగుచును వాకిట నిలువఁబడియుండెను. అంతలో 'జరీబు టేదారి యల్లికపనిచే'దళతళ మెఱయు నల్లపట్టుబట్టతోఁ జేయఁ బడిన సైనికపుదుస్తులను ధరించి, సిగకాయుఁడుగనున్న యొక యాశ్వికుఁడు మందిరద్వారముకడకు వచ్చి యచట నున్న ప్రతాపునిజూచి, గుఱ్ఱమును దిగి, నమస్కరించి " అయ్యా! మూఁడుదినములక్రిందట నిచటికి వచ్చిన మామహారాజ్ఞి శ్రీరుద్రమదేవిగారిని వెంటనే దర్శింపవలసియున్న" దని గంభీరస్వరముతోఁ బల్కెను. " మహారాజ్ఞిగా రిచ్చటి కేలవత్తు " రను మాట ప్రతాపునినోట వెడలఁబోవుచుండునంతలో, చావడిలోఁ గూర్చుండియున్న రుద్రదేవుఁడు ద్వారముకడకు వచ్చి నిలచెను. అంత నాకొత్త యాశ్వికుఁడు రుద్రదేవుఁడని మనము వ్యవహరించుచున్న యాపురుషునిజూచి వంగి సవినయముగ జోహా రొనర్చి యిట్లు విన్నవించెను. " అమ్మా! మహారాజ్ఞిగారి యానతిప్రకారము రెండువందల భటులు వాకిట సిద్ధముగను న్నారు. దేవిగారికొఱకు పల్లకి నాయత్తపరుతుమా। లేక యశ్వము నాయత్తపఱుప సెలవా? దేవియాజ్ఞ" యని మరల

నొకమారు జోహారొనర్చి తలవాల్చి నిలచెను. 'పల్లకి చాలును రెండుగడియలలో మన మోరుగల్లు చేరవలెను. జాగ్రత్త' అని పల్కి రుద్రదేవుఁడు—కాదు మహారాజ్ఞియగు శ్రీరుద్రమదేవి—నుడివెను. అంత నయ్యాశ్వికుఁ డచ్చోటువాసి పోయెను. ఆసంభాషణములను వినిన పత్రాపుఁడు తత్తఱపాటుతో లోని కఱిగి యంతకుముందు తనభార్యచే నిందితమైన వ్యక్తి, త్రిలింగ సామ్రాజ్యమునకు రాణియగు శ్రీరుద్రమదేవియని యము నకుఁ దెల్పి వెంటనే యామెను గూడఁ గొనివచ్చి, యిరువురును మహారాణీగారి పాదరాజీవములపైఁ బడి తమ యపరాధమును మన్నింప వేఁడుకొనిరి.

రాణి మందహాసముతో నాదంపతులను లేవనెత్తి సాదరముగ నిట్లుపల్కెను. "అమ్మాయీ! నీవు నిందించితివనినాకుఁ జింతలేదు. నేను క్రోధము నభినయించితినే గాని యనుభవింపలేదు. ఆనాఁడు స్త్రీ జాతికి సహజమగు హృదయమార్దవము చేతను, అనేక దుఃఖముల ననుభవించిన నామనస్సునకు నీవపుడనుభవించు దుఃఖము జ్ఞప్తికి వచ్చుటచేతను, నావేషస్వభావమును మఱచి జాలిచే నిన్నుఁ గౌగలించుకొంటిని; కాని పురుషవేషముననున్న నే నట్టుచేయుట నీ భర్త కనుమానము నాపాదించు ననుమాట తరువాత స్మరణకు వచ్చి, మిమ్ముల మఱలనొకమారు దర్శింప ననుజ్ఞవేడి యిపుడు మీయతిథినై యిటకు వచ్చితిని. నీ నిష్కాపట్యస్వభావము

నకును మీ పరస్పరానురాగమునకును నానందించితిని; కాని కొంతకాలము మీమనస్తాపమునకుఁ గారణభూత నైనందులకు నన్ను మీరు మన్నింపవలెను'' అని రుద్రమదేవి యనెను.

అంత నాదంపతులు దేవికి మఱల మఱల వందనము లర్పించి 'దేవిగారియెడఁ జేసిన యవజ్ఞతకు క్షమింప వేఁడవలసినది మేము కాని తమరు కాదని' కేలు మోడ్చి భయభక్త్యాశ్చ ర్యావేశములతోఁ గన్నుల నానందబాష్పముల రాల్పసాగిరి.

అంతలోఁ బల్లకి వచ్చి వాకిట నిలిచెను. దేవి దాని నెక్కఁ బోవుచు నాదంపతుల నాశీర్వదించి యిట్లనెను. 'మీ హృదయశల్య మిఁక వీడిన దని నేను దృఢముగ నమ్మవచ్చునా' అన నాదంపతులు, 'దేవిగారి యనుగ్రహముచేత నిస్సందేహ ముగ వదలినది' అని పునఃపునఃప్రణామము లొనర్చిరి. మహా రాణీగా రధిష్ఠించిన యాందోళిక బోయల యోంకారనాదము లతో నంతర్హిత మయ్యెను.



# *ఆపస్తంబమహర్షి



విశ్వామిత్రమహర్షి, ప్రాణభీతిచేఁ దనను శరణు చొచ్చిన శునశ్శేపుఁ డను దేవరాతుని రక్షించుటయే గాక, దేవరాతుఁడు, 'నేను అజీగర్తుని పుత్త్రుఁడను గాను. నీబిడ్డఁడనే' యనుటచే నతికరుణాసమన్వితుఁడై 'ఆంధ్ర, పుళింద, పుండ్ర, శబర, మూతిబ, మధుచ్ఛంద, అష్టక, రేణుక, ఋషభ' నామముల నొప్పువా రధ్యక్షులుగాఁ గలఁ తననూర్వురపుత్త్రులం బిలిచి, 'మీ రీదేవరాతుని మీసోదరునిగాఁ జేసికొనుటయే గాక, మీ యందఱికి నగ్రజునిగాఁ గూడ నంగీకరింపుఁ' డన, మధుచ్ఛందుడును, నాతని యనుజులగు 'అష్టక, రేణుక, ఋషభు లనువా రధిపులుగాఁ గల యేఁబది వైశ్వామిత్రులును శునశ్శేపుని దమసోదరునిగాను, నగ్రజునిగానుగూడ నంగీకరించిరి. కాని, మధుచ్ఛందునికంటెఁ బెద్దవా రగు 'ఆంధ్ర, పుళింద, పుండ్ర, శబర, మూతిబ' సంజ్ఞలతో నొప్పు నేఁబదిమంది వైశ్వామిత్రులును, తండ్రిమాట కెదురాడి 'శునశ్శేపుని మేము సోదరునిగాను, నగ్రజునిగాను గూడ నంగీకరింప' మనిరి. అందులకు సులభక్రోధియగు విశ్వామిత్రుఁడు తనమాట నతిక్రమించిన యాంధ్రా

* ఇది ఆపస్తంబ సూత్రములు, మన్వాదిస్మృతులు, పురాణములు, ఐతరేయబ్రాహ్మణము పరిశోధించి వ్రాయఁబడెను.

దులపై నలిగి (1) "మీరు వేయిసంవత్సరములు నీచవృత్తులఁ జరింపుఁ" డని శపించుటయేగాక, వారి కేమియుఁ దనయాస్తి నీయక, తనయాశ్రమమునం దుండనీయక వెలివైచెను. వృత్తిహీనులైన యాంధ్రాదివైశ్వామిత్రులలో "పుండ్ర, పుళింద" సంఘములవారు "ఆయుధజీవిను"లై కాలాంతరమునఁ దమ పేరి రాజ్యములను స్థాపించుకొనిరి. శబరు లారణ్యకులై కొందఱును, అధర్వవేదవేత్తలై 'కట్టుబోఁతుతనము' నేర్చి, మఱికొందఱును జీవించిరి. కట్టుబోఁతుతనము గలవారి విద్య కందువలననే 'శాబరవిద్య' యనునామము పిమ్మటఁ గలిగెను. మూతిబులును నారణ్యకులేయై వివిధవృత్తుల నవలంబించి జీవించిరి.

ఆంధ్రులు తండ్రిచే నిస్సారితులై జీవనాధారముకై కొందఱు బ్రాహ్మణవృత్తిని, మఱికొంద ఱాయుధధారులై క్షాత్రవృత్తిని, వేఱుకొందఱు వైశ్యవృత్తిని, అనకులు సేవకావృత్తిని నవలంబించి నాల్గుశాఖలుగా విడిపోయిరి.

వైశ్యవృత్తి నవలంబించిన 'కాలదమనుఁడు' అనునాంధ్రుఁడు విశ్వామిత్రునికి విరోధియు వసిష్ఠపుత్రుఁడు నగు శక్తి మహర్షికి శిష్యుఁడై ప్రవర్తించెను.

---

(1) విశ్వామిత్రుఁడు, శునశ్శేపుని సోదరునిగా నంగీకరింపని తన పుత్రులను వేయిసంవత్సరములు మాత్రమే నీచులు గండని శపించినట్లు శ్రీమద్రామాయణములోని బాలకాండమునఁ గలదు. వేదమునఁ గాలనియతి చెప్పఁబడలేదు.

ద్విజత్వము నవలంబించిన యాంధ్రులను, తదితరు లగు నార్యసంఘములవారు, తండ్రిచే వెలివెట్టఁబడినవా రగుటచేఁ బ్రాయశ్చిత్తార్హులనుగా నెంచి వారిని (1) 'వ్రాత్య' లనిరి. స్వాశ్రమములనుండి తరుమఁబడినవా రగుటచే నాంధ్రులను (2) ద్రావిడులని కూడఁ గాలాంతరమునఁ బేర్కొనిరి.

ఇట్లుండఁ గొంతకాలమునకుఁ గురుపాండవయుద్ధ మేతెంచెను. యావద్భరతఖండస్థసంఘములవారు నాసంగ్రామమునఁ జేరినట్లే మనయాంధ్రులలోని యాయుధజీవికులును గౌరవపక్షమునఁ జేరి, పోరి, పెక్కండ్రు మడిసిరి.

భారత యుద్ధానంతరమునను దత్పూర్వమునను గల్గినసాంఘికధర్మవిప్లవములలో మనయాంధ్రులును బ్రహ్మచర్యాది నియమములను బురుషులును, పాతివ్రత్యమును స్త్రీలునుబాటింపనందునఁ బెక్కువిధముల నీయాంధ్రులు భ్రష్టులయిరి. నాఁడాంధ్రులు విస్తారముగాఁగల 'సాల్వ'దేశమున నారణ్యకపశువులు విస్తారముగా నుండుటచేతను, పశుభక్షణ మాకాలమున నంతగా నిషిద్ధము కానందుననను, ఆంధ్రులలోఁ గొంద ఱారణ్యకపశువులను వేఁటాడి యామాంసము నమ్మి జీవించుచుండుటచేత

---

(1) వ్రాత్యశబ్దమునకు "ప్రాయశ్చిత్తార్హుఁ" డను వ్యుత్పత్తిని గొందఱువైయాకరణులు సాధించిరి. దీని నావశ్యంబుఁడు వేఱుగ నిరూపించిన యంశము ముందు వ్రాయఁ బడును.

(2) ద్రావిడులకు "తరుమఁ బడినవారు" అని వ్యుత్పత్త్యర్థము.

నావృత్తిని సహింపఁజాలక 'మనువు' తన స్మృతిలో (1)"మేదరులు, ఆంధ్రులు, చెంచులు, అరణ్యకపశువులను హింసించి జీవించువారు" అని నింద్యముగా వ్రాయుటకుఁ గారణమయ్యెను.

మఱియు 'అనులోమ, ప్రతిలోమ' వివాహములవలననైన సంకరోత్పన్నజాతివారాంధ్రులని కూడ మనువువ్రాయుటమాత్ర మతిశయోక్తియు, నసూయా జనితవాక్యము నని తలంపవలసియున్నది.

భారతయుద్ధముచేఁ బురుషప్రళయము కలుగుటచేనైన విపరీతసాంఘికపరిస్థితులను సవరింప జనమేజయాది మహారాజులును, 'ఉద్దాలక, నాక, కుమారహారి' త్యాది మహర్షులును యత్నించిరి. (2) ఉద్దాలకుని పుత్రుఁడును మహామేధావియునగు 'శ్వేతకేతుమహర్షి' విచ్చలవిడిగ స్త్రీపురుషులు తిరుగరాదని వివాహనియమము నేర్పఱిచెను. (3) పిమ్మట యాజ్ఞవల్క్యమహర్షియు నాతని ప్రశిష్యుఁడగు 'బోధాయన' మహర్షియు మఱికొన్ని సాంఘిక, రాజకీయనియమముల నెలకొల్పిరి. ఇంచుమించుగ బోధాయనుని కాలమునందే హస్తినాపురము గంగాప్రవాహమునఁ గొట్టుకొనిపోఁగా 'నిచక్షుఁ'డను పాండవ వంశపురాజు 'కౌశాంబి' పట్టణమును రాజధానిగాఁ జేసికొనెను.

(1) చూ మనుస్మృతి 10 అధ్యా.
(2) ఈయంశము బృహదారణ్యకోపనిషత్తునందు గలదు.
(3) మహాభారతములోని ఆదిపర్వమున నిది గలదు.

ఆకాలముననే జరాసంధునివంశజులలోఁ గడపటివాఁడగు 'పురంజయుఁడు' మగధరాజ్యము నేలుచుండెను. యమునాతీరమునం దుండిన 'సాల్వ'దేశము నాంధ్రక్షత్రియుఁడగు 'యుగంధర'మహారాజు 'మనుమార్గవర్తియై' పాలించుచుండెను. ఆకాలమునం దారాజ్యమునందు, ఏమహర్షియొక్క ధర్మములు 'యాజ్ఞవల్క్య, పరాశ'రాది స్మృతికర్తలచే గ్రహింపఁబడెనని వారు తమ స్మృతులలో వ్రాసికొనిరో-ఎవ్వానినామమును 'పాణినిమహర్షి' తన 'యష్టాధ్యాయి'లో స్మరించెనో—ఏమహర్షి చెప్పిన విధులచే సౌరాష్ట్రాది పశ్చిమోత్తర భరతఖండస్థదేశములలోని బ్రాహ్మణులే గాక దక్షిణాపథములోని 'మహారాష్ట్ర, కర్నాట, ద్రవిడ దేశస్థబ్రాహ్మణులలోని శతసహస్రసంఖ్యాకులును, ఆంధ్రదేశములోని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర నామములతో నొప్పు రెండుకోట్లమంది జనులును, 'శ్రౌత' స్మార్త, నిత్య, నైమిత్తిక' కర్మలను సమంత్రకముగనో, యమంత్రకముగనో నేఁటికిని నెఱవేర్చుకొనుచుండిరో—ఎవనిసూత్రవిధులచేఁ దాము పవిత్రుల మైతిమని 'నన్నయమహాకవి' మొదలు నేఁటివఱకుఁ గల యాంధ్రమహాకవులలోని శతసంఖ్యాకులు స్వగ్రంథములలో వ్రాసికొనుచుండిరో-ఎవనిసూత్రములకు 'హరదత్త, రుద్రదత్తాది' భారతీయమహాపండితులే గాక, 'వింటర్నిట్జు, బూలర్' మొదలగు ఖండాంతరపండితులును మెచ్చుకొని బహువిధముల వ్యాఖ్యానించిరో—ఎవని 'శుల్బ' సూత్రములలోని 'క్షేత్రరేఖాగణిత'

విధానముఁ జూచియు, ఖగోళవిజ్ఞానము నాలోకించియు నేఁటి ప్రపంచమునఁగల, సర్వదేశస్థపండితులును నాశ్చర్యచకితు లగు చుందురో, (1) ఎవని వేదాంతసూత్రములపై శంకరాచార్యుల వారు 'అద్వైతపరముగ' భాష్యము వ్రాసిరో, అట్టి మహామే ధావి—విజ్ఞానఖని—బ్రహ్మవర్చస్వి—బ్రహ్మవాది—ఆంధ్రజాత్యు ద్ధారకుఁడు, నగు 'ఆపస్తంబుఁడు' అను మహర్షి జన్మించెను.

ఈమహర్షి విశ్వామిత్రునిచే స్వాశ్రమమునుండి వెడలఁ గొట్టఁబడినవారిలో నాంధ్రసంఘములోనివాఁ డైనట్టియు శక్తి మహర్షికి శిష్యుఁడై, వైశ్యవృత్తి నవలంబించిన 'కాలదమునని' యపరావతార మని యొకపురాణము చెప్పుచున్నది. (2)

ఈమహర్షియొక్క మాతాపితలనామము లెవ్వియో తెలియవుగాని 'అక్షసూత్రి' యను నామె యాపస్తంబుని భార్య యనియు, 'కర్కి' యనునాతఁ డీతనిపుత్త్రుఁ డనియు నొకపురాణము చెప్పెను.ఆశ్వలాయనమహర్షి యీతనికి మామ గారనియు, బోధాయనమహర్షి గురు వనియు లోకప్రథ కలదు. ఏలనో తలిదండ్రుల నామములను బోధాయనుని పేరును

---

(1) ఆపస్తంబ ధర్మసూత్రములలోని ప్రథమప్రశ్నమునం గల 22,23 ఖండలు పరబ్రహ్మబోధకములగు వేదాంతసూత్రములు; వానికి శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులవారు వ్రాసిన అద్వైతభాష్య మిటీవల "తిరువాన్కూరు" సంస్థానమువారికి లభించిన దఁట!

(2) వామనపురాణమున నీయంశము సూచింపఁబడెను.

నీమహర్షి యెచటను స్మరించలేము. తన గ్రంథములో ననేకస్థలములయం దీమహర్షి 'శ్వేతకేతు' మహర్షినే స్మరింపుచుండుటయేగాక, అట్టివారే పుట్టరని పొగడుటచే నీతఁ డాశ్వేతకేతు మహర్షియొక్క శిష్యుఁడైయుండునని తలంపఁబడును. శ్వేతకేతుని తండ్రియగు 'ఉద్దాలకమహర్షి'కి శిష్యుఁడగు వాజసనేయుని 'బ్రాహ్మణము' నీతఁడు పలుమార్లు ప్రమాణముగా గ్రహించుచుండెను. 'ఆపస్తంబుఁడు' అను పేరీతనికి వచ్చుటకీక్రిందికథను జెప్పుదురు.

ఒకప్పు డీమహర్షి యమునానదీ తీరమునందు దీక్షతో నెండలోఁ గూరుచుండి కఠినమగు తపస్సు చేయుచుండఁగా సౌందర్యరాశియగు నీతనిని వచ్చిపోవు జను లందఱును 'నెండలోఁ గూరుచుండి తపస్సుఁ జేయుచు శుష్కించుచున్నాఁడే.' యని యాశ్చర్యముతో గుమిగూడి చూచుచుండి రఁట! ఆజనుల సంభాషణాదికముచేఁ దనతపస్సునకు విఘ్నము కల్గుచున్నదని యీమహర్షి నీరును మంత్రించి తనచుట్టును దిప్పుకొనఁగా, నాయుదకము పడినచోటున నొక 'రెల్లుపొద' బయలుదేరి, యీమహర్షినిఁ జాటు చేయుటచేత (1) 'ఆపస్తంబుఁడు' అను బిరుదనామము నొందె నని కొందఱందురు.

అట్టి మన యాంధ్రజాతిలోని బ్రహ్మర్షి తన యెనిమిదవయేఁట నుపనీతుఁడై యథావిధిగ గురుకులమునఁ జేరి ముప్పది

---

(1) అప=ఉదకము; స్తంబ=పొదయైనవాఁడు. (అపస్తంబునిపుత్రుఁ డాపస్తంబుఁ డగునని వైయాకరణులు.)

యాతేంద్లు బ్రహ్మచర్యవ్రతముఁ జేసి 'వేదమును, వేదాంగములను, పశుపక్షిక్రిమికీటాది శాస్త్రములను, రాజకీయసాంఘిక నీతులకు సంబంధించిన సమస్తగ్రంథములను గురువులనుండి సాంగముగ నభ్యసించుటయేగాక, నాఁటి కాలమునందును, నంతకుఁ బూర్వమునను 'మత, సాంఘిక, రాజకీయ' విషయములం గూర్చి వ్రాసిన మహాపండితులగు 'వాజసనేయుఁడు' శ్వేతకేతువు, హారీతుఁడు, పుష్కరసాది, మనువు, కణ్వుఁడు, కౌత్సుఁడు, కుణికుఁడు, వార్ష్యాయణి' మొదలగు మహర్షుల యొక్క గ్రంథములఁ గూడఁ జదివెను.

ఆంధ్రజాతియందు—కాదు, ఇతరభారతజాతులందును నింతటి పండితుఁడు 'నభూతోనభవిష్యతి' యని చెప్పఁదగును. అందువలననే వృద్ధబ్రాహ్మణపండితులు గొప్పపండితునిగా నెవనినైనఁ జెప్పునపు డాతఁడు 'ఆపస్తంబుఁ డండీ!' యని నేఁటికిని జెప్పుచుందురు.

ఆపస్తంబుఁడు విద్యలు నేర్చి గడిదేఱునాఁటి కాసాల్వ' దేశమునకు యుగంధరుని పుత్రుఁడగు 'యాగంధరి' రాజయ్యెను. యాగంధరియు మహారాజార్హగుణయుక్తుఁడు. ఆమహారాజును, నీమహర్షియు నిమ్నత్వమునం దుండిన తమయాంధ్రజాతి నుద్ధరింపఁ దలంచి, తొలుత జాతిని సర్వవిధముల వృద్ధిపఱచు శ్రుతిస్మృతుల ధర్మములను దమజాతియందుఁ బాదుకొనఁ యోచించి తగినవిధానములఁ జేసిరి.

అందాపస్తంబుఁడు తాఁ జదివిన గ్రంథముల ననుసరించి మనుష్యుని యాయుర్బలవిద్యల నభివృద్ధిఁ జేయునదియుఁ దమసంఘమున నప్పటికిని సడలియున్నదియు నగు బ్రహ్మచర్యమును గట్టి యేర్పాటుతో ననుష్ఠించుటకును దానికి వెలియైనచో విశేష ప్రాయశ్చిత్తములను, శిక్షలను బొందుటకును విస్తారమగు నియమములఁ జేసెను. అట్లు చేయుటయే గాదు; బ్రహ్మచర్యమును యథావిధిగఁ జేసి వేదశాస్త్రములఁ జదివినవాఁడు రాజుకంటె నధికుఁడుగా గౌరవింపబడున ట్లొనర్చెను. అట్టి బ్రహ్మచారి యేగృహస్థునింటి కతిథిగా వచ్చిన నాగృహము సమస్త దేవతలు వచ్చిన నెంతపవిత్రమగునో యంతపవిత్రము నొందునను గౌరవమును స్వసంఘమునఁ గలుగఁజేసెను. మన్వాదిస్మృతికర్తలాంధ్రులు నీచకర్మములఁ బ్రవర్తించు దినములలో వారిని వ్రాత్యు లని, యేవిరుద్ధార్థముగాఁ జెప్పిరో, మనయాంపస్తంబుఁడావ్రాత్యశబ్దమును సర్వోత్కృష్టగుణములు గలపూజ్యుఁ డని, బ్రహ్మచర్యవ్రతముతో ముప్పదియాఱేండ్లు వేదవేదాంగములను నేర్చి విద్యాస్నాతకుఁ డైనవానిపరముగా నర్థమును సమర్థించెను. (1) నాఁటినుండియే యాంధ్రులకు నీచత్వబోధకమగు వ్రాత్యత్వము తొలఁగిన దని చెప్పవలసి యున్నది.

---

(1) వ్రత=బ్రహ్మచర్య వ్రతమువంను, సాధువు=సమర్థమైనవాఁడు; వ్రాత్యుఁ డనఁబడును; అతఁ డేవ్రాత్యుఁ డనఁబడును; అనఁగా బ్రహ్మచర్యమున వేదవేదాంగములు నేర్చి స్నాతకవ్రతము నొందినవాఁడు.

మహాభారతయుద్ధానంతరమునను, ఆపస్తంబునకు బూర్వమునను, సంభవించిన స్త్రీపురుషులలో గల విరుద్ధధర్మములను శ్వేతకేతుమహర్షి నిర్బంధముతో నాఁటి,వివాహనిబంధనము నేర్పఱచె నని వ్రాసియున్నాముగదా! ఆకాలమున దేశమునం దార్యజాతితక్కువసంఖ్య గలదిగా నుండుటచే స్వజాతి నభివృద్ధిపఱచుకొనుటకై మహర్షులు సంతానము లేని పురుషుఁ డెట్లయిన స్వవంశమును నిలుపుకొనుటకై నియోగపద్ధతి నంగీకరించిరి. అందు యాజ్ఞవల్క్యుఁడు,బోధాయనుఁడు ముఖ్యులు. వారుతమ స్మృతులలో నీయంశమును స్పష్టముగా వ్రాసిరి. పై నియోగపద్ధతి వలన బెక్కు లవినీతికర కార్యములు జరుగుచుండుటఁ జూచియు, అనులోమ ప్రతిలోమ సంకీర్ణసంతతులవల్ల కల్గు విద్వేషములఁ జూచియు నాపస్తంబమహర్షి నియోగపద్ధతి యొంతమాత్రమును గూడదనియు, స్త్రీపురుషనియమము యావజ్జీవము దంపతులకు నుండవలయు ననియు, వివాహపద్ధతిలో కర్తవ్యమైన నిబంధనముల నేర్పఱచి బ్రతికినన్నినాళ్లు తనభార్యను జాగ్రత్తగాఁ గాపాడుకొని పోషించువిధులను బురుషునకును, భర్త యానతి ననుసరించి ధర్మము నాచరింపఁదగు విధములను స్త్రీకిని నేర్పఱచుటయేగాక, యథావిధిని వివాహితులైన దంపతులు పై విధులకు వ్యతిరేకించినచో శిక్షార్హులనికూడ శాసించెను. పరలోకభీతి కల్గించునట్లు స్మృతిలో నిరూపించెను. అన్యభార్యను మోహించువానికిఁ గీడు కల్గించు నభిచారహోమాదులును,

రాజదండమును, స్త్రీకిఁగూడ నట్టిదండనమును జెప్పెను. అను లోమ ప్రతిలోమ వివాహాదనితులు ధర్మకార్యార్హులు కారని నిరూపించెను.

మఱియు గార్హస్థ్యమె బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమముల నుండువారి కాధారమైనదగుటచేత గృహస్థుఁడు పరమార్థచింతతోఁ, దయాధర్మబుద్ధులతో, నితరాశ్రమముల నుండువారికిఁ జేయఁదగు విధులను జక్కఁగా నేర్పఱచెను.

ఇట్లే వానప్రస్థసన్యాసాశ్రమముల నుండువారును స్వాశ్రమకర్మములను నిర్వహింపుచు శక్తికొలది జాతిమతోద్ధరణముల నొనర్చు బోధనాదుల నొసఁగు కట్టడులను జేసెను.

రాజు దేశారాధకుఁడై ప్రజలు వృద్ధి నొందు కార్యములఁ జేయవలయు ననెను. తనరాజ్యమున నెవరును, అన్నవస్త్రములకు లోపము లేకుండగ నుండునట్లును, శీతాతపవాతములకును, ఆధివ్యాధులకును లోను గాకుండునట్లును, రాజు పరిపాలింపవలయు విధుల నేర్పఱచెను.

రాజునకు 'బాలురు, వృద్ధులు, స్త్రీలు, కర్మకరులు, అంగవికలులు, మతప్రవర్తకులగు శ్రోత్రియులు, విద్యార్థులను బోధించువారు నేవిధమగు పన్నులను నీయనవసరము లేదనియు—వ్యవసాయకులు తమపంటలో నాఱవవంతును, వర్తకులు తమలాభములో నిరువదవవంతును బన్ను నిచ్చుకొను విధులను జేసెను. మఱియు రాజు, నగరగ్రామాదులను

న్యాయముగాఁ గాపాడు నధికారుల నాయాస్థలములకు నియమింపవలయు ననియు—(1) గ్రామమునందును, దానికిఁ జుట్టును గ్రోశములోపలను గ్రామస్థులయాస్తిని జోరు లపహరింతురేని యాద్రవ్యము నాగ్రామరక్షణమునకై నియోగింపఁబడిన రాజపురుషుఁడు తానే నష్టపడినవానిద్రవ్యము నిచ్చుకొనవలె ననియు—అట్లే పట్టణపాలకుఁడు తననగరమునందును దానికిఁ జుట్టును యోజనము మేరను నెవనియాస్తియైనఁ జోరాపహృత మగునచో దాని నానగరపాలకుఁ డిచ్చుకొనునట్లును—శాసన మొనర్చెను.

మఱియు రాజు, తనదేశమునందలి ప్రజలకు రెండేండ్లకాలము సరిపడు ధాన్యమును నిలువ యుంచుకొనవలె ననెను. వర్తకుఁడు తనదేశమునందలి యమూల్యములగు సువర్ణరత్నాదులను బరదేశీయులకు విక్రయింపకుండఁగ, రాజు చూచుచుండవలె నని చెప్పెను. ప్రజలవివాదములఁ దీర్ప నాయాప్రదేశములలోని విద్వాంసులు, పెద్దలు సభచేసి న్యాయములఁ దీర్ప నాతీర్పులప్రకారము రాజు శిక్షాదులఁ జేయవలె ననెను.

ఆపస్తంబునకుఁ బూర్వమున 'ద్యూతము,మద్యపానము, గోవధము' విశేషముగాఁ బ్రబలి యుండెను. ఒక్కసారిగా వాని నన్నింటిని నిర్మూలింప వీలు కాదని తలంచికాఁబోలు

(1) ఈపద్ధతి హైదరాబాదు మైసూరు సంస్థానములలోని కొన్ని గ్రామములలో ముప్పదియేండ్లనాఁ డీగ్రంథకర్త చూచియున్నాఁడు.

ద్యూతపానగోవధములకు విశేషము లగు కట్టుబాటులఁ జేసి, పై కార్యములు జనసామాన్యమున కందుబాటు కాకుండు విధానముల నేర్పఱచెను. మతక్రియలలో వానికి సంబంధము గల్గించెను.

ఇట్లు పరహితైకబుద్ధితో—లోకాభివృద్ధి యగురీతిని — స్వజాత్యభివృద్ధిదృష్టిని సమాధినిష్ఠాగరిష్ఠుఁ డగు నాపస్తంబుఁడు గృహ్యధర్మసూత్రములఁ జేసి, తనయేలిక యగు 'యౌగంధరి' రాజాన్మ్యతిప్రకారము రాజ్యముఁ జేయునట్లుగాఁ బ్రోత్సహించెను. యౌగంధరి పై రీతిని బ్రజాపరిపాలన మొనర్చి, ప్రజామోదమును, దేశాభివృద్ధిని నొందించుటచే 'సాల్వ' దేశీయులు తీరుఁబడికాలములలో—ఉత్సవసమయములలో— యమునానదీతీరమునం జేరి, కొందఱు 'రాసక్రీడ' రీతిని మఱికొందఱు 'కోలాటము వేయుపద్ధతిని గుండ్రముగాఁ దిరుగుచు, మఱికొందఱు కూరుచుండియు నానందముతో నీక్రిందిరీతిని బాడుకొనుచుండెడివా రఁట!

(1) యౌగంధరియే మారాజు; మారాజు; మారాజు;
యౌగంధరియే మారాజు

---

(1) ఏకాగ్నికాండమంత్రప్రశ్నములలో నీయర్థము గలమంత్రము నాపస్తంబుఁడు విధితోఁగూడఁ జెప్పెను. ఈమంత్రము సాల్వదేశీయులకు మాత్రమే యనెను. గృహ్యసూత్రకర్త లెవరును నీమంత్రమును సాల్వదేశ నామమునుగూడఁ దలంపలేదు.

యాగంధరియే మాసాల్వులరాజు; మాసాల్వులరాజు;
మాసాల్వులరాజు

అని లయవేయుచుఁ బాడుచుండి రఁట !

ఆపస్తంబుఁ డింకను యజుర్వేదములోని 'తైత్తిరీయ' శాఖ ననుసరించి అనేకవిధము లగు యజ్ఞములను జేయుటకుఁ శ్రౌతసూత్రములను, యాగవేదికలను వేయుటకును, భూమిఁ గొలుచుటకును ననువైన క్షేత్రరేఖాగణితసంబాధములు గల 'శుల్బ'సూత్రములను రచించెను. వేదీనిర్మాణవిధులలో శిల్పాభివృద్ధి హేతువులకుఁ బునాదులు వేసెను. నీచకర్మలు కలవా రని, బాహ్యజాతివా రని; శాపదగ్ధులని మన్వాదులు నిరసించిన మన యాంధ్రజాతిజులను ఘనులనుగాను, మహోత్కృష్టజ్ఞానులనుగాను, బలపరాక్రమవంతులనుగాను, బ్రపంచప్రసిద్ధులనుగాను జేసిన యాపస్తంబుఁడు 'ఆంధ్రపిత'యై యొప్పుఁగదా !

సాల్వదేశము డేరాఘాన్ జిల్లాలో 'జాన్సార్ బావార్' అను ప్రదేశమై యమునాతీరమున నుండె నని 'ఇండియన్ హిస్టరీ ఎకాడమీ శక్రటరీ' యగు పండిత జయచంద్రగా గ్రంథకర్త కీనడుమను (ది 25-7-41 తేదీని) వ్రాసియున్నారు.



# * కాత్యాయనచరిత్రము

——— :O: ———

కాత్యాయనునికి వరరుచి యనియు, వార్త్తికకారుఁ డనియు నామాంతరములు గలవు, పాణినిసూత్రముల కితఁడు వార్త్తికములు వ్రాయుటచే నీతనికి వార్త్తికకారుఁ డనుపేరు గలిగినది. ఈతనిచరిత్రమును సోమదేవభట్టారకుఁ డిట్లు వర్ణించి యున్నాఁడు.

వరరుచి పూర్వజన్మమునఁ బుష్పదంతుఁ డను ప్రమథుఁడు. భగవంతుఁ డగు శంకరునియనుగ్రహమునకుఁ బాత్రులైన ప్రమథులలో నీతఁడే యగ్రగణ్యుఁడు. ఒకప్పు డీపుష్పదంతుఁడు శివుని సేవించుటకు వచ్చి ద్వారపాలకుఁడగు నందిచే నివారింపఁబడియు స్వామిదర్శనకుతూహలాయత్తచిత్తుండై తన యోగవిద్యాప్రభావంబున నందికన్నులకుఁ గనఁబడకుండ నంతఃపురంబునఁ బ్రవేశించి పరమేశ్వరుఁడు పార్వతీదేవితోఁ జెప్పుచున్న యత్యద్భుతమైన 'విద్యాధరచరిత్రము'ను వినెను. ఇట్లాచరిత్రమును విని వచ్చి తనభార్యతో నాకథ నంతయు సవిస్తరముగ నుడివెను. పిదప నొకప్పు డీతనిభార్య 'జయ' యను నామె పార్వతికిఁ బరిచర్యఁ జేయఁ బోయి తాను వినిన యాచరి

---

* ఈకథ వేంకటరామకృష్ణగ్రంథమాలనుండి గ్రహింపఁబడినది.

త్రియు నామెయొద్దఁ జెప్పెను. పార్వతి యది విని యప్పుడ భర్త కడ కరిగి 'నీ వపూర్వ మని నాతోఁ జెప్పిన విద్యాధరచరిత్రము ద్వారపాలిక యగు జయకుఁగూడఁ దెలిసినదే సుమీ' యని కోపముతోఁ బలికెను. పరమేశ్వరుండును దివ్యదృష్టిచే జరిగిన సమాచారమంతయుఁ దెలిసికొని 'పార్వతీ! నీవేల కోపించెదవు? నీతో నే నాకథఁ జెప్పునపుడు పుష్పదంతుఁ డదృశ్యస్వరూపుఁడై వచ్చి యది వినెను. పిమ్మట భార్యతోఁ జెప్పెను. అంతియకాని యిది మఱియింకెవరికిని దెలియదు.' అని బదులు చెప్పెను. అది వినినతోడనే పార్వతీదేవి మనుష్యుల భంగినైన చాపలముచేఁ బుష్పదంతుఁ డిట్టిరహస్యమును వెలిఁ బుచ్చి యుండుటంబట్టి 'మనుష్యలోకంబున మానవుండై యుండుఁగాక' యని శపియించెను, తచ్ఛాపానుసారంబుగఁ బుష్పదంతుఁడు మధ్యమలోకము నొంది భరతవర్షమందుఁ గౌశాంబీనగరమున 'వసుదత్త సోమదత్తుఁడు' నను దంపతులకుఁ బుత్త్రుఁడై జన్మించెను.

అతఁడు నోరెఱుంగని పసివాఁడుగా నున్నప్పుడే యాతని తండ్రి పరలోకగతుఁ డయ్యెను. భర్త్రువిరహవిహ్వల యైనను దల్లి ధైర్యము నవలంబించి యెట్లో కష్టమునఁ గుమారుని బెంచుకొనుచు దారిద్ర్యము ననుభవించుచున్నను శక్త్యనుసారముగ భూతబలి యతిథిపూజ దేవతారాధనము మున్నగు సత్కార్యముల నొనర్చుచుఁ గాలము గడపుచుండెను. ఆపిల్లవాఁడు

కష్టసుఖముల నెఱుఁగనివాఁ డగుటచేఁ బట్టణమున నచ్చటచ్చట జరుగుచుండు సభలకు సంతోషపూర్వకముగఁ బోవుచు నచటఁ దాను వినివచ్చిన సంగతులను దల్లితోఁ జెప్పుచు నామెకుఁ దనయెడలఁ గల ప్రేమాతిశయము నినుమడించుచు శుక్లపక్ష చంద్రునివలె దినదినము వృద్ధినొందుచుండెను.

ఒకప్పుడు వ్యాడి, ఇంద్రదత్తుఁడు నను బ్రాహ్మణు లిరువురు దేశసంచారము నొనరించుచు మార్గవశమున నాపట్టణమునకు వచ్చి యానాఁటిరాత్రి నచటఁ గడపఁదలఁచి మనకథానాయకుని యింట విడిసిరి. తరువాత నాయింటి యిరుగుపొరుగువా రాపిన్నవాని గుణవిశేషములును బుద్ధిసూక్ష్మతయు నేకసంధాగ్రాహిత్వమును గొనియాడుచుండుట విని ముచ్చటపడి వా రాతని బరీక్షించుటకుఁ బ్రాతిశాఖ్య మను నొకగ్రంథము నొక్కపరి పఠింప నది విని ధారణఁ జేసి వెంటనే మఱల నీతఁడు చదివెను. అప్పు డాబ్రాహ్మణు లాతఁ డేకసంధాగ్రాహి యగుటఁ దెలిసికొని యబ్బురపడి యతనితల్లి వసుదత్తతో, ఓ సాధ్వీమణీ! నీకుమారుఁడు సాధారణుఁడు గాఁడు. ఇట్టిపిల్లవాని వెదకుటకే మేము దేశసంచార మొనర్చుచుంటిమి. మానివాస స్థలము వైతసపురము. బాల్యమందే మాతలిదండ్రులు స్వర్గస్థులగుటచే మే మనాథుల మైు మాతండ్రి సంపాదించిన ద్రవ్య ముండుటచే ధనార్జనముసేయు వృత్తి నవలంబింపక విద్యాధనమును మాత్రమే సంపాదింపఁ దలంచి తపమువలనఁ గాని యెట్టి

కార్యమును సిద్ధింపదని యెంచి యేకాగ్రచిత్తుల మై కుమార స్వామి నారాధించితిమి. మాతపమునకు మెచ్చి భగవంతుఁ డగు షణ్ముఖుఁడు స్వప్నమున సాక్షాత్కరించి ,,నందమహారాజు పాలించుచున్న పాటలీపుత్రమునకుఁ బోయి వర్షుఁ డను పేరుగల బ్రాహ్మణునివలన విద్యాభ్యాసము సేయుఁ" డని యాదేశించెను. మే మాతని యాదేశమును శిరసావహించి వచ్చి యామహాపట్టణమున వర్షుం డెచ్చోటనుండెనో యని యన్వేషించుచుండ నొకచోటఁ గొందఱుమనుజులు గుమిగూడి ప్రసంగవశమున ,,నీపట్టణమున వర్షుఁడను మూర్ఖబ్రాహ్మణుఁడుగలఁ" డని చెప్పుకొనుచుండిరి. మేమది విని యా జనసంఘమువలన వర్షుని నివాసస్థలమును సాభిజ్ఞానముగ నెఱిఁగి పట్టణమున నొకమూల నెలుకకన్నములును గూలుచున్న గోడలును శిథిలమైనకప్పును గలిగి యాపదలకుఁ బుట్టినిల్లనఁ దగియున్న యొక గృహమును జూచితిమి. అదియే మేము పోఁదలఁచుకొన్న వర్షునియిల్లు. మే మాయింటఁ బ్రవేశించునప్పటికి వర్షుఁడు కన్నులు మూసికొని ధ్యానముఁ జేయుచుండెను. అతనిచెంత ధూళిధూసరమైన శరీరమును జినిఁగిపోయిన మలినవస్త్రమును గలిగి వర్షగుణానురక్తయై యాతని వరింపఁదలంచి మూర్తీభవించి వచ్చిన దుర్గతియో యనునట్లున్న వర్షునిభార్యను జూచి నమస్కరించి వచ్చినపని నంతయుఁ జెప్పితిమి. అప్పుడామె ,, నాయనా! మున్నీపురంబున శంకరస్వామి యను బ్రాహ్మణోత్తముఁ డుండెను. ఆతని

గర్భమున మూర్ఖుఁడు దరిద్రుఁడు నైన యీ వర్ధుఁడు పుట్టెను. ఈతనికి బుద్ధిమంతుఁడును ధనవంతుఁడు నైన యుపవర్షుఁ డను తమ్ముఁడు గలఁడు. ఒకప్పుడు వర్షుఁడు నాకొడికొడ లిచ్చిన నీచదానమును దక్షిణకాసపడి ప్రతిగ్రహించి నాయొద్దకుఁ దీసికొనివచ్చెను. నేనప్పు డీతని మిగుల నిందించితిని. ఆనిందా వాక్యముల విని యీతఁడు మిగుల విచారించి విద్యాగంధము లేకుండుటచేతనే గదా యిట్లీఁడుదానిచే మాటలు పడవలసి వచ్చెనని పశ్చాత్తాపపడి నిశ్చలచిత్తుండయి కుమారస్వామి నారాధించెను. ఆ దేవుఁడును సదయహృదయుఁడై సమస్త విద్యలు నీతనికిఁ బ్రసాదించెను. ఇదియుంగాక తొలుదొలుత నీవిద్యలనెల్ల నొక యేకసంధాగ్రాహియగు బాలుని కుపదేశింపు మని యానతిచ్చెను. భగవంతుని యాజ్ఞానుసారముగ నడచు కొనుటకై యిట్లు రేపగలు ధ్యానము సేయుచున్నాఁడు. కావున మీకీయనయొద్ద విద్యాభ్యాసముఁ జేయుతలంపు గలదేని యట్టి బాలకుని గొనిరం" డని చెప్పెను. వల్లెయని మే మామెకుఁ గొంతధన మిచ్చి బయలుదేఱి భూవలయము నెల్లఁ దిరిగితిరిగి మాకట్టిబాలకుఁ డెచ్చటను లభింపకపోవుటచే విసిగి వేసారి తుదకుఁ బుణ్యవశంబున నిచట నీబాలకుని బడయఁ గంటిమి. కావున నీపిల్లవానికి విద్యాభ్యాస మొసర్చుట కాజ్ఞ నిమ్ము." అనిచెప్పిరి.

వసుదత్తయు వారివచనముల నాదరించి తన కుమా

రుఁడు పుట్టినప్పు డశరీరవాక్కు లాగఁ జేకసంధాగ్రాహియై వర్షునివలన విద్యాభ్యాస మొనర్చుననియు, వ్యాకరణశాస్త్రము లోకమునఁ బ్రతిష్ఠించుననియు వరరుచి యను పేరితనికిఁ దగి యుండు ననియుఁ జెప్పిన సమాచారమును వారికిఁ దెలియఁ జేసి సంతోషపూర్వకముగఁ దన కుమారుని వారిచేతులలో నొప్పగించెను. వ్యాడింద్రదత్తులును సంతోషముతో గొప్ప యుత్సవముఁ జేయించి వసుదత్తకుఁ బరాపేక్ష లేకుండఁగ జీవిం చుటకుఁ దగినంత ధన మిచ్చి యానందబాష్పతరంగితలోచన యగు నాపెయొద్ద సెలవుఁ దీసికొని వరరుచిని వెంటఁ బెట్టికొని పాటలీపుత్రమునకు వచ్చి స్వర్షు నివాసస్థలమునకుఁ బోయిరి.

వర్షుఁడును వ్యాడీంద్రదత్తులచే నా చిన్నవాని వృత్తాం తము నెఱింగి సంతసించి కరుణారసభరితములైన వీక్షణము లచేఁ గొంతతడవు గనుఁగొని తనివిసనక „ వత్సా ! రమ్మ." అని చేరఁదీసి బిగ్గఁ గౌఁగిలించుకొని యా వెంటనే యొక పరి శుద్ధస్థలమునఁ గూరుచుండి మృదుమధురగంభీరం బగు నెలుంగు సెలంగ నోంకారపూర్వకంబుగా సాంగోపాంగములైన సమస్త వేదములను జెప్పుట కుపక్రమించెను. ఒకసారి చెప్పినప్పటికి వరరుచియును రెండుమాఱులు వినునప్పటికి వ్యాడియు మూఁ డుపర్యాయములు పఠించునప్పటి కింద్రదత్తుఁడును గ్రహించు చువచ్చిరి. అప్పుడు వర్షుని గృహమునుండి మున్నెన్నఁడును వినని యత్యద్భుతమైన ధ్వని వెలువడి భూనభ్యాకాశములు

నించెను. వర్షుని తమ్ముఁ డుపవర్షుఁడును బట్టణమున నివసించి యున్న జనులును విస్మితులై వర్షుని ప్రభావమును వర్ణించుచుఁ బట్టణమున నెల్లచోటులఁ బెద్ద యుత్సవములు సేసిరి. తత్పురాధీశ్వరుఁడైన నందుఁడును షణ్ముఖప్రసాదలబ్ధవిద్యాసాంప్రదాయుండైన వర్షోపాధ్యాయుని గనుఁగొని సంతసించి యాతని యింట సువర్ణవర్షమును గురిపించెను.

ఇట్లు కొంతకాలము వర్షోపాధ్యాయునియొద్ద విద్యాభ్యాసముచేయుచుండఁ గాలక్రమంబున మనకథానాయకుఁడు బాల్యావస్థఁ గడచి సమస్తవిద్యాపారంగతుఁ డయ్యె.

పిమ్మట నొకప్పు డితఁడు సహాధ్యాయుఁడైన వ్యాడేంద్రదత్తులతోఁ గూడి యింద్రోత్సవముఁ జూడఁ బోయి యం దొక్కయెడ సర్వాలంకారభూషితయై చెలికత్తెయలతోఁ గూడి సల్లాపములాడుచుఁ బుడమియందు సంచరింప వచ్చిన రతీదేవియో యన నొప్పుచున్న యొక్కకన్నియను గనుఁగొనెను. చూచినతోడనే యీతనిహృదయము నా లతాంగి దొంగిలించెను. శూన్యహృదయుఁడైన వరరుచి " మిత్రమా! ఇంద్రదత్తా! మదీయచిత్తము నాకర్షించి పోవుచున్న యీ కన్నెమిన్న యెవ్వతె?" యని యడిగెను. ఇంద్రదత్తుఁడు పట్టణవృత్తాంతము నెఱిఁగినవాఁడగుటచే "నామె మనయుపాధ్యాయుని తమ్ముఁడగు నుపవర్షుని కూఁతు" రని చెప్పెను. అది మొద లాతఁడు తదాసక్తంబగు చిత్తంబును మఱలింపఁజాలక

నిశ్చేష్టుండై యాపూర్ణచంద్రముఖినే ధ్యానించుచు జగమెల్లఁ దన్మయముగ భావించుచు నారాత్రియెల్ల జాగరమొనరించెను.

వేకువజామునఁ గొంచెము నిద్రపట్టుచుండ స్వప్నమునఁ దెల్లని వస్త్రమును ధరించిన యొక దివ్యవనిత యాతనికిఁ గనఁబడెను. ఆమె యాతని నూఱడించి ,, నాయనా! నేను నీలో నున్న సరస్వతిని. నీవు నిన్న నింద్రోత్సవమునఁ జూచి మోహించిన ,,యుపకోశ'' యను మహిళారత్నము పూర్వజన్మమున నీకు ధర్మపత్ని. ఆమె యీజన్మమునఁ గూడ నిన్నే వరించును గాని యన్యు నిచ్ఛగింపదు. నీ వేలవిచారించెదవు?''అని చెప్పి యంతర్ధానము నొందెను. వరరుచి మేల్కాంచి వెంటనే తన ప్రియురాలి యింటికి సమీపమున నున్న మావిగున్నయొద్దకుఁ బోయి యచ్చటఁ గూరుచుండెను.

ఇట్లు కొంత తడవు వచ్చి యున్న పిదప నుపకోశసఖిజనము వచ్చి చూచి''యొంటిగ నిచ్చటఁ గూరుచుండ నేమి? విచ్చేయుఁ'' డని యాతని నుపకోశాగారమునకుఁ దీసికొనిపోయిరి. వరరుచి యుపకోశకుఁ దనయెడఁగల యనురాగాతిశయము నెఱింగినవాఁడయ్యును గురుజనానుజ్ఞయగు నాలకన్యకను బరిగ్రహించుట కనుమతింపఁ డయ్యెను. అట్లు పరిగ్రహించుట శాస్త్రకాముకులైన వివేకులకు క్షేమకరముగా దని యాతని యభిప్రాయము.

తరువాత నుపకోశతల్లి తనకూఁతునకు వరరుచియందుఁ గల యనురాగాతిశయము నెఱింగి భర్తకును బావగారికిని దెలి

యుం జేసెను. వర్షోపవర్షులును వరరుచి సత్కులప్రసూతియు గుణసంపదయు బుద్ధిసూక్ష్మతయుఁ దెలిసినవారలే కావునఁ దమ కొమార్తెకుఁ గట్టి వరలాభము గలిగిన దుల కెంతయు సంతసించి యన్యోన్యానురక్తులైన యీవధూవరులకు వివాహము చేయుటకు నిశ్చయించి వ్యాడిని కౌశాంబీనగరమునకుఁ బంపి వరరుచి తల్లియగు వసుదత్తను రప్పించిరి. తల్లి యనుమతినిగూడఁ గైకొని మనకథానాయకుఁడు శుభముహూర్తమున నుపకోశా పాణిగ్రహణ మొనర్చి తానును దల్లియు భార్యయు నచ్చటనే సుఖముగ నుండిరి.

ఇది యిట్లుండఁగాఁ గొంతకాలమునకు వర్షోపాధ్యాయుని విద్యావిశేషమునఁ బొడమినకీర్తి సమస్తదిక్కులయందును వ్యాపించెను. శిష్యసమూహము ప్రతిదినమును వృద్ధి యగుచుండెను. వర్షోపాధ్యాయునియొద్ద విద్యాభ్యాసముఁ జేయ వచ్చిన శిష్యు లందఱు సూక్ష్మబుద్ధిగలవారలై యుండిరి గాని వారిలోఁ బాణిని యను నొక్కవిద్యార్థిమాత్రము మిగుల మందబుద్ధిగలవాఁడై యుండెను. అతనిఁ జూచి తక్కిన సహాధ్యాయు లందఱుఁ బరిహాసించుచుండెడివారు. ఇట్లుండ గురుశుశ్రూషాతత్పరుండైన పాణినిఁ జూచి గురుపత్ని జాలిపడి "నాయనా! పాణినీ! నీ కీవృథాపరిశ్రమమువలన నేమియుఁ బ్రయోజనము లేదు. దేవతానుగ్రహము లేక నీవు విద్య సంపాదింపనేరవు.

కావున నీ విట్టి యడియాసలను విడిచి సర్వేశ్వరు నారాధింపుము." అని యుపదేశించెను.

ఆమాటలు విని నిర్విణ్ణుండై పాణిని గురుపత్నికి నమస్కరించి గుర్వాజ్ఞ వడసి హిమాలయపర్వతముమీఁదకుఁ బోయి యచ్చట నిశ్చలచిత్తుండై యీశ్వరునిగూర్చి తపం బొనరించి యాతని యనుగ్రహమున సమస్తవిద్యలకు నాధారభూతంబైన వ్యాకరణశాస్త్రమును బడసి మరలఁ బాటలీపుత్రమునకు వచ్చి వరరుచిని వాదమునకు రమ్మని పిలిచెను. వరరుచియు నాఁడును శాస్త్రవాదమునకుఁ బ్రారంభించి యేడుదినములు వాదించిరి. అష్టమదినంబున మునవరరుచి పాణినిని జయించెను. అప్పుడు శివుం డాగ్రహగ్రస్తుండై తా నుపదేశించిన వ్యాకరణమునకు నైంద్రవ్యాకరణముచేఁ బరాజయము సంభవించె నని పెద్దహుంకారము చేసెను. ఆహుంకారము బయలు వెడలిన వెంటనే భూమియం దైంద్రవ్యాకరణము నశించెను. అప్పుడు వరరుచి మున్నగువార లెల్ల "వైయాకరణఖసూచులై" పాణినిచేఁ బరాజితులైరి. ఇట్లాకస్మికముగఁ దటస్థించిన యత్యాహితమును సహింపఁజాలక వరరుచి తాను సంపాదించిన ద్రవ్యమును హిరణ్యగుప్తుఁడను వైశ్యునకు దాఁచ నిచ్చి యా సమాచారమును రహస్యముగఁ దనభార్యతోఁ జెప్పి యామె యనుమతిని గైకొని శివునిఁ గూర్చి తపముఁ జేయుటకు హిమాలయపర్వతమునకుఁ బోయెను.

తనభర్త యిట్లుగ్రమైన తపముఁ జేయుటకు దూరదేశ మునకుఁ బోయెనుగదా? యని యుపకోశ "భర్తకు సర్వవిధ ముల భగవంతుఁడు సౌఖ్యముల నొసఁగుఁగాక" యని ప్రతి దినమును సర్వేశ్వరుని ధ్యానించుచు నియమవ్రతముల నాచ రించుచు నుండెను. ఒకప్పుడు ప్రకృతిసౌభాగ్యసుందరవదనార విందయగునుపకోశ గంగాసమీపమున కరుగుచుండ రాజపురో హితుండును సేనాధిపతియు మంత్రికుమారుఁడును దైవవశమున నామెను గనుఁగొని దుర్బుద్ధులై మోహపరవశులై యామెను బలాత్కారముగ నైనను బరిగ్రహింపఁదలఁచి యాసమీపమున వేచియుండిరి. ఉపకోశయు సభక్తికముగ నాపుణ్యానది నవగా హనముఁ జేసి గృహమునకుఁ బోవుటకు బయలువెడలెను. అం తలో సాయంకాల మయ్యెను. అప్పు డాసమీపమున వేచి యున్న దుర్మార్గుఁడగు కుమారసచివుఁ డాకస్మికముగ వచ్చి మార్గమధ్యమున నాసాధ్విమణి నడ్డగించెను. అప్పు డామె యన న్యశరణయై తన్నట్టియాపత్సముద్రమునుండి యుద్ధరించుకొను టకుఁ దగిన యుపాయమును జింతించుచు ధైర్యము నవలం బించి దైవవశమునఁ దనకుఁ దోఁచిన యొకయుపాయమున నాదుర్మార్గుని బారినుండి తప్పించుకొనఁదలఁచి యల్లన వానితో నిట్లనియె:—"ఓయీ! నేను సద్వంశమునఁ బుట్టినదానను. నాభర్త యిప్పుడు పరదేశమునకుఁ బోయియున్నవాఁడు. నీవు నన్ను బలాత్కరించుట కిసమయముగాని యీప్రదేశముగాని

యుచితమైనదికాదు. నీకు నాయందు దృఢమైన యనురాగ ముండెనేని రేపురాత్రి మనయూరి వారందఱు మధూత్సవముఁ జూడఁబోవుదురు గావున నీవు జాముచాత్రి కాకుండ మాగృహ మునకు రమ్ము." అన వాఁడామాటలకు సమ్మతించి యట్లే యగుఁ గాక! యని యనుమతించి వెడలిపోయెను. తరువాత మఱి కొంతదూరము పోవునప్పటికి రాజపురోహితుఁడు వచ్చి యడ్డగించెను. వానినిగూడ నట్లే రేపురాత్రి రెండవజామున రమ్మని చెప్పి పుచ్చెను. మఱికొంతదూరము నడచునప్పటికి సేనాధిపతి వచ్చి బలాత్కరించెను. యథాపూర్వముగనే వానినిగూడ సమాధానపఱిచి మూఁడవయామమున రమ్మని చెప్పి పంపెను.

ఇట్లాదురాత్ముల చేతులలోనుండి బయటఁబడి, తనభాగధేయమునే మాటిమాటికి దూఱుచు "హా! కృతాంత! నన్నిట్లు దుర్మార్గుల వాతఁబడ జేసెద వేమి? నే నీక్షణభంగురమగు శరీరము విడిచెదనుగాని యుత్తమచారిత్రమును మాత్రము విడువను జుమీ" యని మనంబునఁ జింతించుచు నంత కంత కధికమగు దుఃఖమున మిత్రుల నేడ్చెను. చేటిక లుపకోశ నూఱడించి "ఈదురాత్ము లిట్లు వచ్చి తమ నడవడికిఁ దగిన ఫలము ననుభవింతురుగాక!" యని పలికిరి. సతీలలామయగు నుపకోశయు మఱలమఱలఁ దనశరీరమునుగూర్చి దుఃఖించుచు, జీవితేశ్వరు సుగుణములఁ దలంచుకొనుచు నిరాహారయై యా రాత్రి నాల్గుజాములను నాల్గుగడియలవలెఁ గడపెను. ప్రాతః

కాలమున బ్రాహ్మణపూజకొఱకుఁ గొంత ద్రవ్యముఁ గొని తెమ్మని యొకచేటికను హిరణ్యగుప్తునికడ కంపుటయు నాకో మటి స్వయముగానే వచ్చి యుపకోశను రహస్యమునకుఁ బిలిచి "ఓకాంతామణీ! నీ లావణ్యాతిశయమున మోహితుఁడనైన నన్ను సేవేలికొనుము. లేనియెడల సాక్షికముగ నీభర్త దాఁచ నిచ్చినధనము నొసంగ నని లక్ష్య విడిచి ప్రేలెను. పిడుగుచే నడఁ పఁబడినదానివలె నుపకోశయు వణఁకుచు నొక్కక్షణ మేమి సేయుటకుఁ దోఁపక "ఏమిగదా? ఈజాల్ముఁడు నాదుర్భాగ్యము లనే యనుకరించుచున్నాఁడు" అని తనహృదయమునం జిం తించుచు మున్ను చెప్పిన రాత్రియందే నాల్గవజామున వానికిని సంకేత మేర్పఱిచెను.

అంత నిర్దేశింపఁబడిన యా రాత్రి వచ్చుటయు నేరుపు కత్తియలగు నుపకోశ చేటికలు ముందే యోచించి కస్తూరి మొదలగు పరిమళవస్తువులను, తైలమును గూర్చిన కాటుకను దానిచేఁ బులుమఁబడిన గుడ్డపీలికలను సన్నద్ధముచేసి యింటి నడుమఁ బెద్ద మందస మొకటి యుంచి యా దుర్వినీతుల రాక కెదురుసూచుచుండిరి. మొదటిజామునఁ గుమార సచివుఁడు సర్వాలంకారభూషితుండై తన్నెవ్వరుఁ జూడకుండ నా సాధ్వీ మణి యింటఁ బ్రవేశించెను. "స్నానము సేయని నిన్ను మా స్వామిని స్పృశింప" దని చేటికలు పలుకుటయు నతఁడు 'నట్లే' యని వారితో లోపలకుఁ జని యంధకారబంధుర మగు నభ్యం

తరగృహమున వస్త్రాలంకారములను దీసి యా చేటికలచే నొసఁగఁబడిన కాటుక పూసిన పాత్రికను గట్టుకొని వా రిచ్చిన కాటుకను నఖశిఖపర్యంత మలఁదుకొని తన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచుకొనెను. ఇట్లతఁ డంధకారమునం దభ్యంగ సుఖ మనుభవించుచు నెడతెగక పొడము మనోరథపరంపరలచే బద్ధుండై మొదటిజాము గడచినను దెలిసికొనలేకపోయెను. రెండవజామున వచ్చిన పురోహితుని జూచి యాచేటికలు సంభ్రమముతో 'ఈ పురోహితుఁడు వరరుచి మిత్రము. మొదటఁ దెలియఁజేయకయే వచ్చినవాఁడు ఏమిసేయుదుము? ఇచ్చట నొకనిముసము డాఁగి యుండుము' అని పలుకుచు వాని నచట నున్న మందసములోఁ బెట్టి తాళమువేసిరి. అట్లే పురోధయు నా పనికత్తెలచేఁ బ్రలోభితుఁడై స్నానమిషమున లోనికిఁ గొంపోఁబడి, కాటుకచేఁ దల యంటుకొనుచు, దండనాయకుఁడు వచ్చినపుడు మొదటివానివలెఁ బెట్టెలో బంధింపఁ బడెను. దండనాయకుఁడును గాటుక పూఁతలచేతనే సంతసించుచుఁ గోమటి వచ్చినతోడనే మంజూషలోఁ బ్రవేశించెను. ఈ దురాత్ములు ముప్పురును మీఁదఁ దమకు లభింపఁ బోవు నంధతామిస్రవాసము నభ్యసించువారివలె నా పేటికయం దన్యోన్యము స్పృశించుచున్న వారయ్యు సిగ్గుచేతను భయముచేతను బరస్పరము సంభాషింపరైరి. తన శరీరమును, భాగధేయమును నిందించుకొనుచు మొగము వంచుకొని యున్న పతివ్రతాశిరో

మణి యగు సుపకోశయుఁ బనికత్తియలచేఁ జేరితయై యెట్లో ధైర్యముఁ జిక్కఁబట్టి యెదుట నున్న కోమటిని 'నా భర్త దాచనిచ్చిన ధనము నిమ్మని యడిగెను. 'అట్లే యిచ్చెద' నని యా జాల్ముఁడు పలుకుచుండ నాపె మంజూషను దట్టి 'ఓ గృహదేవతలారా! యీ హిరణ్యగుప్తుని వచనముల నాలకింపుఁడు' అని పలికెను.

అంత నభ్యంగ మొనరించుచున్న వైశ్యుఁడు 'రాత్రి ప్రభాతప్రాయ మయ్యెను. ధూర్తాగ్రేసరా! నీ యింటికిఁ బొమ్ము' అని పనికత్తెలచే బలాత్కారముగా మెడఁబట్టి గెంటఁబడి, యొడలునిండ మసితోడను, జిరిఁగిన కట్టుబట్టతోడను, సిగ్గువడుచు నింటికిఁ బోయి మసిఁ గడుగవచ్చిన దాసజనుల యెదుటఁగూడఁ దల యెత్తుకొనలేకపోయెను.

పిమ్మట సాధ్వీమణియగు సుపకోశ నందభూపాలునిభవనమున కేఁగి 'దేవా! హిరణ్యగుప్తుఁడు నాభర్త దాఁచ నిచ్చిన ధనము నపహరింపఁదలఁచియున్నాఁ' డని విన్నవించెను. రాజు వానిని వెంటనే రప్పించి యడుగ 'నీపె భర్త ధనము నాయొద్ద నించుకంతయు లేదని శపథపూర్వకముగా నాబచ్చు నుడివెను. అప్పు డామె 'మహారాజా! నాభర్తచేఁ బెట్టెలోఁ బెట్టి యుంచఁబడిన గృహదేవతలే యీవిషయమునందు సాక్షులు. వారల యెదుట నీతఁడు తనయొద్ద నున్న ధనమునుగుఱించి ప్రస్తావించి యున్నాఁడు. కావున నిది చక్కఁగా విచారింప

వలయు" నని పలికెను. అది విని రాజు విస్మితుఁడై భటులచే నామందసమును సభకుఁ దెప్పింప నాయుపకోశ "దేవతలారా! ఈకోమటి మీయొద్ద నేమనియెనో యది యెల్ల నిచటఁ జెప్పి పిదప మీరు మీ గృహంబుల కేగుఁడు" అని బిగ్గరగాఁ బలికెను. రాజసభలోఁ దమ రహస్యము బయలుపడునేమో? యని వడఁకుచు వారు "నిజముగ నీతఁడు తనయొద్ద నీపె ధనమున్న దని యంగీకరించె" నని చెప్పిరి అంత నా కోమటియు నిరుత్తరుఁడై యాద్రవ్య మంతయుఁ దనయొద్ద నున్న ట్లొప్పుకొనియెను.

పిమ్మట నా పతివ్రతను బ్రార్థించి యా మందసమును దెఱచుట కనుజ్ఞ వడసి నందమహారాజు భటులచే నా పెట్టె మూఁత నెత్తించుటయు, మసిముద్దలవలె నున్న దుర్మార్గులు మువ్వురు బయలుపడిరి. ఎట్టకేలకుఁ గొందఱు వారిని గుర్తించి చెప్ప సభ్యు లెల్లరు నొక్కపెట్టున నవ్విరి. రాజు విస్మితుఁడై యిది యేమి? యని యా సాధ్వి నడుగ నాపె జరిగిన వృత్తాంతము నంతయు నా సభ్యు లందఱు వినునట్లు చెప్పెను. వినినవారందఱు నామె ననేకవిధముల నభినందించిరి. నృపతియుఁ బరదారాసక్తులైన యాదుర్వినీతుల నలువురను దన దేశమునుండి వెడలఁగొట్టించి యుపకోశను సత్కరించెను. వర్షోపవర్షు లామె వృత్తాంతమును విని యానందించిరి. పౌరు లామెను బాతివ్రత్యదేవత యని యర్చించిరి. ఆమెయు ననుదినము భర్తృస్మరణ

పరాయణుఁడై తనయింట నుండెను. కాలక్రమమున హిమవత్పర్వతమునందుఁ దీవ్రతపముఁ జేయుచున్న వరరుచి పరమేశ్వరు ననుగ్రహమునఁ బాణినీయవ్యాకరణమునెల్ల సరహస్యముగఁ బడసెను. మహాదేవునానతి నతఁడనుక్తమును బూరించియు, దురుక్తమును సంస్కరించియు నాపాణినిశాస్త్రమునకు మెఱుఁగువెట్టెను. ఇట్లు గౌరీనాథుని ప్రసాదమువడసి ప్రతిభాశాలియై యుపకోశభర్త తుషారాద్రినుండి కొలఁదినాళ్ళకే యశ్రమంబునఁ బాటలీపుత్రము చేరెను. తల్లియు గురువులు నాతనిరాక నభినందించిరి. కాత్యాయనుఁడు వారల చరణములకు సాష్టాంగ మెరఁగి యద్భుతమగు నుపకోశావృత్తాంతమును విని విస్మయావిష్టుండై యట్టిధర్మపత్నిచేఁ దనగృహస్థధర్మము సఫలమయ్యెనని తలంచెను.

అంత వరరుచివలన, నూతనవ్యాకరణము వినఁదలంచిన వర్షునకు భగవానుఁడగు కార్తికేయుఁడే యదియెల్ల నెఱింగించెను. వ్యాడీంద్రదత్తులును వర్షోపాధ్యాయునితోఁ బాణినీయముఁ జదివిరి. పిదప వా రిరువురు వర్షునికి గురుదక్షిణ నొసగఁదలంచి తమ యభీప్సితము నాతనికినివేదించిరి. అదివిని వర్షుఁడు కోటిసువర్ణములఁగోరెను. వల్లెయని వారిరువురు నరిసికొని, వరరుచినిబిలిచి "మిత్రమా! మనయుపాధ్యాయుఁడు కోటిసువర్ణములు దక్షిణఁగోరెను. ఇంతబంగారము, నందభూపాలునికంటె వేఱొకనివలనఁ బడయసరిది. ఆతఁడు తొంబదితొమ్మిదికోట్ల సువర్ణములుగల

రాజు. మున్ను నీయిల్లాలాతనిచేఁ దోఁబుట్టువుగా నాదరింపఁ బడి నది. కావున నీగుణములకుఁ దనిసినయతఁడు నీవడిగిన దెల్లఁదప్పక యొసంగును. అతఁ డిపుడయోధ్య నున్నవాఁడు. రమ్ము చటికేఁ బోవుదము" అనివారు వచ్చిరి. పిమ్మట నాముగ్గురు సతీర్థ్యులు నయో ధ్యకరిగిరి. అక్కటకట! వీరాపురముఁ జొచ్చినతోడనే నందమహా రాజుకీర్తిశేషుఁ డయ్యెను. దానరాష్ట్రమున గొప్పయలజడి గలిగెను.

అంత నాముగ్గురును జింతాక్రాంత మానసులై చేయు నదిలేక విచారించుచుండ, యోగసిద్ధుఁడగు నింద్రదత్తుఁడు "మిత్రులారా! నాకొక యుపాయముతోఁచుచున్నది. మృతుం డగు నందమహారాజు కళేబరమును యోగమహిమచే నేను బ్ర వేశించెదను. అపుడు వరరుచి ధనమడుగుఁగాక! నేను మరలవ చ్చునంతవరకు నాశరీరము నీపాడు దేవళమునందుంచి వ్యాడి రక్షించుచుండవలయు" నని పలికెను. ఇంద్రదత్తుని పలుకుల కలరి వ్యాడియు వరరుచియు మేలు! మే! లనిరి.

నందమహారాజు ప్రాణముల వీడినతోడనే యెల్లచోటుల నోక్కపెట్టున హాహాకారములు బయలు వెడలెను. శకటాలుఁడు లోనగుమంత్రు లంతిపురికిఁ జని "అయ్యో! అయ్యో! ఇఁక నేమున్నది. దిక్కుమాలిన వారమైతిమి. నంద! నయనానంద! నిన్ను గోల్పోయిన మామనుగడయేల? ధర్మసేతువు తెగినది. వసుధ యనాథయైనది. విబుధులు నిరాశ్రయులైరి. సరస్వతి ని

రవలంబమైనది. లోకులు నిరుత్సాహులైరి. దుర్మతులు నిరంకుశులైరి. సత్కార్యములదృశ్యములైనవి. జగమెల్ల జీర్ణారణ్యమయినది" అని యనేకవిధములఁ బలవించుచున్న రాజపత్నుల నూఱడించిరి. కాని కాంతిహీనమై పుడమిపైఁ బడియున్న మహారాజు శరీరముఁ గనుఁగొన వారికిని, దుఃఖమాఁగినదికాదు. ప్రధానమంత్రియగు శకటాలుఁడు "మహారాజా! మమ్మునెల్లరనిట్లు వెతలఁబెట్టి, తపసుదారవోసికన్న యీపసివానిఁ జంద్రగుప్తుని శత్రువులవాతఁ బడవైచి, నీతోడిద లోకమనియున్న యంతఃపురకాంతలనైనఁ దలంపక యీ లోకము నెట్లువిడిచితి' వని వాపోవుచు సూక్ష్మదృష్టిచే నానృపాలుని బరికించి యాతనిమొగమునఁ జిఱునగవు పొడసూప నేమిది? యని యదరిపడి యతని శిరముఁ దాఁకెను. అప్పుడు నందుఁడు నిదురవోయి మేల్కొన్నట్లు కన్నులు తెఱచి "ఎందుల కీకోలాహలము? నేను మృతినొందలేదు. నూతేండ్లుఁ బ్రతుకఁ గోరెద" నని యల్లనఁ జెప్పెను.

"ప్రజలపుణ్యంబున నందమహారాజు జీవించియేయున్నవాఁడు. మహాత్ముఁ డెవ్వఁడో మనరాజును మఱల బ్రతికించెను." అని యనుచరులెల్లరు సంతోషభరితులైరి. మంత్రుల మొగములు తెలివొందినవి. అంతఃపురకాంతల డెందములానందతుందిలములైనవి. ఆపన్నసేవకుల చిత్తములు ముదాయత్తములైనవి. వందిమాగధుల వక్త్రంబులు జయశబ్ద

ముఖరితము లైనవి. రాజవైద్యు లందఱు ధన్వంతరిపోక్త మగు ధాతువిజ్ఞానము నభ్యసించుట వ్యర్థమని తలచుచుండిరి. దిఙ్ముఖములు మంగళవాద్యధ్వనిపూరితము లైనవి అంతట నొక ద్వారపాలకుఁడు సత్వరము వేత్రహస్తుఁడై వచ్చి 'మహారాజా! పాటలీపుత్రమునుండి సకలశాస్త్రపారీణుఁ డగు వరరుచి యను నొకబ్రాహ్మణోత్తముఁడు వచ్చి దేవరసందర్శనముఁ గోరుచు ద్వారమున వేచియున్నాఁ'డని విన్నవింప నందుఁడు 'భద్రా! యావిప్రుని శీఘ్రముగఁ బ్రవేశపెట్టు' మని యానతిచ్చెను. తరువాతఁ గొందఱు కొజ్జాలు వరరుచి నభ్యంతరమందిరము నకుఁ గొనిపోయిరి. కాత్యాయనుఁడు నందున కభిముఖుఁడై 'మహారాజా! నేఁ గార్యార్థినై వచ్చితి. దేవర మఱల జీవించుటచే నిప్పుడు మహోత్సవము జరుగుచున్నది. ఇట్టియభ్యుదయమున గురుదక్షిణకై నా కొకకోటిసువర్ణముల దయసేయుము' అని వేఁడికొనెను. యోగనందుఁ డనుమతించి వీనికిఁ గోటిసువర్ణము లిమ్మని ప్రధానమంత్రి యగు శకటాలున కాజ్ఞాపించెను.

కుశాగ్రబుద్ధి యగు నామంత్రిశేఖరుఁడు 'దేవా! యట్లొసఁగఁగద'నని, 'ఇది మిగుల నద్భుతముగ నున్నది. విగతజీవుఁడైన మహారాజిప్పుడె బ్రతికెను. నేఁడె యీయాచకుఁడును వచ్చెను. ఇన్నియు నన్నియుఁ గావు, కోటిసువర్ణము లడిగెను. వెనుకముందు నరయకయే యిమ్మని రా జాజ్ఞాపించెను.' అని సంశయించుచు 'నోహో! ఇది యిట్లు. ఇతఁడు యోగ

నందుఁడే. సత్యనందుఁడు కాఁడు.' అని జరిగినదాని నూహించి తనలో 'ఎట్లయిన నగుఁగాక ! నందమహారాజుపుత్త్రుఁడు చిన్న వాఁడు. రాష్ట్రమున శత్రువులు పెక్కండ్రు గలరు. చారులచే వెదకించి మృతకళేబరముల నన్నింటిని గాల్పించెద. దాన నీ యోగనందుఁడు చిరకాలము జీవించు' నని తలంచెను.

పిమ్మట శకటాలుని యానతిచే రాజభటులు పాడుదేవళమున వ్యాడిచే రక్షింపఁబడుచున్న యింద్రదత్తునికళేబరము సైతము బలాత్కారమునఁ గొనిపోయి తగులఁబెట్టిరి.

ఇక్కడ యోగనందుండు 'శీఘ్రముగ వరరుచికిఁ గోటి సువర్ణము లొసంగి పంపు'మని సారెసారెకుఁ జెప్పుచున్నను 'పరిజను లందఱు మహోత్సవాకృష్టచిత్తులై యుండిరి. కావున నొకింతసే పీవిప్రుఁడు నిరీక్షించుఁగాక !' యనుచు శకటాలుఁడు కొంతకాలక్షేపము చేసెను. అంత వ్యాడి యోగనందునికడకు వచ్చి 'మహారాజా ! యోగస్థితుఁడగు నొకబ్రాహ్మణుని, శవముగాఁ దలంచి యే నెంతమొఱ్ఱ వెట్టిన నాలకింపక రాజభటులు బలిమిం దహించి'రని విలపించెను. అది వినుచునే శకటాలుఁడు వరరుచికిఁ గోటిసువర్ణము లొసంగెను.

పిదప యోగనందుఁడు వగచుచు నేకాంతమున వ్యాడితో 'మిత్రమా ! నేను శ్రోత్రియకులసంభవుఁడ నయ్యు నీజన్మమునందే శూద్రుఁడ నైతిని. ఎంతసంపద గల్గిన నేమి?' అని పలి

కెను. వ్యాడియు నతనినూఱడించుచుఁ గాలోచితముగ నిట్లు నుడివెను. "కడచినదానికి వగవఁదగదు. ఇప్పుడు శకటాలుఁడు నిన్నెఱింగినవాఁడు." ఇతఁడు మహామతియుఁ బూర్వనందపుత్రుఁడగు చంద్రగుప్తునందు స్థిరానురాగము గలవాఁడునుగదా? ఆరాజపుత్త్రుని నభిషేకయోగ్యుఁ డయినతోడనే నిన్నుఁ గడతేర్ప యత్నించును. నీవప్రమత్తుఁడవై యుండవలయు. వరరుచిని బ్రధానమంత్రిపదమున నిల్పుము నేనిపుడె పాటలీపుత్రమున కేగి గురుదక్షిణ నొసంగి వర్షోపాధ్యాయుని బూర్ణమనోరథుఁ గావించెద" నని యతఁడు వెడలిపోయెను.

వ్యాడిచెప్పినచొప్పున యోగనందుఁడు వరరుచిని ప్రధానమంత్రిగాఁజేయ నతఁడేకాంతమునందు "శకటాలుఁడు మంత్రిపదముననున్నచో రాజ్యము స్థిరముగాదు. కావున వానినెట్లయినఁ దెగటార్పు" మని విన్నవించెను. యోగనందుఁడు ,,వీఁడు యోగనిష్ఠుఁడగు బ్రాహ్మణుని గాల్పించె" ననుదోషముఁ బ్రకటించి శకటాలుని బుత్రశతముతోఁ బాడునూతఁ ద్రోయించి వారి దేహయాత్రకయి ప్రతిదినము నటికెఁడంబలి యందుఁ బెట్టఁగట్టడచేసెను.

ఇట్లు తర్కితముగఁ దలస్థించిన యాపదకు వగచుచు శకటాలుఁడు ,,పుత్త్రులారా! ఈయంబలియొక్కని యాఁకలినైనఁ దీర్పఁజాలదు. కావున యోగనందునిపగ సాధింప సమర్థుఁడొకఁడే యీయాహారమున బ్రతుకవలెఁగాక" యని పలికెను.

ఆమాటవిని శకటాలునికొడుకులందఱు నేకగ్రీవముగా ,,తండ్రీ! యట్టిమహాకార్యము నెఱవేర్ప నీవె సమర్థుఁడవు. అశక్తులము మేము జీవించియున్న నేమిఫలము?" అని పలుకుచు వారం దఱుఁ దండ్రిచూచుచుండఁగనే ప్రాణములనువదలిరి. ధీరులకుఁ బ్రాణధారణముకంటెను శత్రుప్రతీకారము ప్రియముగదా?

శకటాలుఁడు స్వకర్మమున కనుతపించుచు నాయంబలిచే నెట్లెట్లో జీవించెను.

యోగనందుఁడును శకటాలుని వృత్తాంతమును మఱచి రాజయోగ్యములగు వస్త్రములు నాభరణములు ధరించుచు నింద్రియవశుఁడై యిష్టభోగముల ననుభవించుచుండెను. వ్యాడియు గురుదక్షిణ నొసంగి మఱల యోగనందునియొద్దకు వచ్చి ,,నేనింక వనమునకుఁ బోయి తపముఁ జేసికొందు" నని చెప్పెను. పూర్వవృత్తాంతమును స్మరించి యోగనందుఁడు ,,మిత్రా! యదృష్టలబ్ధమగు నీరాజ్యమును నీవు ననుభవింపు" మనెను.

నందశరీరము నొందిన యింద్రదత్తునివిషయవిషాస్వాద ముగ్ధుడుగా నెఱింగి ద్విగుణీకృత వైరాగ్యుండైన వ్యాడి ,,ఇట్టి యసారంబులైన భోగంబుల బుద్ధిమంతుఁ డెవ్వఁడు మునుం గును? మరుమరీచికయగు లక్ష్మి ప్రాజ్ఞుని మోహపెట్టఁజాలదు" అని తెలుపుచు రాజుచే గజనిమీలితమ్మునఁదిరస్కరింపఁబడి తపోవనమ్మున కరిగెను.

సాచివ్యభారమును వహించుచు వరరుచి కొంతకాలము నకుఁ జతురంగబలసమన్వితుఁడై రాజుతోఁగూడఁ బాటలీపుత్త్రమునకు వచ్చెను. తపస్సంతోషితయగు జాహ్నవి యను గ్రహమ్మున మహైశ్వర్యంబు నొంది, యారాధ్యాపకయే ప్రసన్నయైన సరస్వతి రాజ్యతంత్రము లుపదేశింపఁ, దల్లియు గురువులును బహుమానింపఁ, బతిదేవతయగు సహధర్మచారిణి పరిచర్య సేయ, నసహ్యుఁడగుచునే సుఖముల ననుభవించుచుఁ బెక్కేండ్లు గడపెను.

ముఖ్యమంత్రియగు నతనియందు రాజ్యభారము నెల్ల నిలిపి యోగనందుఁడు విభ్రమదమత్తచిత్తుఁడై రేయింబవళ్లు లంతిపురమందే వసించుచు, నింద్రియార్థపరిశూన్యంబగు నొక్క క్షణమేని సహింపఁజాలక, తనకు మిగుల మూఢత గలిగినట్లు తెలిసికొనలేకపోయెను. అట్టియవస్థలో నున్న యాతనిఁ గనుఁగొని వరరుచి నిర్విణ్ణుఁడయి "ఆహా! భవితవ్యత యెంత దుర్నివార మైనది. సర్వశాస్త్రపారీణుఁడు, ప్రతిభావంతుఁడు, శమదమాదిగుణసంపన్నుఁడు నగు నిందద్రత్తుఁ డెక్కడ? భోగాసక్తుఁడు విగతవివేకుఁడు నయి యేనుఁగువలె మదించిన యీ యోగనందుఁ డెక్కడ? నవమంత్రిపుసిరి యెవ్వని మోహపెట్టదు? అనుదానికి మొదటి యుదాహరణ మయిన యీనరపతి యడ్డులేక సంచరించుచున్నాఁడు. రాజకార్యచింతాక్రాంతుఁడ నగు నాకు స్వధర్మము నశించుచున్నది. కావునఁ బాశు

నూత నున్న శకటాలుని రప్పించి రాజకార్యావేక్షణమున సహాయుఁడుగాఁ జేసికొందును.” అని నిశ్చయించి రాజుతో విన్నవించి మహామతి యగు నాశకటాలుని మంత్రిపదమున నియోగించెను. అతఁడును 'వరరుచి యుండఁగా యోగనందుని జయింప వీలు లే'దని తెలిసికొని సందు వెదకుచు మైానవృత్తి నాశ్రయించి రాజ్యతంత్రముల నెప్పటియట్లు నిర్వహించుచుండెను.

ఒకప్పుడు రాజు వరరుచితో భాగీరథీతీరోపవనమ్మున సంచరించుచు దైవవశమున గంగామధ్యమునందు నిష్క్రమించాంగుళి యగుహస్తమును గనుఁగొని 'యిదియేమి' యని యడుగు నంతలో మంత్రి తనవ్రేళ్లను రెండిటి నాదిక్కుగానే చూపెను. వెంటనే హస్త మదృశ్య మగుటయు నరపతి మిగుల విస్మితుఁడై మరల నడుగుటయు వరరుచి ,,అయిదుగురు గలసి యూహింగ మ్మున నేది సాధింపలేరు ?” అని చెప్పుహస్తమునకు ,,ఏకచిత్తులగు నిద్దఱకే యేది యసాధ్య మగును?” అని రెండు వ్రేళ్ళు చూపితిని. అని గూఢవిజ్ఞానమును జెప్పెను. నిరుపమాన మగు నతని బుద్ధివైశద్యమును జూచి శకటాలుఁడు విషాద మొందెను.

మఱియొకప్పుడు రాత్రులయందుఁ బట్టణముఁ బరికించుటకు నియోగింపఁబడిన రక్షకభటాధ్యక్షుఁడు రేయిరేయికి నొక్కొక్కఁడు నశించుచుండెను. అది విని నందుఁడు వరరుచినే యాపనియందు నియోగించెను. వరరుచియు నర్ధరాత్రమునఁ బురవీథుల సంచరించుచు నెదురుగ వచ్చుచున్న యొకరాక్ష

సుని గనుఁగొని 'నీ కేమి యిష్టము?' అని యడిగెను. వాఁడు 'నీపట్టణమునందు రూపవతి యగు స్త్రీ యెవ్వతెయో చెప్పు' మని ప్రశ్నించెను. అందులకు నవ్వి వరరుచి 'మూర్ఖా! ఎవతె యెవ్వని కభిమతమో వాని కాపె రూపవతి యగును.' అని నుడివెను. రాక్షసుఁడు సంతసించి 'జయింపఁబడితిని. ఇదిమొదలు ప్రియమిత్త్రమ వగు నీవు తలఁచినపు డెల్ల సన్నిధి సేయుచుందు' నని పలికి యంతర్హితుఁ డయ్యెను. ఇట్లు జాగరూకుఁ డగు వర రుచి రాజ్యకార్యము లపేక్షించుచుండ నింట గూర్చుండి యభి మంగజమఁ డైన భూపతి యున్ముఖుఁ డగు నొకబ్రాహ్మణుని గవాక్షాగ్రమునుండి నిరీక్షించుచున్నపట్టమహిషిం గాంచి వివేక పరిపంథిని యగునీర్ష్యచేఁ గలుషితుఁడై కోపించి యాబ్రాహ్మ ణుని వధింప నాదేశించెను. రాజాజ్ఞచే విప్రుఁడు వధ్యస్థానము నకుఁ గొనిపోఁబడుచుండ నంగడివీథినడుమఁ బ్రాణము లేని దయ్యు నొకచేఁప బిగ్గరగా నవ్వెను.

అది యెఱింగి పట్టపురాజు 'బ్రాహ్మణుని జంప వల' దని వారించి 'చేఁప నవ్వుటకుఁ గారణము నిరూపించి చెప్పు' మని వరరుచిని వేఁడుకొనెను. అంతఁ జింతితోపస్థిత యగు సర స్వతి కాత్యాయనునితో 'వత్సా! యీ లేఁతమామిడిచెట్టు క్రింద రాత్రి యెవ్వరికిఁ గనఁబడకుండఁ గూర్చుండుము. చేఁప నవ్వుటకుఁ గారణము వినఁగలవు.' అని చెప్పెను. అట్లే యటఁ గల సచివుఁడు బాలకులగు పుత్త్రులతో నచట నివసించుటకు

వచ్చిన యొకఘోరరాక్షసిని జూచెను. 'తినుట కేమైనఁ బెట్టు' మని యడుగుచున్న కొడుకులశిరస్సు మూర్కొని యానిశాచరి 'ప్రాతఃకాలమునందు మీకు విప్రమాంసము బెట్టెదను. ఇప్పుడు వాఁడు చంపఁబడలేదు.' అని యూఱడించుచు 'నతఁ డిప్పుడేలఁ జంపఁబడలే' దని వారలచే నడుగఁబడి 'వాఁడు వధ్యభూమికిఁ గొనిపోఁబడుచుండఁ జచ్చినచేఁప యొకటి నవ్వె'నని చెప్పి 'యది యిట్లు నవ్వుటకు గతం బే'మని మరల వారిచేఁ బ్రశ్నింపఁబడి 'పుత్త్రులారా! అంతఃపురమందున్న రాజస్త్రీ లందఱును భ్రష్టచారిత్రలు. అంతటను స్త్రీవేషధారు లగు పురుషులు గూఢముగా సంచరించుచున్నారు. ఇది యెఱుంగక నిరపరాధుఁ డగు బ్రాహ్మణుఁ డీయభిషంగజడుఁ డగు జాల్మునిచేఁ జంపఁబడుచున్నాఁ డని చేఁప నవ్వె' నని చెప్పెను. అది విని వరరుచి ప్రాతఃకాలమునందు యోగనందుని కెఱింగించెను. అతఁడును స్త్రీవేషధారులగు నాపురుషులను వెదకి చంపించెను.

భూపతి యిట్లు నిరంకుశుఁడై యుండ వరరుచియు నట్టివానిసేవను గర్హించుచుండ, నొకనాఁడు సమర్థుఁ డగు చిత్రకారుఁ డొకఁడు సభామంటపమునకు వచ్చి మహాదేవియోగనందుల ప్రతికృతిని వ్రాసి నివేదించి పరితుష్టాంతరంగుఁ డగు నాతేనివలన బహుధనమును బారితోషికముగఁ బడసెను. ఒకప్పుడు రాజదర్శనము సేయఁ బ్రాసాదాభ్యంతరమునకుఁ జనిన వరరుచి యొకచో నాచిత్తరువుఁ గనుఁగొని సంపూర్ణలక్ష

ణములు గలదేవికి లక్షణాంతము నూహించి కుంచెతో నాపె పిఱుఁదుపై నొక బొట్టు పెట్టెను. మఱునాఁడు యోగనందుఁడాతిలకమును గనుఁగొని 'యిది కాత్యాయనునిచే వ్రాయఁబడిన' దని తెలిసికొని ముగ్ధుఁడై 'నిక్కముగ నీతఁడు దుష్టచారితుఁడు. నాయంతఃపురమునందు ద్రోహము సేయుచున్నాఁడు. కావుననే స్త్రీవేషధారులగు పురుషు లీతనిచే నెఱుంగఁబడిరి.' అని నిశ్చయించి, కోపముచే మండుచు, దుర్వృత్తుఁడగు నీవరరుచిని వధింపుమని శకటాలున కానతిచ్చెను. బుద్ధిమంతుఁడగు శకటాలుఁడు 'ఈతఁడు దివ్యమతిప్రభావుఁడు. ఆపదనుండి నన్నుద్ధరించినవాఁడు. ఇతనిఁ జంపుటకు సురాసురులకును శక్యము కాదు. మనుష్యులమాటఁ జెప్ప నేల!' అని చింతించుచుఁ, గాత్యాయనుఁ దనసదనమునందు నిగూఢముగా నుండఁ బాచి 'మహారాజా! మీయాజ్ఞ నెఱవేర్పఁ బడినది.' అని యోగనందుని సంతసపెట్టెను.

అంతఁ బెక్కునాళ్ళు గడచనుటయు యోగనందునకు మహాదేవియందుఁ బుట్టిన హిరణ్యగుప్తుఁడను పదునెనిమిది యేండ్ల ప్రాయముగల కుమారుఁడు తండ్రిచే నివారింపఁ బడుచుండియుఁ, దల్లిచే ననుమోదింపఁ బడకయు, మృగయాసక్తచిత్తుఁడై కొంద ఱాప్తపురుషులు పరివేష్టింప నశ్వము నధిష్ఠించి మహారణ్యముఁ బ్రవేశించెను. అం దేకాకియై యొక యడవి పందిని వెనుకొని పరువెత్తుచుఁ జాలదూరము పోయెను. ఇంత

ల్లోఁ బవళ్లు గడచెను. గాఢాంధకారమునందు ఘోరముగ ధ్వనిసేయు ఘాతుకమృగములగర్జనము లాలించుటచేతనే భయభ్రాంతుఁడైన రాజపుత్త్రుఁ డొకవృక్షముపై కెక్కెను. తరువాత నొకగడియకుఁ దఱిమికొనివచ్చు సింగమునుండి తన్ను రక్షించుకొను నెలుఁగుబంటి యొకటి యావృక్షమునే యెక్కెను. సమీపమునకు వచ్చు దానిని గనుంగొని భయమ్మున వడఁకుచున్న హిరణ్యగుప్తుని దనతోడఁపైఁ గూరుచుండఁ బెట్టుకొని యాభల్లూకము 'మిత్త్రమా! భయపడకు' మని మధుర్యవాక్యమున బుజ్జగించెను. తరువాత నాయెలుఁగు సింహముచేఁ బ్రార్థింపఁబడియు విశ్వాసముచేఁ దనతోడఁపై నిదురించుచున్న రాజపుత్త్రుని గ్రిందఁ బడద్రోయ నిచ్చగింప దయ్యెను. మఱికొంతసేపటికి మేల్కాంచి రాజనందనునంక ముపధానముగా నద్దియు నిదురించెను. కేసరిచేఁ బ్రలోభితుఁడై హిరణ్యగుప్తుఁడు నిష్కారణముగా నాయెలుఁగుగొడ్డును భూమిపైఁ బడఁద్రోసెను. దైవవశమున మేల్కాంచిన యాభల్లూకము త్రోయఁబడియుఁ బట్టు వదలక కోపించి 'ఓరీ! మిత్త్రద్రోహీ! ఈనీదుష్టచేష్టితము వెల్లడియగునంతకు నున్మత్తుఁడవై యుండు' మని శపించెను.

ప్రాతఃకాలమునం దున్మత్తుఁడై పురమున కరుదెంచిన కుమారుని గనుఁగొని విషణ్ణహృదయుఁడైనభూపతి సుతునకు స్వస్థత గలుగునుపాయం బరయజాలక 'వరరుచి యిప్పుడు

బ్రిదికి యుండునేని యున్మాదహేతువు తెలియు నగునుగదా ! నే నాతని జంపించి యెంతకొఱఁతఁ దెచ్చుకొంటిని.' అని తన్ను నిందించుకొనెను. చెంతనున్న శకటాలుఁడు 'మేలు ! వరరుచిని వెల్లడించుటకుఁ దగినసమయము వచ్చిన' దని చింతించి యా రాజు సభయము వేఁడికొని యాతని యానతివెంబడి నేకసంధా గ్రాహిని బయలుపఱచెను. లోద్ద్రోహ యోగనందునిచేఁ గుమా రోన్మాదకారణ మడుగఁబడి కాత్యాయనుఁడు హిరణ్యగుప్తుని జూచి, యీతఁడు మిత్రద్రోహముఁ జేసెను. దాని కిది ప్రతిఫల' మని సరస్వతీప్రసాదమునఁ జెప్పెను. తక్షణము హిరణ్యగుప్తుఁడు స్వస్థుఁడయి జనశూన్యమగు నరణ్యమున జరిగినవృత్తాంతమును సాకల్యముగ నభివర్ణించెను. రాజు విస్మితుఁడై, 'ఓయి ! నీ కిది యెట్లు తెలిసినది' అని యడుగ వరరుచి, 'దేవా! ప్రజ్ఞావంతులు లక్షణములఁ, బ్రతిభ, ననుమానమున నొరులు సెప్పకయ సర్వము నెఱుంగఁ గలరు. మున్ను నేనిట్లే తిలకము నెఱిఁగితి' నని పలికెను లజ్జానుతాపములు గదిరి తూష్ణీంభావము నొందిన యోగనందునిచే సత్కరింఁబడక, తనచారిత్రశుద్ధి ప్రకటిత మయినందులకే తన్నుఁ గృతకృత్యునిగాఁ దలంచుచు, నుప కోశాభర్త విరక్తుఁడై, 'యనిత్యముకంటె ననిత్యమగు రాజాను గ్రహ మిఁకఁ జాలు' నని తలంచి తనయింటి కరిగెను.

వచ్చినయల్లుని గని సముద్భ్రాంతచేతనుఁడైన యుపవ రుఁడు, 'విద్వాంసుఁడా ! నీకు విధింపఁబడిన వధదండనమును విని

పతివ్రత యగునాకూఁతురు శోకదగ్ధయు నవిరళాశ్రుధారాపరిప్లుతలోచనయునై నాచే నివారింపఁబడుచుండియు నగ్నిప్రవేశ మొనరించెను. జరాభారజర్జరితావయవమై 'హా! కాత్యాయన! హా! సకృచ్ఛ్రుతధర! యని విలపించు నీజనయిత్రి హృదయము తనంతనే పగిలిపోయె' నని బిగ్గరగ నేడ్చెను. కాత్యాయనుఁ డది విని నూతనమగు దుఃఖవేగమున నొడలెఱుంగక మొదలు నఱకఁబడిన చెట్టువలె భూమిపైఁ బడి పెద్ద తడవు విలపించెను. ప్రియబంధువినాశమునఁ గలిగిన శోకాగ్ని యెవ్వనిఁ బరితాపపెట్టదు.

అంత వరరుచియవస్థను విని వర్షోపాధ్యాయుఁడు శీఘ్రముగ వచ్చి 'వత్సా! యేమి యిట్లు ప్రాకృతజనునట్లు, ధర్మసూక్ష్మ మెఱుంగనివానిభంగి, నవిద్వాంసునివడువున, ననధిగతలోకవృత్తాంతునిపోల్కి దుఃఖాక్రాంత మగు హృదయమును మఱలింపకుంటివి? నీవు పుట్టిననాఁటఁ గోలె శోకము నెఱుంగని వాఁడ వగుట నిజమే. ఇదియైనను నీవైరాగ్యమును దృఢపఱచుటకు నీవతిభక్తి నారాధించు దైవముచేఁ గల్పింపఁబడినది. కావున ధైర్యము నవలంబింపుము. మనముఁ గుదురుపఱచుకొనుము. లోకతత్త్వమును విచారింపుము. ఈ జగమునందు సంసార మున్నంతవఱకు నొకయనిత్యతయే నిత్యమైనది. కావున నీశ్వరమాయ నెఱింగియు మోహపడెదవేమి?' అని యిట్లు పెక్కు తెఱఁగుల బోధించెను. ఇట్లు వర్షోపాధ్యాయునిచేఁ బ్రబోధి

తుఁడై వాక్యకారుఁడు విషాదముఁ బొలఁగఁద్రోసి విరక్తహృదయుఁడుఁ బరిత్యక్తసర్వబంధనుండునై శాంతి యొక్కటియే తనకు సహాయముగఁ దపోవనము నాశ్రయించెను.

అంతఁ గొంతకాలము గడచినటయుఁ బుణ్యారణ్యవాసముఁ జేయుచున్న వరరుచి దైవవశమున మగధదేశమునుండి యచ్చటికి వచ్చినయొక బ్రాహ్మణుని జూచి యోగనందుని వృత్తాంతమునడిగెను. అతఁడును గాత్యాయనుని గుఱుతుపట్టి నమస్కరించి 'మహాశయా! నీవు తపోవనమున కేగినతోడన యవకాశముఁ గొని వైరము నెంచి శకటాలుఁడు యోగనందుని వధించు నుపాయము నరయుచు భూమిని ద్రవ్వుచున్న చాణక్యుఁడను నొక బ్రాహ్మణుని గనుఁగొనెను. "ఎందుల కిట్లు త్రవ్వెద?" వని మంత్రిచే నడుగఁబడి యావిప్రుఁడు "నా పాదము నీదర్భ తెగఁ గోసినది. కావున దీనిని గూఁకటి వేళ్ళతోఁ గూడఁ బెఱికి వేయక పోవ" నని పలికెను. క్రూరనిశ్చయుం డగు నితఁడు సహాయుఁ డగునేని నామనోరథము సిద్ధించునని తలంచి శకటాలుఁడాతని సన్మానించి తన గృహమునంద యుండఁ బంచి నంద మహారాజు ప్రాసాదమున లక్షసువర్ణములు దక్షిణగాఁ గల త్రయోదశీశ్రాద్ధమ్మున నిమంత్రితు లగు బ్రాహ్మణుల యగ్రభాగమున నాతని నియోగించెను. రాజున కిష్టుఁ డగు సుబంధువను బ్రాహ్మణుఁ డా స్థానమునే యభిలషించెను. నందునిచేఁ బూర్వనియుక్తుఁ డయ్యుఁ జాణక్యుఁడు బలాత్కారముగా

నగ్రాసనమునుండి తఱుమఁబడెను. అంతఁ గోపమ్మున మండుచుఁ చాణక్యుఁడు తల విరియఁ బోసికొని "ఏడుదినములలో దుర్వినీతుఁడు నైశ్వర్యమత్తుఁడు నగు నీ రాజును గడతేర్చి యీ తల ముడిచికొందు" నని ప్రతిజ్ఞఁ జేసెను. ఆచాణక్యుని గూఢముగఁ దన గృహమునం దుంచి యాతఁడు కోరిన యుపకరణములనెల్ల శకటాలుఁ డొసంగెను. అతికోపమున నైన యా విప్రుఁడును నత్యుగ్రము లైన యథర్వమంత్రములఁ బఠించి యొక కృత్యను సాధించెను. ఆ కృత్యచే గ్రసింపఁబడిన యోగనందుఁడు తీవ్రమగు దాహజ్వరమునఁ బరితప్తుఁ డయి యేడవనాఁటనే పరలోకమున కరిగెను. శకటాలుఁడును దోడనే హిరణ్యగుప్తుని జంపి పూర్వనందసుతుఁడగు చంద్రగుప్తునకుఁ బట్టాభిషేక మొనరించి చాణక్యుని మంత్రిపదంబున నియోగించి కృతప్రతిక్రియుఁ డై పుత్రశోకమ్మునఁ దూలుచు మహారణ్యమున కేగె" నని చెప్పెను.

ఇట్లతిశోచనీయ మగు యోగనందుని వృత్తాంతము విని వరరుచి మిగుల ఖిన్నుఁ డయి, సంసారము నసారముగ నెఱింగి, వింధ్యవాసిని నుపాసించి యామె యాజ్ఞచే వ్యాఘ్రవానరసంకీర్ణము గహనము నగు వింధ్యారణ్యమ్మునఁ బరిభ్రమించుచు నొకచో నున్నతమగు వటవృక్షమును జూచెను. ఆ చెట్టుక్రింద ననేకపిశాచములు పరివేష్టింప నున్న కాణభూతి యను భేతాళుం గాంచినతోడనే పూర్వజన్మస్మృతిగలిగి యా కాణభూతి "కుబేర శాపంబునఁ జేసి పిశాచత్వము నొందిన

సుప్రతీకుఁ డను గుహ్యకుఁ" డనియుఁ, "పుష్పదంతుఁ డను పేర నొప్పు తనకు మిత్ర" మనియుఁ దెలిసికొని మైత్రిఁ జూపి యతనికి విద్యాధరచరితముఁ జెప్పి 'మిత్రమా ! శీఘ్రకాలము లోనే గుణాఢ్యుఁ డిక్కడకు వచ్చును. అతని కీయపూర్వమగు కథ నెఱింగింపుము. పిమ్మట నీకు శాపవిమోచన మగును.' అని బోధించి శరీరమోక్షమునకు పవిత్రతమ మగు బదరికా శ్రమమునకుఁ బయనించెను.

హిమాలయప్రాంతవనమ్ముల సంచరించుచుఁ గాత్యాయనుఁడు కందమూలఫలాదుల జీవయాత్ర నడపువాని శాకరసుఁడను సార్థకనామధేయముగల మునీశ్వరుఁ గాంచెను. అతిథిపూజ నొంది యతనిజ్ఞానమును బరీక్షించుతలఁపున దర్భక్షతమగు నతనికరతలమునుండి స్రవించు రక్తధారను శాకరసముగాఁ బరిణమింపఁజేసెను. మునియు నది చూచి నాతపము ఫలించిన దని గర్వించెను. కాత్యాయనుఁ డాయహంకారము జ్ఞానమునకు శత్రువని యాతనికిం దెలిపి' నీవిజ్ఞానము నెఱుంగఁగోరి రక్తధారను శాకరసముగా నొనరించితిని. ఓమునీశ్వరా ! నీచే నిప్పటికి నహంకారము విడువఁబడ లేదు. జ్ఞానమార్గమునం దహంకారము దురతిక్రమ మగు పరిఘము. జ్ఞానములేక యెన్ని వ్రతము లొనరించినను మోక్షములేదు. అనిత్యమగు స్వర్గము గూడ ముముక్షువులచిత్తమును లోభపెట్టఁజాలదు. కావున నహంకృతిని విడిచి విజ్ఞానమును సంపాదింప యత్నింపుము,

అని మోక్షరహస్యము నుపదేశించి యాతనిచేఁ బ్రణామపూర్వకముగఁ గొనియాడఁ బడి బదరికాశ్రమభూమి కరిగెను. అందు శరణ్య యగు పార్వతి నుపాసించి తత్ప్రసాదమున దివ్యగతి నొందెను.

---

## * కుమారిలభట్టాచార్యుఁడు.

ఉపనిషత్తులలోనె "దేహాత్మవాదము" పేరితో నవైదిక మతచిహ్నములు గలవు. ఆయవైదికమతప్రవర్తకులగు వారిని గాలాంతరమున "తీర్థంకరులు, లేక జినులు" అనియు, నామతమునకు (1) జైనమతమనియు నామములు కలిగెను. ఆతీర్థంకరులిరువదినల్వురు కలరు. ఈయిరువదినల్వురులో నిరువదిమూఁడవ తీర్థంకరుఁడగు 'పార్శ్వనాథుని మనయాంధ్రదేశమునందు జైనమతస్థులగు 'మారువాళీలు' సేవించుచుందురు. ఇరువదినాల్గవ తీర్థంకరుఁడగు 'మహావీరుఁడు' బుద్ధునకు సమకాలికుఁ డనియు బేహారురాష్ట్రమున నాతఁడు తనమతప్రచారముఁ జేసె ననియుఁ జారిత్రికులు చెప్పుదురు.

---

* ఈచరిత్ర శంకరవిజయాదిగ్రంథములఁ బరిశీలించి వ్రాయఁబడినది.

(1) జైనమతము నాల్గువిధములగు బౌద్ధమతభాగములలో నొకటి యని శేదాంతశాస్త్రజ్ఞు లనెదరు.

ఆజైనమతము జనసామాన్యమున కందుబాటగు ధర్మములు కలదిగా మహావీరునిచే మార్పఁబడినందున బేహారు, కళింగాదిదేశములలో నతివ్యాప్తి నొందెను. 'ఖారవేలుఁ'డను కళింగదేశపు మహారాజీజైనమతము నభివృద్ధి నొందించుటకై 'కళింగోత్కల'దేశములలో విశేషదానధర్మముల నొనర్చెను. (1)

అందువలనఁ గళింగోత్కలవిహారాది దేశములలో వైదికమతము నామమాత్రావశిష్ట మయ్యెను. ఏయెడఁ జూచినను జైన బౌద్ధమతములవిజృంభణమే కాన్పించుచుండెను.

ఇట్లుండినను వైదికమతాభిమానము, వైదికవిద్యాభ్యాసము దేశమున నచటనచటఁ బొడచూపుచునే యుండెను. ఆజైనమతాతిరేకకాలముననేయాంధ్రోత్కలదేశములనడుమను మహానది యను నొకయేటియొడ్డున (2) 'జయమంగల'మను గ్రామమునందు 'తైత్తిరీయవేద'శాఖకుఁ జేరిన 'చంద్రగుప్త యోగీశ్వర

---

1. ఖారవేలుఁడు, పాటలీపుత్రాధిపతియు అశ్వమేధయాగ మొనర్చి వైదికమతాభివృద్ధి నొనర్చిన పుష్యమిత్రునిపైకిని ప్రతిష్ఠాన పురాధీశుఁడు నాంధ్రప్రభువు నగు 'శాతకర్ణి' మహారాజుపైకిని దండయాత్ర లొనర్చుట జైనమతవ్యాప్తికే యని తోఁచును. ఈయంశములు హాతిగుంఫాశాసనముల వలనఁ దెలియనగుచున్నవి. పైయంశములు క్రీ.పూ. 158వ సంవత్సర ప్రాంతమునన్నై యుండెను.

2 జయమంగల గ్రామము గంజాము మండలమున 'బరంపురము అస్కా' పట్టణములకు నడుమఁగలదు. మహానది యనునది చిన్నయేరై ఋషికుల కుల్యనదిగా నున్నది.

భట్టు'లను విప్రదంపతులకు, (1) 'కుమారిలుఁడు' అనుబాలుఁ డుద్భవించెను. దుర్మతనిర్మూలనమునకై శివునాజ్ఞచేఁ గుమార స్వామి కుమారిలభట్టుగా జన్మించె నని శంకరవిజయమునఁ గలదు.

'కుమారిలుఁడు' చిన్నతనమునుండియు మేధాశాలి యై వేదవేదాంగములం గఱచి తోడివిద్వాంసులలో మిన్నగ మెలఁగెను. ఆతనికి వేదబాహ్యమగు జైనముపై నీర్ష్య మెండయ్యెను. కాని, యామతమును ఖండించుటకు జైనులు తమమతగ్రంథ ముల నితరులకుఁ జూపనివా రగుటచేత నామతమును శాస్త్ర యుక్తముగా ఖండింప వీలు కలుగలేదు. (2)అందువలనఁ గుమా రిలుఁడు జైనబ్రహ్మచారివేషమును ధరించి జైనపండితులకడ నా మతగ్రంథములను జదివి యందలిమర్మములను గ్రహించెను.

ఆతఁడు జైనగురువులకడ మారువేసముతో విద్య నేర్చు చుండ నొకఁ డెట్లో యాతనిరహస్యముఁ దెలిసికొని మేడపై

1 కుమారిలభట్టు క్రీ.శ. ఏడవశతాబ్దములోనివాడని యాధునిక చారిత్రకులును, యుధిష్ఠిరశకము 2110 సం॥రము అనఁగా క్రీ. పూ. 991 సం॥రమున జన్మించె నని సనాతనధర్మచారిత్రకులును వ్రాయుచున్నారు.
2. జైను లితరులకుఁ దమగ్రంథములఁ జూపనందునఁ దదితరులు జైనులను నిర్గ్రంథు లనిరి. కాని, నేటికాలమున జైనమతగ్రంథములు వందలకొలఁది ముద్రితము లయినవి.

నిద్రించునాతనిని గ్రిందికిఁ ద్రోసివేయ నీతని కొకకన్ను క్రిందఁ బడినప్పుడు పోయెనఁట !

జైనమతఖండనమునకును వేదప్రతిపాదితకర్మములే ముక్తి సాధనము లనుటకును 'జైమినిమహర్షి' కృతమగు పూర్వమీమాంసాశాస్త్రము నాధారపఱచికొని ప్రచార మారంభించెను

ఆకాలమున కుమారిలభట్టాచార్యుఁ డుండు దేశమును 'మేదినీ'పురాధీశుఁడగు 'సుధన్వ'మహారాజు పాలించుచుండెను. ఆరాజాస్థానమునకుఁ బలువురు జైనమతపండితులు చేరి యామహారాజును వైదికమతవిముఖునిగాను, జైనమతాభిమానినిగాను జేసిరి. రాజాదరణము లేనందున వైదికకర్మలు. సంస్థానమున సన్నగిలెను. కాని. సుధన్వమహారాజుభార్య సనాతనవైదికమతాభిమానిని; విదుషీమణి; సత్స్వభావ. భర్త జైనమతావలంబి యగుట కెంతయు వగచి, భర్తతో మతవాదమునకుఁ గడంగునుగాని జైనమతపండితులు చెప్పు వైదికమతఖండనోపదేశములను వినినభర్త చెప్పుయుక్తులకుఁ బ్రత్యుత్తరములు చెప్పలేకుండును. కాని, వైదికధర్మమే యుక్తధర్మ మనునమ్మిక కలదగుటచే జైనమతమును ఖండించుపండితుఁ డెవ్వఁడైనఁ గలుగకపోవునా ? అని తలంచుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు కుమారిలుఁడు మేదినీపురమున కేఁగుటయు, మహారాణిమేడకు సమీపమున నడచుచుండుటయుఁ

దటుస్థించెను. సదా వైదికమతోద్ధారణమునే యోచించుమహా రాణినోఁట నీకిర్రిందియర్థముగల పద్యభాగము వెలువడెనఁట !

1 ఏమి చేయుదాన; నెచటి కేఁగుదాన ?

వేదముల నెవఁ డుద్ధరింపఁగలఁడు ?

అన నది విని యెట్లయినను రాజసభకుఁ బోయి జైన పండితుల నోడింపుసమయమునకు వేచియున్న కుమారిలుఁడు వెంటనే యిల్లు ప్రత్యుత్తరముగా నామె నుడివిన పద్యమును బూర్తి చేసెనఁట !

2 సుందరీ ! చింత మానుము; నేను భూతల

మున భట్టాచార్యుఁడనై యుంటిని

ఈ ప్రత్యుత్తరముచే మహారాణి యాశ్చర్యానందభరితయై కుమారిలుని దనసౌధముపైకి రప్పించి యాతని వృత్తాంతముఁ దెలిసి, యీతఁడు తప్పక జైనుల నోడింపఁగలఁ డని తలఁచి, బహూకరించి కుమారిలునకు రాజసభాప్రవేశము గలుగు నవకాశముఁ గల్పించెను.

రాజదర్శనానంతరము కుమారిలభట్టుఁడు రాజసభకు వచ్చి పోవుచు నొకప్పుడు రాజసభలోనుండ సభాసమీపమున నొక రసాలవృక్షముపై నున్న కోయిల కుహూరుతము సేయ

1. కిం కరోమి, క్వగచ్ఛామి, కో వేదానుద్ధరిష్యతి.

2. మావిషీద, వరారోహే ! భట్టాచార్యోస్మి భూతలే.

నది నెపముగఁ గుమారిలభట్టాచార్యుఁ డీక్రిందియర్థముగల శ్లోకముఁ జదివెనఁట !

(1) ఓపికమా ! నీచములై మలినములై నిందితపు కఱుకుపలుకులుగల కాకకులముతో నీవు కలియకుంటివేని యపుడు శ్లాఘనీయ నగుదువు.

అన నాపద్యార్థము, నీచులై యయుక్తవాదులగు జైనులచే మహారాజావృతుఁడు కాకుండిన నాతఁడు కొనియాడఁదగినవాఁ డను నంశమును స్ఫురింపఁజేయ మహారాజు విన్ననగు మోమునుగలవాఁ డయ్యెను. రాజు నిట్లు పలుకుటచే సచివాదులుద్విగ్నమానసు లైరి. జైనపండితులు క్రోధావేశపరవశు లైరి. సభాసదులు గుసగుసలతో గజిబిజి పడిరి.

అంత వయోవృద్ధుఁడు, విద్యావృద్ధుఁడు, సర్వసముఁడు నగు నొక్కమహాపండితుఁడు సభలో నిలిచి సభలోని కలకలమును వారించి "ప్రభువర్యా ! సభాసదులారా ! జినమతము దుష్ట మనియు, వైదికమత మత్యుత్తమ మనియు నీభట్టాచార్యునితలంపు. జైనపండితులు తద్వ్యతిరేకులు. అదియే యిప్పటి కలవరమునకుఁ గారణము. కాన వీరిరువురమతధర్మములు శాస్త్రదృష్టాంతములుగల వాదప్రతివాదములచే నిర్ణయించుకొం

(1) శ్లో. మలినైశ్చేన్న సంగస్తే నీచైః కాకకులైః పిక !
అతిదూపకనిర్హ్రాదైః శ్లాఘనీయ స్తథా భవేః॥

దురుగాక !" అని పలుక నందులకు మహారా జంగీకరించి యొక్కనాఁడు సభ నేర్పఱచెను.

ఈవృత్తాంతము నలుగడల వ్యాపింప నుభయమతాభిమాను లగుపండితులు పలుదిక్కులనుండియు మేదినీపురమునకు రాఁదొడంగిరి.

నియమితదిన మేతేర రాజపురుషులు పండితు లగుసభ్యులకును, జూపఱులకును దగినయేర్పాటుల నొనరించిరి. పండితమండలాగ్రగణ్యులు నిర్ణీతస్థానముల నలంకరించిరి. ఖండన మండనములం జేయఁదలఁచిన భట్టాచార్యాదు లిష్టదైవములఁ గొలిచి సభలోఁ బ్రవేశించిరి. మహారా జనర్ఘమణిస్థగితసింహాసనమున నారూఢుఁ డయ్యెను. విదుషీమణియగు మహారాజ్ఞియు వాదోపవాదము లు విన సభలో నుచితస్థలమునఁ గూర్చుండెను.

పిమ్మట జైనవైదికమతవేత్త లగు మహాపండితులను మధ్యవర్తులనుగా నెన్నుకొని కుమారిలుఁడును, జైనపండితులలో శ్రేష్ఠుఁ డగు నాతఁడును వాదమునకుఁ గడంగిరి.

"వేదోదితకర్మములే యాచరణీయములు, తద్వ్యతిరేకములు త్యాజ్యములు" అని కుమారిలభట్టాచార్యుఁ డుపపాదించెను. "వేదములు పౌరుషేయములు. అందుఁ జెప్పఁబడు యజ్ఞాదికర్మములు హింసాత్మకములుగాన వేదకర్మము లనాచరణీయములు. అహింసాత్మకములగు జైనధర్మములనే యాచరింపవలయు" నని జైనపండితుఁడు ఖండించెను.

అందుపై (1) 'విధివాదము, అణువాదము, వ్యక్తివాదము, శక్తివాదము, క్రోడవాదము, స్ఫోటవాదము, ప్రక్రియావాదము, ఆస్తికవాదము' మొదలగు వివిధశాస్త్రసంబంధములగువాదములు, ఖండనమండనములతోఁ జెలరేఁగెను.

వారివాదములలో 'వేదములు, షడ్దర్శనములు, షడంగములు, సౌగతము, చార్వాకము' మొదలగు వివిధశాస్త్రములు చక్రాకృతిని గిఱ్ఱునఁ దిరుగుచుండెను. మేదినీపురమహారాజుసభ వేదశాస్త్రఘోషములతో సముద్రమురీతి నుప్పొంగుచుండెను. సభ లేనప్పుడును, నుభయపక్షములపండితులనివాసములలోను బెక్కు లుపసభలు జరుపుచుఁ బండితులు తమతమపక్షపునాయకుల కాలోచనములఁ జెప్పుచుండిరి. ఆసభాముఖమున నందఱపండితులలోను కుమారిలుని యుక్తిప్రత్యుక్తులు సర్వశాస్త్రపండితులకు ముఖపిధానముం గల్గించెను. షణ్ముఖునివలె నతనిముఖమునుండి వాగ్ఝరి నలుదిక్కులల విస్తరిల్లెను. అందులకే కాఁబోలుఁ గుమారుని కుమారస్వామియొక్క యపరావతార మనిరి ! ఆతనివాగ్బాణముల కెదుర నేవిపక్షపండితులును నిలువలేరైరి. ఆతనిశాస్త్రహుంకృతులకు విమతస్థులు సమ్మోహితులై 'జితాస్మః' అనిరి.

మధ్యవర్తు లగు పండితులు కుమారిలభట్టాచార్యునికే జయపత్రి మొసఁగిరి. సుధన్వమహారాజును జైనమతమును ద్య

1. పైవాదములు హైందవుల శాస్త్ర చర్చలలోఁ గలుగును.

జించి వైదికమతావలంబియై కుమారిలుని గురువుగా గ్రహించెను. నిరావలంబులైన జైనమతగురువులుఁ దన్మతపండితులు నాదేశమును వదలి దూరప్రదేశముల కేఁగిరి. అంతకుమున్ను జైనమతము నవలంబించిన జనులు జినమతమును వదలి వైదిక మతము నవలంబించిరి.

కొందఱు చారిత్రకులు సుధన్వమహారాజు కుమారిల భట్టాచార్యుని యుపదేశముచే జైనుల నాదేశమునుండి తరిమి వేసె నని చెప్పుదురు.

ఇట్లు కుమారిలభట్టాచార్యుఁడు జైనమతఖండన మొనర్చి తాఁ జేసినప్రతిజ్ఞను నిర్వహించినవాఁ డగుటవలన మహారాణిచే విశేషసత్కారముల నొందెను.

పిమ్మట నాపండితుఁడు జైమినిప్రోక్త పూర్వమీమాంసా సూత్రములకు 'తంత్రవార్తికభాష్యము, శ్లోకవార్తికము' మొదలగు మహాగ్రంథములను జేసెను. అతనికి శిష్యప్రశిష్యులగు ప్రభాకరభట్టు, పార్థసారథిమిశ్రుఁడు మొదలగువా రెన్నియో యుద్గ్రంథములను, కుమారిలభట్టాచార్యునిమతమును సమర్థించుచు రచించి బ్రాహ్మణమతమును, వైదికవిద్యను నలుదిక్కుల వ్యాపింపఁజేసిరి.

కుమారిలభట్టాచార్యుని యత్యధికపాండిత్యమును, వైదిక మతప్రచారమును, జైనమతనిర్మూలనమును జూచి "జినవిజ

యము” అనుగ్రంథ మొనర్చినయాతఁడు తనగ్రంథమున నిట్లు వ్రాసెను.

(1) “ఆంధ్రోత్కల దేశముల సంధియందు మహానదీతీరమునం దుండిన పవిత్రమైన ‘జయమంగల’ గ్రామమున “చంద్రగుణా యజ్ఞేశ్వరులు” అను యుత్తమదంపతులకు మహావాదియు, విపక్షభయంకరుఁడును, వేదాభిమానియు, జినమతాంతకుఁడును, గురుద్వేషియు, నాంధ్రుఁడును, ‘తైత్తిరీయ’ వేదశాఖీయుఁడు నగు కుమారిలభట్టాచార్యుఁడు పుట్టెను.”

ఈమహానుభావుఁ డొకప్పుడు జైనమతబోధలవలన వేదము పౌరుషేయముగాఁ దలఁచెనఁట! జైనమతమును మారువేషముతో నేగురువులకడ నేర్చెనో యాగురువులనే రాజసభలో నోడించి దేశభ్రష్టు లగునట్లు చేసి గురుద్రోహి యయ్యెనఁట!

ఆ రెండు మహాపాపములకుఁ బ్రాయశ్చిత్తముగాఁ గేవల కర్మబ్రహ్మవాది యగు నీ మహానుభావుఁ డంత్యకాలమునఁ “బ్రయాగమహాక్షేత్రము”నందు ‘తుషాగ్ని’లోఁ బడి యసువులను విడిచెనఁట!

---

1. ఆంధ్రోత్కలానాం సంయోగే పవిత్రే జయమంగలే. గ్రామే తస్మిన్మహానద్యాం భట్టాచార్యః కుమారకః॥ ఆంధ్రజాతి స్త్రిత్రికో మాతా చంద్రగుణాసతీ. యజ్ఞేశ్వరః పితా యస్య ...... మహావాదిర్మహాఘోరః శ్రుతీనాంచాభిమానవాన్ జినానామంతకస్సాక్షాత్ ! గురుద్వేష్టాతి పాపవాన్.

ఈతఁడు తుషాగ్నిలోఁ బ్రవేశించునాఁటికే శ్రీశంకర భగవత్పాదాచార్యులవా రాస్థలమునకుఁ జేరి కుమారిలభట్టాచార్యుని దుషాగ్నినుండి వెలువరించుట కెంతేని యత్నించెను గాని, కుమారిలుఁడు మనస్సాక్షికి వ్యతిరేక మొనర్ప నిష్టపడక కేవలబ్రహ్మవాదియగు శంకరునిసన్నిధినే దివంగతుఁ డయ్యె నని శంకరవిజయమునఁ గలదు.

ఆంధ్రజాతియం దుద్భవించిన 'యాపస్తంబమహర్షి'కిఁ బిమ్మట నతని కీర్తిసైసయాంధ్రుఁడు కుమారిలభట్టాచార్యుఁడే. ఆపస్తంబుఁ డాంధ్రపిత. కుమారిలభట్టాచార్య డాంధ్రుల కగ్ర సోదరుఁడు.



# లఘుటీక

## పరమేశ్వరస్తోత్రము.

1. అమృతమయుఁడు=మధురమైనవాఁడు, శాశ్వతుఁడు; వాచ్యము=చెప్పఁదగినది; భక్తిగమ్యుఁడు=భక్తిచేఁ బొందఁదగినవాఁడు. 2. సువ్యక్తము=స్పష్టముగాఁ గాన్పించునది; అవ్యక్తము=కాన్పించనిది; క్షేత్రము=శరీరము, వివి. వరిమడి, పుణ్యక్షేత్రము, భార్య; వ్యపదిష్టుఁడు=కార్యవంతుఁడు. 4 మాస...రూపు=మాసఋతుసంవత్సరములచేఁ బ్రకాశించు రూపముగలవాఁడు; 5. ఇరవు=స్థానము.

## కచుడు మృతసంజీవని నొందుట

1. అనిమిషవిరోధులు=రాక్షసులు. 2. సంగరము=యుద్ధము. 5 శమనుసదనము=యముని యిల్లు (నరకము) 7. తత్...దానము=తద్విద్యయును కన్యాదానము. 8. దుహితృస్నేహము=పుత్రికాప్రేమ 9 భానునిభా!=సూర్యునితో సమానమైనవాఁడా! 10 అభ్యాగతపూజ=తననిమిత్తము వచ్చువానిఁ జేయు గౌరవము. 11 పదపడి=తరువాత; చెయ్వులు=చేష్టలు. 12 విశాల...స్కంధంబున=పెద్ద మద్దిచెట్టు కొమ్మయందు. 13 వాడి...వాఁడు=తీక్ష్ణమైన కిరణములుగల సూర్యుఁడు; అపరాంబుధి=పశ్చిమసముద్రమును; ధేనువుల్=గోవులు; పోడిమి=బాగుగ 15. తేరఁగన్=తెచ్చుటకు; పోడవు=రూపము. సుర=కల్లు; ఒగిన్=బాగుగా 19. దనుజ...ఐన్=రాక్షసులచేఁ జంపఁబడినయెడ; అచ్యుత...జ్ఞ=స్థిరమైన ధర్మముఁ దెలిసినవాఁడా! 22. పతితుల=పాపాత్ములు, వివి. పడినవారు; మర్యాద=

కట్టుబాటు; వివి. సన్మానము, పొలిమేర. 26. ఉదర...ముఖమునన్=భేదింపఁబడినకడుపురంధ్రమునుండి; నిర్గమించెన్=బయలువెడలెను. 39. వేదమూర్తి=వేదస్వరూపుఁడు; వివి. జ్ఞానస్వరూపుఁడు.

## —♦ నీతికందవ్రాతము. ♦—

1. ఆశా...జనుఁడు=ఆశతోఁగూడినమనుజుఁడు. 3. అజ్ఞుఁడు=జ్ఞానహీనుఁడు; కోవిదుఁడు=పండితుఁడు. 4. వావిరి=ఎక్కువ. 6. సుధ=అమృతము; వివి. పాలు, సున్నము. 7. కొంకక=సందేహింపక; పుణ్యాభిరతుల్=పుణ్యాసక్తులు. 8. పంకము=పాపము, వివి. బురద; లోకాతంకము=లోకభయము. 9. కలంజము=గంజాయిచెట్టు. 10. అనవద్యగుణుఁడు=కొనియాడఁదగినగుణములు కలవాఁడు. 11. మితాలాపి=మితముగ భాషించువాఁడు; వదరును=ప్రేలును. 12. ధరాధరము=పర్వతము. 13. విషాద...వి=విచారముతోఁ బూయఁబడినహృదయము గలవాఁడై.

## —♦ రావణునిమోహాసక్తి. ♦—

1. నగధారి=విష్ణువు; తొడరి=ఎదిరించి; తత్...క్షీణులు=అతనియొక్క బాహులబలముచేత క్షీణించినవారు; హేమాక్ష...సురలు=హిరణ్యాక్షుఁడు మొదలుగాఁగల రాక్షసులు. 2. వలిగట్టు=హిమవత్పర్వతము; జితమారున్=జయింపఁబడిన మన్మథుఁడు కలవానిని; ఎఱఁగి=మ్రొక్కి. 3. అమల...నిధాన=స్వచ్ఛమైన జ్ఞానమునకు స్థానమైనవాఁడా! కరతలామలకముల్=అరచేతియందున్న యుసిరికపండ్లు; నతులైన=వినయముగలవారైన; అకౌటిల్యాత్మన్=నిర్మలమైన మనస్సుతో; 4. అనఘా!=పాపరహితుఁడా; అవ్యక్తుఁడు=తెలియరాకయుండువాఁడు; తథ్యంబుగాఁ=సత్యముగా. 5. నాన్=అనఁగా; 6. అవ్యయుఁడు=నాశములేనివాఁడు; అమేయుఁడు=పరిమితిలేనివాఁడు; అంజనదూరుఁడు=అజ్ఞానమునకు దూరమైనవాఁడు; ఉగ్గడింపన్=పలుక నారంభింపన్; అఖ్యలన్=పేళ్లచే; తెలుపు=చెప్పు; 7. లయము=నాశనము; ఖలుఁడు; దుర్మార్గుఁడు; శిష్టుఁడై=పా

ధువై; పాయున్=పోవును; 8 సంగరంబు=యుద్ధము; సురారులు=దేవతల శత్రువులు; రాక్షసులు. 10. ప్రణవంబు=ఓంకారము. ప్రాఁత + పలుకులు=ప్రాఁబలుకులు=వేదములు 12. మురభంజనుఁడు=విష్ణువు; అలరి=సంతోషించి; 15. చెల్వ=స్త్రీ; సరగన్=శీఘ్రముగా; 16. కంబు...వాఁడు=శంఖమువంటి కంఠముగలవాఁడు; చిలువ...పైన్=పాములను తినుగరుత్మంతుని మీఁది; 17. స్వైరవృత్తి=స్వేచ్ఛావృత్తి; 18. ఇందిరాశ్యామ=లక్ష్మీదేవి; ఒగిన్=బాగుగా; 19. బవరము=యుద్ధము. 20. నమికి=వెదకి; నొంచు=నొవ్వఁజేయు; అలంచు=ఆయాసపరచు

## —• పుత్రధర్మము •—

2. జతనంబు=ప్రయత్నము; కాఁపుంచి=కోరి. 3. ఎడన్=వ్యాపారము నందు. 4. ప్రసాదితులు=అనుగ్రహము చేయఁబడినవారు

## —:శ్రీరాముఁడు కైకతోఁ జెప్పి వనవాసోన్ముఖుఁ డగుట:—

1. కమ్మనిపలుకులు=ఇంపైనమాటలు; ఏఁగు=పోవుదును; విపి. నశించు; విడుచు; ముంగ్లపంత; లాఁతి=మఱియొకటి 2 అరమరలు=భేదము; నీయాన=నీతోడు. 4. సంగడికాండ్రు=స్నేహితులు, ఎన=సాటి. 5. భత్తి=భక్తి; తవిలి=తగిలి; కడుబెడఁగు=మిక్కిలి కఠినము. 8. అఱదెఁచె=సగమంగీకరించె; ఒడయఁడు=ప్రభువు; పజ్జన్=పక్షమున. 10. మాలి=మాని; చెడి=నశించి; ఒజ్జ=గురువు; పెగ్గడలు=మంత్రులు; పొలుపు=ఒప్పిదనము; అరు=నశించు. 11. పుడమికాన్పు=సీత; వలపు=ప్రేమ; ఎమ్మెకాఁడ!=విలాసవంతుఁడ!; ఎల=సౌఖ్యము; గొడవ=ఆపద, వివి. తప్పు, దుఃఖము, కలఁత; ఉసురుల యొడయఁడు=ప్రాణనాథుఁడు. 14. పోఁడిమిని=అందమును; రాణ=ఒప్పిదము; అన్నులకు=స్త్రీలకు; నెమ్మి=ప్రేమము, వివి. నెమ్మది, సంతోషము, క్షేమము, నెమిలి; కాఱియఁబెట్టు=బాధపెట్టు; కడంక=పట్టుదల. 18. దుగమొగములపుల్గు=గండభేరుండపక్షి; కయి=చేయిగొండ్లి; ఒకవిధమగునృత్యము; పొల=మాంసము; ఓగిరము=భోజనము; పొలంతుకలు=స్త్రీలు; గోల=

స్త్రీ; తలఁకుచు=భయపడుచు; జాను=అందము; వివి.సౌందర్యము; తొడవు తొడవు=అలంకారమున కలంకారమైనది; లక్కుమనుఁడు=లక్ష్మణుఁడు; పింగాణి=అమ్మలపొది. 23. గేస్తురాలు=గృహిణి. 24. నిగారము=ఇంపైన; తిట్టలు=రాసులు; బేల=అమాయకురాలు; అంతులు=కలకలధ్వనులు; చాలుపు=వరుస; జగా=గొప్ప; రక్కసి... గాడ్పు=రాక్షసు లనెడి మేఘములకు గాలియైనవాఁడు; నిరాదార్లు=మునులు; వేఁడి... వెల్గు=సూర్యవంశమునకు చంద్రునివంటివాఁడు. 30. అనుఁగా !=చెలికాఁడా !; తొగల... గేరు=చంద్రునితోఁపోలు; గుడారు=డేరా. 31. నిద్దపు... మోకా!=దట్టమై పూచిన మామిడి గున్నా !; కొఱకొఱ=కోపవికారము. 33. ప్రదుకుఁదొడుకు=కామధేనువు; పుదుకుక్ + తొడుకు; చలి... చేఁతకాఁడ=ఈశ్వరునిధనుస్సునువిరిచిన ప్రౌఢుఁడా !; జడధారి ..రాచకంద = ఋషిశ్రేష్ఠుఁడైన విశ్వామిత్రునితోఁ గూడఁ బోయి తాటకను సంహరించిన రాజకుమారుఁడా !; తలఁగని...జాణరాయి=తొలఁగని ఆపదలనుపొంది రాయియైయుండిన అహల్యను రక్షించిన శ్రేష్ఠుఁడా ; నీటూర...దిట్టలెంక=సొగసుగా నెదుర్కొనిన రాజసమూహముయొక్క తేజస్సు నణఁచినపరశురాము నెదిర్చినవాఁడా ! 36. దయ్యంబు=దైవము; వివి. పిశాచము. 37. అంగద=ఆపద; వివి. ఆకలి; కోపము; దుఃఖము; ఉపద్రవము; ఆఁడుది.

## భీముఁడు గదాయుద్ధమున దుర్యోధనునితొడలు విఱుగఁగొట్టి తలఁ దన్నుట.

1. ఒడ్డనము=ఆయోధనము; వివి. వ్యూహము, పందెము; ఉఱక=దాఁటు. 3. అడరి=అతిశయించి; కేలీవిభ్రమము=ఉత్సాహాతిశయము; క్రేళ్లుఱుకు=ఎగిరిపడు. 4. నగాగ్రముద్భట... పడక్=పర్వతశిఖరము అతిశయించిన వజ్రపుదెబ్బచే పడినరీతిని పడఁగా. 5. గంధశుండాలంబు=మదపుటేనుఁగు. 9. కల్లసారెలు=కపటపుపాచికలు; నెత్తము=ద్యూతము: ఒప్పనివారిక్=శత్రువులను. 12. ఘస్మరుఁడు=నాశకుఁడు. 15. హర్షా... చారిత్రుండు=సంతో

పావేశము చేత నీచమైనచరిత్ర గలవాఁడు. 16. ఏగు=విడుము. 19. వేరంబు=విరోధము. 25. గీటుబుచ్చు=అనాదరించు; నెఱయగ=ఒప్పునట్లు; ఉత్ఫుల్లంబు లగు=వికసించిన. 26 కులపాంసనుఁడు=కులదూషకుఁడు. 30 ఆలము=యుద్ధము; అక్కటికము=కనికరము; నెఱి=క్రమము; వివి. ఆచారము, న్యాయము; ఉక్కివుఁడు=కఠినుఁడు. 31. అగ్గము=గుత్తి. 32. ఊఁదికొని=అవలంబించుకొని; జిష్ణుతోడఁగ=అర్జునునితో. 35 అంహోరహితుఁడు=పాపరహితుఁడు.37.జతుగృహము=లక్కయిల్లు;పొదివి=చుట్టుకొని;నిష్కృతి=విమోచనము; వృథాజల్పంబు=వ్యర్థమైన ప్రేలాపనము. 39అనుసంధించు=కూర్చు; తారు=తవరు. 40. అలఁతురు=అల్లులు.

## రావణుఁడు సీత నెత్తుకొనిపోవుట.

1. పఙ్క్తిరథ ... వసు = దశరథునియొక్క శ్రేష్ఠమైనసంతానముయొక్క; ఉటజము=పర్ణశాల; 2 బికిరము = భిక్షము. 5. నగేష్వాసనుండు=మేరుపర్వతమే ధనుస్సుగాగల యీశ్వరుఁడు; హీరరదన = వజ్రములవంటి దంతములు గలది; కనకేని... ఈశ్వరుఁడు=హస్తునేని ధనముగలకు బేరుండు; స్వారాజ్యపతి=ఇంద్రుఁడు; స్వర్ + రాజ్యపతి. 7. కుహనాముని= కపటఋషి; 9. కూళ=తుచ్ఛుఁడా ! సదళికమునీంద్రుఁడన్=సత్యమైన కపటపుఋషిని; 11. శాంబరీముని వేషంబు = మాయామునివేషము. 14. జోడుబిడి ...కరణి=జతను విడిచి విచారించు చక్రవాకపక్షివలె.

## చంద్రగుప్తుఁడు ఆతనిపుత్రిక చంద్రవతి.

1. ఉర్వర=భూమి; జనా ... ధ్వాంతములు=జనులయొక్క దరిద్రమనెడు చీకట్లు; ఉత్కటకీర్తిచంద్రికల్ = అతిశయించిన కీర్తియనెడి వెన్నెలలు;చక్రవాళాంతభూచక్రమునను=చక్రవాళపర్వతమువరకుండినగుండ్రనైన భూమియందు; చంద్రచంద్రాతపామృతచారుకీర్తి= కర్పూరమువలెను వెన్నెలవలెను అమృతమువలెను; సుందరమైన కీర్తిగలవాఁడు; డాలు=కాంతి; వి. వి. ఆయుధవిశేషము. పులు=రత్నమాలిన్యము. 4.గిలుమాడి=

అపహరించి; 7. వైకుంఠాక్షి... తాయ=విష్ణుమూర్తిచేత నొకప్పుడు కన్నియఁబడినవానికొఱకు; దివిషదభ్యంద్యాయ=దేవతలచేత నమస్కరింపఁబడినవానికొఱకు. 10. అభినవగతులన్=క్రొత్తరకమైన గమనములచే; 11. అశ్వముఖాంగనల్=కింపురుషస్త్రీలు; చంద్రవతీనవగాన...రాజితోన్ = చంద్రవతియొక్క క్రొత్తగాన మనెడి వెన్నెలసమూహ మనెడి అమృతమును అనుభవించుటచే సుఖపడిన చకోరపక్షులసమూహముతో: 12. నీరసతరుల్=ఎండినచెట్లు; 14 ఈపద్యములో పెసపాదములయందు "ముక్తపదగ్రస్తము" గలదు 18. అర్జునపర్ణము - తెల్లనిపర్ణము.

## —♦ అశోకవనములోని సీతను హనుమంతుఁడు చూచుట. ♦—

### (ద్విపదలు)

ఎలమి=ఇంపైన; జొంపరి=గుబురైన; శింశుపావృక్షము=అశోకవృక్షము; పనటులన్=ఆపదలచేతను; క్రుస్సి=కృశించి; చెలువము=సౌందర్యము; ధృతి=ధైర్యము; ఇనరశ్మి = సూర్యకిరణము; ఎలదీఁగ = లేఁతతీఁగ; నారీశిరోమణి=స్త్రీరత్నము; వేలీల=వేయివిధముల; శాఖా...ఇంద్రుఁడు=శాఖామృగములలో శ్రేష్ఠుఁడు; భావించిభావించి=ఊహించి యూహించి; కడఁక=యత్నము; కాకుత్స్థుఁడు=కకుత్స్థునిగోత్రమునఁ బుట్టినవాఁడు, నెఱసినబుద్ధి=నిండినబుద్ధి, కొనకొని=యత్నించి, పేర్కొని=చెప్పి; విన్నన=ఖిన్నత్వము, ఒగిన్=బాగుగా, శ్రీకంఠుఁడు = ఈశ్వరుఁడు, నలిన్=అత్యంతము.

## —♦ కఠోపనిషత్తు. ♦—

1. యాజకులు=ఋత్విక్కులు; 2. ఎనయు = సరిపోలు. 3. కనలి=కోపగించి. 6. జీర్ణము=అరుగు, వివి. నశించు; 7. మృత్యువు=యముఁడు. వివి. చావు; కృత్యము=కార్యము; 8. ఉడిగి=తగ్గి; దఱియు=దగ్గఱకువచ్చు; 11. క్షుత్పిపాసలు=ఆకలిదప్పికలు, ధర్ముఁడు= యమధర్మరాజు. 12 నచికేతాగ్ని=నచికేతమను పేరుగల యజ్ఞాగ్ని. ఆత్మ=జీవనము, వివి. పరమాత్మ,

తాను, మనస్సు. కాలుఁడు=యముఁడు. 15. గొబ్బునన్=తటాలున. అవిద్య=అజ్ఞానము. విద్య=జ్ఞానము. సువిద్య=మంచిజ్ఞానము. 16. అణుగతి=సూక్ష్మగతి. బ్రహ్మసాక్షాత్కృతి=బ్రహ్మను ప్రత్యక్షము చేసికొనుట; తర్కము=ఊహ, వివి. కారణము, కోరిక, ఒకశాస్త్రము. ఉజ్జ్వలము=ప్రకాశించునది. 17. పొరయు=కలిగించు. 18. ప్రాప్యము=పొందఁదగినది. ఈ......సాధనంబు=ఈ సగుణనిర్గుణ పరబ్రహ్మములను సాధించెడి; అజంబు=పుట్టుక లేనిది.

## —♦ రామరావణుల ప్రథమయుద్ధము—రాముని న్యాయబుద్ధి ♦—

1. అనికిన్=యుద్ధమునకు; రథి=రథము కలవాఁడు. 2 ఐరావత... చెలువు=ఐరావతమనెడియేనుఁగు నెక్కిన యింద్రుని సొగసు; అగ్గలించి=అతిశయించి; శింజినీ...టంకృతుల్=ధనుస్సుయొక్క ఘోరమయిన టంకారధ్వనులు; ఎలుఁగు=కంఠధ్వని. 3. కమలాసనప్రభృతులు=బ్రహ్మ మొదలయినవారు. 4 పావక...పంక్తి=ఆగ్నేయాస్త్రమునకలదృఢమయినబాణములయొక్క సమూహము. 5. కన్నుఁగవన్=రెండునేత్రములయందు; కెంపు=ఎఱ్ఱనిరత్నము. 6. తేరిచక్రముల్=రథచక్రములు; పైపాడవు=పైభాగము; కైదువుల్=ఆయుధములు; ఎల్లి=గొడుగు; వివి. తేపు. 7. అశనిసంకాశము=పిడుగుతో సమానమయిన; కొంకఁజేసి=కుంగఁజేసి; తోన=వెంటనే; కోటీరకపంక్తి=కిరీటముల సమూహము. 9. మైవిరవిరవాఱన్=శరీరము బాధపడఁగా; చేసడలి=చేయిజారి. 10. దప్పి=ఆయాసము; కడంగుము=సిద్ధపడుము; తేరిక నుంగొనన్=పరీక్షించి చూడఁగా.

## —♦ వర్షకాలము—శ్రీకృష్ణుని ప్రవర్తనము ♦—

1. పరివేషము=సూర్యునిచుట్టు నుండు గుడి; దక్షిణగాములు=దక్షిణమునకుఁ బోవునవి; వానకందువ=వర్షర్తువు. 2. నల్లగీఱలు=నల్లనిరేఖలు. 3. జీవనము=బ్రతుకు తెరువు; వివి. నీళ్లు; ఘనుఁడు=గొప్పవాఁడు, వివి.

మేఘుఁడు; డిందుపడి=తగ్గి. 4. బ్రిలంబవైరి=బలరాముఁడు. 5. ఈపద్యమునందు రూపకాలంకారము చెప్పఁబడెను. 6. వృషవత్సములు = ఎద్దులు; లేఁగలు.

## ప్రవరుఁడు—వాని పరిస్థితి

1. ఆర్యావర్త దేశము=వింధ్యపర్వతమునకును హిమాలయ పర్వతమునకును మధ్యనుండు దేశము. 2. మకరాంక...మూర్తి = మన్మథునివలెను చంద్రునివలెను సుందరమయిన రూపముఁ గలవాఁడు; భాసా...భోగి=పలుకుటయందు రెండవ శేషాహి యయినవాఁడు. 3. యజ్వ=యజ్ఞము చేసినవాఁడు; కూకటుల్...సోమిదమ్మ=జొట్టుముడులు కొలిచి చేసిన సోమిదేవి; 4. ప్రత్యూష...అంకురములు = ప్రాతఃకాలపు లేఁత వాయువులు; వామనస్తుతి పరత్వమునన్=విష్ణుమూర్తియొక్క స్తోత్రాసక్తిచే, సచ్ఛాత్రుఁడు=శిష్యులతోఁ గూడినవాఁడు; నిచ్చలు=ఎల్లప్పుడు; అఘమర్షణస్నానము=పాపములను బోఁగొట్టెడిస్నానము; సావిత్రి=సావిత్రియనెడిమంత్రము; కర్మసాక్షి=సూర్యుఁడు. 5. సాలగ్రామము మున్నుగాన్ = సాలగ్రామదానము మొదలుకొని (సాలగ్రామదానము బ్రాహ్మణుఁడు పట్టఁదగిన దానములలోఁ బవిత్రమయినది. 6. ఉద్ది=సాటి; నడికిరేయి=అర్ధరాత్రము 7. ఈ పద్యమునందు ముక్తపదగ్రస్తాలంకారము కలదు. 8. కుతపకాలము=అతిథిసత్కారము చేయఁదగిన కాలము.

## శ్రీరాముఁడు రావణునిఁ బ్రశంసించుట

2. ధైర్య...అయి = ధైర్యముచేతఁ గొనియాడఁదగిన మనస్సు గలవాఁడవయి; విగతార్తతన్=పోయిన విచారముచేత. 3. వరజన్యములన్=శ్రేష్ఠమయిన యుద్ధములయందు. 5 నీరంధ్ర...ప్రతాపము=దట్టమయి ప్రసిద్ధికెక్కిన పరాక్రమముచే; మన్నారె ?=మనియున్నారా? విస్మయ...నిష్ణాతుఁడు=ఆశ్చర్యకరమైన యుద్ధవ్యాపారమునందు నేర్పరి; శోచ్యుఁడు=విచారింపఁదగినవాఁడు.

## మండిరాజుశాసనము.

1. స్వస్తి=శుభమున్నది. (ఈపదము శుభలేఖలు మొదలగువానియందుఁ జేర్పఁబడుమంగళపదము.) సమధిగత...మండలేశ్వరుఁడు=పొందఁబడిన ఢక్కా-మురహాది యైదు రాజచిహ్నములుగల యొకదేశభాగమున కధికారి; రణ...రామ=యుద్ధమందు రాముఁడా!; అలంకభీమ!=కళంకములేని భీముఁడా! సత్యరాధేయ=సత్యమునందుఁ గర్ణుఁడా! శౌచగాంగేయ=శుచియందు భీష్ముఁడా!; దుర్జయ...నిశాకర!=దుర్జయులనంశ మనెడి కలువలుగల పాలసముద్రమునకుఁ జంద్రునివంటివాఁడా!; సుకవికీరసహకార!=మంచికవులనెడి చిలుకలకు తియ్యమామిడిచెట్టా! (లేక) చిలుకలవలె నింపుగఁ బలుకుకవీశ్వరులకు సహాయ్యము చేయువాఁడా!; తురగరేవంత!=గుఱ్ఱపుస్వారి చేయుటయందు నిపుణుఁడా!; 2. హార...నిధి=హారము మంచు పద్మసమూహము ఈశ్వరుఁడు నవ్వువంటి కీర్తికి స్థానమయినవాఁడు, చతుర్థ...నిస్తారకుఁడు=శూద్రవంశమును తరింపఁజేయువాఁడు; ఎఱ్ఱమండఁడు=ఎఱ్ఱమండఁడనుప్రభువు. 3. వైరి...లుంటాకుఁడు=వైరిజనులను దోఁచుకొనువాఁడు. 5. (ఈపద్యమునందు శాసనములలో వ్రాయఁబడుసంఖ్యాపదములు చెప్పఁబడినవి. మఱియు సంఖ్యానాం వామతో గతిః అనుపద్ధతి ననుసరించి కూడ సంఖ్యలను తలక్రిందులుగాఁ బరిగణింపఁబడెను.) అంబర=సున్న; సాయక=ఆయిదు; అంబర=సున్న; మృగాంక=ఒకటి (1050) ఇవి శాలివాహనశకము ననుసరించి వ్రాయఁబడెను. అనఁగా, క్రైస్తవశకము 1050 + 78 అగును.

## భామినీ విలాసము

(ఈ పద్యములు మనస్సునందు నొకవ్యక్తి నుద్దేశించి, యావక్తి పేరు చెప్పక వేఱు పేరుపెట్టి చెప్పుటయె.) 1. ఇది యొకమహాపురుషుని జూచి సహింపలేక యితరులు మనస్సునందు దిగులుపఱచుకొనుట మామిడిపండు మిషపెట్టి చెప్పఁబడెను. 2. ఇందుఁ బక్షపాతముచేత నొక మంచి వ్యక్తిని

వదలివేసిన యంశము తుమ్మెదను సంపెంగను పోల్చి చెప్పఁబడెను. 3. దీని యం దిద్దఱు మంచి వ్యక్తు లొకరినొక రెఱిఁగియుండియు వారి నొకరినొక రు గౌరవింపకుండుట సంపెంగ తుమ్మెదలతోఁ బోల్చి చెప్పఁబడెను. 4. ఈ పద్యమునందు మంచిమాటలను పలికెడివారికి నిర్బంధము కలుగుట పంజరమునం దుండిన చిలుకను బోల్చి చెప్పఁబడెను. 5. ఈ పద్యమునందు మంచిపలుకులు సౌందర్యము మంచి స్వభావముకల వ్యక్తి దుర్మార్గుని యెదుటను నిరాకరింపఁబడునని చిలుక పిల్లి అనువానిని బోల్చి చెప్పెను. 6. ఈ పద్యమునం దుత్తమపాత్రము దొరకినప్పుడే దానము చేయవలయునను యంశమును మేఘమును చాతకపక్షిని పోల్చి చెప్పఁబడెను. 7. కనఁబడి నంత మాత్రమునకే ప్రతి వ్యక్తిని నోరు చాచి యాచింపరాదు. అట్లు చా చినచోఁ గొన్నియెడల వ్యర్థమగును. ఈయంశము చాతకమునకును మేఘ ములకును పోల్చి చెప్పఁబడెను.

# వచనభాగము

## బాలభారతకథలు.

పేజీ 77. పంచకల్పకములు = మందారము, పారిజాతము, సంతాన ము, కల్పవృక్షము, హరిచందనము; తపో...ఉపలాలితులు = తపస్సేధనము గాఁగల ఋషులచేఁ బ్రేమింపఁబడినవారు; 78. కుహూముఖము = కోయిల కలతము; మధుమాసము = చైత్రమాసము, మాధవుఁడు = వసంతుఁడు, వి.వి. వి ష్ణువు; కుట్మలము = మొగ్గ; మద్రరాజపుత్రి = మాద్రి; మనోజుఁడు = మన్మ థుఁడు; 79. పృథ = కుంతి; విధివ్యాఘ్రుఁడు = దైవ మనెడి కేఁటగాఁడు; పితృమేధకర్మములు = మృతినొందినవారిని పురస్కరించి చేయుకర్మములు; 80. పాంసుక్రీడలు = బూడిదలో నాడెడియాటలు; వైనతేయుఁడు = గరు త్మంతుఁడు; కాద్రవేయులు = సర్పములు; భోగిబద్ధము = వాసుకి యనుసర్పము చేఁ గట్టఁబడినది; సింధువు = నది, వి.వి. సముద్రము; గాడ్పుపట్టి = భీముఁ

డు; కబళగోపితము=తినెడియన్నమునందు దాఁచఁబడినది; విహ్వాలుఁడు=అవయవముల స్వాధీనత తప్పినవాఁడు ; 81. వారివాహము = మేఘము; 82. రసాతలము=పాతాళలోకము; నీరోగి = (నిర్ + రోగి) రోగముపోయినవాఁడు; గౌతముఁడు= కృపాచార్యుఁడు; గురోత్తరులు ... వస్తువు= గొప్పతనముగలవారున్నతవస్తువులను గోరుదురు; పైతృకము=తండ్రికి సంబంధించినది; సోమకుఁడు = ద్రుపదుఁడు; 83. సకాశము=సమీపము; దుగ్ధకాంక్షి = పాలను గోరువాఁడు ; యజ్ఞసేనుఁడు = ద్రుపదుఁడు ; రేణుకా ... పూతము = రేణుకపుత్త్రుఁడైన పరశురాముని పాదములయందలి ధూళిచేఁ బవిత్రమైన ; సగుణము = ఎక్కుపెట్టఁబడినది , గుత్తి = లక్ష్యము. 84 సాలవృక్షము = మద్దిచెట్టు. 85 సింహసంహననుండు = సింహముతో సమానమైన దేహము గలవాఁడు , త్రపితులు = సిగ్గుగలవారు ; మరము=మరణము; పౌరవుఁడు=పురువంశమునఁ బుట్టినవాఁడు. 86. శిరస్త్రాణము=కుళ్లాయి; అర్జున...ప్రణష్టము=అర్జునునియొక్క సైన్యమనెడి ప్లవమునకు నోంకారమగుట; సృంజయులు=పాంచాలసైనికులు; పార్షతుఁడు=ద్రుపదుఁడు. 87 సృక్వ... జిహ్వుఁడు = పెదవిమూలలయందుఁ జలించుచుండిన నాలుకగలవాఁడు. ఫల్గునప్రణయిని=అర్జునునిఁ బ్రేమించెడి స్త్రీ. సవనా...సంభృతము=యజ్ఞముయొక్క యంతమునందు సంపాదింపఁబడినది; యాజముని=యజ్ఞము చేయించు ముని. 88. కృష్ణ=ద్రౌపది; తాత=తండ్రి; వివి. పితామహుఁడు, బ్రహ్మ; 89. జతుగృహము=లక్కయిల్లు. 90. దరికొల్పు=అంటించు; ఖనకుఁడు = ఉప్పరివాఁడు; వనేచరి = కిరాతస్త్రీ. 91. పరివేత్త=అన్నకంటె ముందు పెండ్లియైనవాఁడు. 92. వజ్రపాతముం బోని=పిడుగు పడుటతో సమానమైన. 93. పరాశరాత్మజుఁడు=వ్యాసుఁడు; 94. సమయము=ఒడంబడిక, వివి. కాలము, శపథము; వేతనము=జీవనాధారము; భాగధేయము=బలి; వివి. కప్పము; పనవు=విచారము; 95. నృశంసుఁడు=ఘాతుకుఁడు; ఖేచర...పాత్త్రులు=దేవతలయొక్క స్తోత్త్రమునకుఁ దగినవారు. 97. ఫల్గునుఁడు=అర్జునుఁడు; పథికులు=మార్గస్థులు; సార్థ

వాహకులు=వర్తకులు. 98. పంచబాణవిద్ధులు=మన్మథునిచేఁ గొట్టబడినవారు;శరవ్యము=గుఱి; అక్షవిద్య=ద్యూతవిద్య;పినాకి=ఈశ్వరుఁడు. 99. శౌరి=శ్రీకృష్ణుఁడు; నిస్తంద్రులు=తొందరలేనివారై. ధనురారోపణము=ధనుస్సునెక్కు పెట్టుట. 100. గుణము=వింటినారి; వివి. స్వభావము; కల్హారమాల=కలువదండ; శుల్కచాపము=పందెపు సొమ్ముగా నిడిన ధనుస్సు; 104. లాజహోమము=వివాహసమయమున వరపేలాలతోఁ జేసెడి యొకహోమము; ఘర్మ...కరముల్=చెమటతోఁ దడిసిన చేతి ; పుష్కరచాయువు=పద్మముతో సుందరము. 105. పర్ణశాలిక=ఆకుటిల్లు; 106 ఆలవాలము=బోదె; ప్రోదిచేయు=పోషించు; ప్రియమండనము=ఇష్టమైన యలంకారము; నూతన...ఉద్గమము=క్రొత్తపువ్వు బయలువెడలునపుడు. 107. కాశ్యపుఁడు=కశ్యపుని గోత్రమునఁ బుట్టినవాఁడు (కణ్వమహర్షి). 110 జాతాశౌచదినములు=పురిటిదినములు; మేధ్యము=పవిత్రము, వివి. మధింపఁదగినది; తథాస్తు=ఆరీతి నగుఁగాక ! 111. ఇష్టి=యజ్ఞము; సన్నాహశీలి=యుద్ధమునందు స్వభావముకలవాఁడు. 113. ఋత్విక్కులు=యజ్ఞమును చేయించు పురోహితులు; 114. విశసింపఁబడు=హింసింపఁబడు; 'బ్రహ్మవర్చస్వి=బ్రహ్మతేజస్సుఁ గలవాఁడు.

## —♦ హృదయశల్యము. ♦—

119. కుక్షులు=కడుపులు; అంతర్హితుఁడు = అస్తమించినవాఁడు; ఓంకారనినాదము = ఓంకారధ్వని. జవ్వని=యువతి. 121. దండప్రహారములు=కఱ్ఱదెబ్బలు. ఇతి...మూఢ=ఇది చేయవలయు నను నది తోఁచనిది. 122. ఆగంతుకుఁడు=వచ్చినవాఁడు. ప్రతిఫలనము=మాఱురూపుతోఁచుట. 123. వెల్లివిరియు=ఉప్పొంగు; ముప్పిరిగొను=పెనఁగొను. 126. అతః...ద్వారము=లోపటింటియొక్క సింహద్వారము. 127. తన్మూల్యము=దానివెల. అభ్యంతరగృహము=లోపటియిల్లు. 128. నర్మగర్భములు=పరిహాసముగలమాటలు. ఖిన్నము = విచారము. 129. అంతస్తాపము=మనోవిచార

ము. హృదయశల్యము = హృదయమునందుండిన బాధ, వివి. హృదయమునందుండిన విషము. క్షేత్రము = పొలము, వివి. శరీరము, పుణ్యస్థలము, భార్య. 130. కేళాకూళులు = జల క్రీడా స్థలములు 131. కంటకము = ముల్లు, వివి. రోమాంచము, సూదిమొన. 134. జోహారు = నమస్కారము. పాదరాజీవములు = పాదపద్మములు. ఆపాదించును = కలిగించును.

## ఆపస్తంబమహర్షి.

136. సులభక్రోధి = స్వల్పకారణముచేఁ గోపగించువాఁడు. 137. వృత్తిహీనులు = బతుకుఁదెరువు లేనివారు. ఆయుధసేవకులు = ఆయుధములంబట్టి వేఁట మొదలగువానిచే జీవించువారు అథర్వవేదవేత్తలు = మంత్రశాస్త్రమును దెలిసినవారు. అనక్షరులు = చదువుకొననివారు. 139. అనులోమ...వివాహములు = ఉత్తమజాతివారు తక్కువజాతిస్త్రీని పెండ్లియాడుట, తక్కువజాతివారుత్తమజాతిస్త్రీని పెండ్లియాడుట. ప్రశిష్యుఁడు = శిష్యునిశిష్యుఁడు. మనుమార్గవర్తి = వైవస్వతుఁడు మొదలగు మనువులయొక్క మార్గమునందుఁ బ్రవర్తించువాఁడు. 141. విజ్ఞానఖని = బ్రహ్మజ్ఞానమునకు స్థానమైనవాఁడు. బ్రహ్మవాది = వేదాంతి. లోకప్రథ = లోకమునందువాడుక. 145. అభిచారహోమాదులు = చిల్లంగి మొదలైనవి. 146. ఆధివ్యాధులు = మనశ్శరీర రోగములు. 149. యాగవేదిక = యజ్ఞమునందలి యరుగు.

## కాత్యాయనచరిత్రము

150. ప్రమథుఁడు = ఈశ్వరసేవకులలో నొకసంఘమునకుఁ జేరినవాఁడు 151. మనుష్యసులభము = మనుష్యులకు వేగముగ లభించునది; తచ్ఛాపానుసారము (తత్ + శాప + అనుసారము) = ఆశాపము ననుసరించి; భర్తృ...విహ్వల = భర్త లేమిచే విచారించుచున్నది. 152. ఏక...గ్రాహిత్వము = ఒక్కసారి వినుటచేతనే గ్రహించుట. 153. ఏకాగ్రచిత్తులము = ఒక్కదానినె యుద్దేశించిన మనస్సు గలవారము; ఆదేశించెను = ఆజ్ఞాపించెను; సాభిజ్ఞానముగన్ = ఆనవాలుతో; వర్షగుణానురక్త = వర్షునియొక్క గుణముల

యం దనురాగము గలది; దుర్గతి=బీదతనము; వివి. నరకము. 155. సాంగోపాంగములు=శిక్షాఛందస్సు మొదలగునవి వేదమునకు అంగములు, ఆశిక్షాదులను బలపఱచెడి మీమాంసశాస్త్రాదులు ఉపాంగములు, వానితోఁ గూడినవి సాంగోపాంగములు. 156. విద్యా...గతుఁడు=విద్యలయొక్క యంతమును జూచినవాఁడు; కన్నెమిన్న=శ్రేష్ఠురాలైన కన్యక; తదాసక్తము=ఆమెయందుఁ దగులము పొందినది. 167. మావిగున్న=లేఁతమామిడిచెట్టు; గురుజనాదత్త=తల్లిదండ్రులచే నీయఁబడినది. 159. నిర్విణ్ణుఁడు= నిరాశ నొందినవాఁడు; వైయాకరణఖసూచులు=వ్యాకరణశాస్త్రసంబంధము తెలియక నాకసమువైపు చూచువారు; 159. అత్యాహితము=గొప్పయాపద 160. కుమారసచివుఁడు=మంత్రికుమారుఁడు. 161. భాగధేయము=అదృష్టము; కృతాంత !=యముఁడా ! 162. జాల్ముఁడు=తుచ్ఛుఁడు; పెద్దనుందపము=పెద్దపెట్టె. 163. అభ్యంగసుఖము=స్నానసుఖము; పురోధ=పురోహితుఁడు; పరిలోభితుఁడు=ఏకేసముగా నాశ పెట్టఁబడినవాఁడు; అంధతామిస్రవాసము=అంధతమిస్రమను నరకనివాసము. 164. ధూర్తాగ్రేసరా !=గొప్పమోసగాఁడా !; బచ్చు=వర్తకుఁడు 167. సతీర్థ్యులు=సహపాఠులు; యోగసిద్ధుఁడు=యోగాభ్యాసముచే సిద్ధి నొందినవాఁడు; ధర్మసేతువు=ధర్మమునకుగట్టు. 168. నిరవలంబ=ఆధారము లేనిది: ఆనందతుందిలములు=హెచ్చైన ఆనందములు కలవి. 169. కొజ్జా=రాణివాసపు కావలివాఁడు.

171. కట్టడ=ఏర్పాటు; అతర్కితముగ=ఊహింపఁబడనిరీతిని. 172. విషయ...ముగ్ధుఁడు=ఇంద్రియార్థము లనెడివిషములచే మూఢుఁడైనవాఁడు; మృగమరీచిక=ఎండమావియందలి కాంతి. 173. సాచివ్యభారము=మంత్రిత్వపుభారము; అసక్తుఁడు=ఆసక్తి లేనివాఁడు. 174. రాజకార్యావేక్షణము=రాజకార్యములను జూచుట; వైతసవృత్తి=నీటిప్రబ్బలితీఁగయొక్క వ్యాపారము (నదీతీరమునందుఁ బ్రబ్బలితీఁగ యుండును. అది నీటిలోనికే వ్రాఁలును. కాని నీటిప్రవాహముచేఁ గొట్టుకొనిపోక నీటివడి ననుసరించి యుల్లం

వాకుచు రొండవలు నిలుపుకొనును. ఇవియే వైతసవృత్తి) శ్లిష్యత్పంచాంగులి=దగ్గఱగ నుంచఁబడిన యైదుఁ వ్రేళ్లుగలది. 175. చింతితోపస్థిత=ఊహించుట చేతనే వచ్చినది 177. లక్షణాంతరము=మతియొకచిహ్నము; మృగయా...చిత్తుఁడు=వేఁటయందాసక్తిగల మనస్సు గలవాఁడు. 178. ఉపధానము=తలగడ, 179. తూష్ణీంభావము=ఊరకొనుట; సముద్భ్రాంతచేతనుఁడు=తిరుగుడుపడిన మనస్సు గలవాఁడు. 181. నిమంత్రితులు=పిలువఁబడినవారు 182. వింధ్యవాసిని=కాళికాదేవి. 183. శాకరసుఁడు=కూరగాయలయందే యాసక్తి కలవాఁడు; పరిఘము=అడ్డుగోడ; వివి. పరిఘాయుధము.

## —♦ కుమారిలభట్టాచార్యుఁడు ♦—

186. దుర్మత నిర్మూలనము=దుష్టమతములను నిర్మూలించుట; ఈర్ష్య=అసూయ; 187. వేద. కర్మములు=వేదమునందుఁ జెప్పఁబడిన యజ్ఞాదికర్మములు. 190. ఖండనమండనములు=పూర్వపక్షసిద్ధాంతములు 191 ముఖపిధానము=మోమూయుట; జితాస్మి=జయింపఁబడితిని. 193 కర్మబ్రహ్మవాది=కర్మమే పరమేశ్వరస్వరూపము గాఁ దలంచువాఁడు. 194 తుషాగ్ని=ఊకయందుంచఁబడిన యగ్ని.